


నాట్యగత్తె

—చిత్రం: ఎమ్. ధనం, మద్రాసు.

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

సంవత్సర చందా
రు. 13—0—0
విడిప్రతిక 25 న.పై

**Founder: K. NAGESWARA RAO**

విళంబి ఫాల్గుణ శుద్ధ అష్టమి బు వారం

సంపుటము 53
సంచిక 25
**18-3-59**


## విషయానుక్రమణిక

ముఖచిత్రం:
గీతాపిక్చర్స్‌వారి 'ఋష్యశృంగ'లో
రాజసులోచన





# విశాఖపట్నం విశేషాలు



పోలీసుశాఖకన్నా, పోలీసులకన్నా విశాఖపట్నంలో రిక్షాలాగే కూలీలు బలవంతులంటే ఆంధ్రప్రజ నమ్మకపోవచ్చును. దీనికి ఉదాహరణ చెబుతున్నాను. డాబా తోటలో-పట్టణంలో తిరిగే సిటీ బస్సును అటకాయించి-మొన్న ఆపివేశారు. కారణం ఏమిటంటే-సిటీ బస్సులు వచ్చాక-చాలామంది రిక్షాలు ఎక్కటం లేదుట. వారి రాబడి తగ్గిపోయిందట. పాపం క్రొత్తగా ఈ ఊరికి ట్రాన్స్‌ఫరు అయివచ్చిన సబిన్‌స్పెక్టరు-బహుశా రిక్షావాళ్ళ బలం తెలియక-బహుశ్రమప్రళయంమీద-ఆ బస్సును రిక్షావాళ్ళు బ్రద్దలు కొట్టకుండా కాపాడి బస్సునూ, బస్సు డ్రైవరునూ-అందులో ప్యాసింజరులనూ రక్షించారు. ఈ విషయం బహుశా పై అధికారులకు తెలిసి వుండదు. తెలిస్తే ఆయన్ని కోప్పడివుండేవారు.

ఒక పోలీసు కానిస్టేబులు చెప్పాడు ఈ క్రింది విషయం. ఇంకో పోలీసు కానిస్టేబులు వుండేవాడుట. క్రొత్తగా వచ్చాడుట. ఈ ఊరి రిక్షావాళ్ళ బలం తెలియక-వాళ్ళని లైసెన్సులు అడగడం-బళ్ళ లైసెన్సులు అడగడం చేస్తూవుండేవాడుట. ఒకనాడు మెల్లిగా స్నేహితుల్లాగ కొందరు రిక్షావాళ్ళు నటించి-ఆ కానిస్టేబులూ తామూ కలిసి-త్రాగి-తాము తప్పుకుని-త్రాగని పోలీసు కానిస్టేబుల్‌చేత-సూపరెంటెండెంటు గారికి-ఫోన్ చేయించారుట. డాక్టరుగారు పోలీసు త్రాగి వున్నాడని సర్టిఫై చేశారు. పోలీసును ఉద్యోగంలోంచి బర్తరఫ్ చేశారు పెద్ద అధికారులు.

బహుశా అప్పటినుంచీ-మా ఊరు పోలీసులకు రిక్షావాళ్ళంటే భయం మొదలైంది.

కొన్ని వందలు లైసెన్సులులేని రిక్షాలున్నాయి. వాటిని త్రొక్కటానికి లైసెన్సులులేని రిక్షావాళ్ళు కొన్నివందలు వున్నారు. పోలీసులు వాళ్ళజోలికి వెళ్ళరు.

* * * *

కేంద్ర రైల్వే ఉద్యోగులు - రైలు ప్రయాణీకులకు సహాయం చేద్దామనే ఉద్దేశ్యంతో కాబోలు- వాల్తేరు స్టేషనుకు ఓ ఫర్లాంగు దూరంలో రిక్షాలకు దొడ్డి నిర్మించారు. ప్రయాణీకులను ఆ దొడ్డిలో దింపేస్తారు. అక్కడనుంచి స్త్రీలైనా సరే - ఇద్దరు ముగ్గురు పిల్లలతో ప్రయాణం చేస్తూన్న తల్లులైనా సరే—లైసెన్సు కూలీలకు శత నమస్కారములు చేసి, ఫర్లాంగూ స్టేషనులోకి - లైసెన్సు కూలీలు చెప్పినంత ఇచ్చి - ప్లాటు ఫారం మీదకి వెళ్లాలి. ఇది రైలుఎక్కి వెళ్లేవారి ఉదంతము. దిగేవారి సంగతి చెప్పండి. లైసెన్సు కూలీ సరిగ్గా గేటు ఇవతలకి తెచ్చి



ఆకాశవాణి ఢిల్లీ కేంద్రం ఫిబ్రవరి 28న జాతీయ సంగీతకార్యక్రమం సందర్భంలో ప్రసారంచేసిన "మాళవికాగ్నిమిత్ర" నాటకంలోని ఒక దృశ్యం. నృత్య సంగీతరూపంలో ఈ నాటకాన్ని శ్రీమతి మృణాళిని సారాభాయి, ఆమె నృత్యబృందం 'దర్పణ' సమర్పించారు.

# ★ విశాఖపట్నం విశేషాలు ★

వదేస్తాడు సామాను—అక్కడనుంచి రిక్షా దొడ్డిదగ్గరకు వెళ్లి రిక్షా ఎక్కటం బ్రహ్మకపాలం వెళ్లినంతపని. ముఖ్యంగా మధ్యతరగతి ప్రజలకు - ఇక్కడ రిక్షాలు తప్ప - మరేబస్సూ అందుబాటులో వుండవు.

అయితే మోటారు కారులు వున్నవారు - సరిగ్గా గేటుదాకా వెళ్లవచ్చును. సామ్యవాదం ఇలా రూపొందుతోంది.

ఇదివరలో ప్యాసింజర్లు ఎటువంటి కష్టాలూ పడకుండా వుండేందుకు - రైల్వే పోలీసు - బస్సూ రిక్షాలు వుండే ప్రదేశంలో వుండేవాడు.

బహుశా రిక్షావాళ్ల భయంవల్ల కొంతకాలంనుంచి రైల్వే పోలీసు అధికారులు పోలీసులను వుంచటం మానేశారు.

* * * * * * *

ఆంధ్ర ప్రదేశమంతటికీ గొప్ప ఆస్పత్రి ఈ ఊళ్లోవుంది.

అక్కడికి రోగులూ, వారి బంధువులూ వెళ్తే— గేటు దగ్గర నుంచే చేతులుచాచటం - ప్రారంభ మవుతుంది. ఆ పైన అడుగు అడుగునా - ఈ చేతులు చాచటం కనపడుతూనే వుంటుంది. ఇది అట్టే బాధ కనిపించదు.

శస్త్ర చికిత్స జరిగినతరువాత మత్తు వదల కుండానే - రోగి చికిత్సలోంచి తేరుకుంటాడా (లేక తేరుకుంటుందా) అనే భయంతో రోగిచుట్టూ వున్న బంధువులను జలగల లాగున పీల్చి వేసేందుకు—అక్కడ చేతులుచాచటం వెళ్లిన అందరికీ అనుభవమే.

ఒక డాక్టరుగారితో చెప్పితే "నా భార్యకు శస్త్రచికిత్స జరిగితే నాకూ ఇదే అనుభవమైంది," అన్నారు.

* * ‡ *

ఈ మధ్యను హైదరాబాదు సెక్రెటేరియటు నాటకసంఘము "అలెగ్జాండరు" అనే నాటకమును "సామాజిక నిధికి" ధనం సేకరించేందుకు ప్రదర్శించారు.

నాటకం మధ్యలో సెక్రెటేరియట్ అసోసియేషన్ కార్యదర్శి - తాము రాజధాని (హైదరాబాదు)లో నిర్మిస్తూన్న భవనమునకు - రూ 10,000/-లు నాటకమునకు వచ్చిన కలక్షనులోంచి ఇస్తామని ఇక్కడ అధికారులు అన్నారని సభావేదికమీదనుంచి చెప్పారు. ఈ పదివేలూ - నాటకంపార్టీకి అయిన ఖర్చులుకాక. అయితే ఈ వాగ్దానం సామాజిక నిధిమాత్రం చేయలేదట. కేవలం ఈ సెక్రెటేరియట్ అసోసియేషను నాటకం ఖర్చులక్రింద రూ 5000/-లు ఇచ్చారు.

ఓ నాలుగవ తరగతి ప్రదర్శనమునుఇచ్చి సెక్రెటేరియటు అసోసియేషనువారు జిల్లాలలో ఈ విధముగా డబ్బు వసూలుచేయటం సమంజసంగా లేదనే భావము ప్రజలలో కలుగుతోంది. నాటకములు ఆడించి - ఉద్యోగస్తులచేత టిక్కట్లు అమ్మించే విధానానికి ఆంధ్రప్రభుత్వము - స్వస్తి చెబితేనే కాని, కొంతైనా అవినీతి తగ్గదు.

* * * * *

చిన్నమొత్తాల పొదుపు ఉద్యమముకొరకు కొన్ని జిల్లాలలో నాటకములు ఆడించి డబ్బు సేకరిస్తూన్నారుట. అలా సేకరించి ఎలా పొదుపుచేస్తారో తెలియటంలేదు. ఈ విషయమునుకూడా ప్రభుత్వము పరిశీలించి, వెంటనే - చిన్నమొత్తాల పొదుపు ఉద్యమముకొరకు - నాటకములు వేయించటం ఆపించవలసి వుంటుంది.

* * * * *

ప్రణాళికా ప్రచారము కొరకు ప్రదర్శిస్తున్న నాటకములలో ఏవిధంగా అవినీతి ప్రబలిందో, పన్నుల రూపంలో వసూలుచేస్తున్న ధనం ఏలా వ్యయమవుతోందో చూపించటానికి ఓనిదర్శనమొకటి జరిగిన జిల్లా సదస్సులో దొరికింది.

ఓ నాటక సభ ప్రణాళికానాటకమును కలక్టరు ఆఫీసులో ఏర్పాటుచేశారు. ఇది కేంద్ర ప్రభుత్వ సమాచార బ్రాడ్ కాస్టింగ్ శాఖ ఆధ్వర్యమున జరిగింది.

రంగస్థలమూ, లైట్లూ, శబ్ద ప్రసారక యంత్రములూ కలక్టరు ఆఫీసువారే సరఫరా చేశారు.

అయితే రంగస్థలమూ, లైట్లూ వగైరాలకు నాటకసభ తమకు రూ 150 ఖర్చు అయినదని ఇక్కడ కేంద్ర ప్రభుత్వపు అధికారికి బిల్లు పంపారు. ఆ అధికారి కలక్టరుగారికి ఓ ఉత్తరం రాస్తూ నిజమా అని అడిగారు.

ఇది ఇలా జరగడమునకు కారణము ప్రణాళికాశాఖ అధికారి నాటక ప్రదర్శనమునకు హాజరవటము, ధనార్జనకొరకు ఈ ప్రణాళికా ప్రచారముచేస్తూన్న పద్ధతినీ.

అదే సదస్సులో కార్యకలాప ప్రదర్శనములలో పాల్గొన్న ప్రతివారికీ బహుమతులు పంచిపెట్టారు. అలాగే ప్రణాళికా నాటకము ప్రదర్శించినవారికీ బహుమతి ఇచ్చారు.

అయితే—ఈ నాటకసభవారు తాము ప్రదర్శించిన నాటిక పోటీ ప్రదర్శనములో నెగ్గినదనీ, అందుకు బహుమతి వచ్చిందనీ పై అధికారులకు వ్రాసుకున్నారు.

ఈ విషయం నిజమా అని—ప్రణాళికా ప్రచారశాఖోద్యోగి కలెక్టరు ఆఫీసువారికి వ్రాశారు.

* * * * *

ఈ కేంద్ర ప్రభుత్వము విషయములు దిక్కూ దివాణంలేకుండా పోతున్నాయి ఆంధ్రరాష్ట్రంలో.

ఇంతేకాక—ఈ నాటక సమాజమును కేంద్ర ప్రభుత్వములోని ఒకఉద్యోగి నిర్వహిస్తూన్నాడు. ఈవిధంగా నాటకసంఘమూ, ప్రణాళికా ప్రచారమూ మొదలైన వివిధమార్గాలద్వారా ఒకవ్యక్తికి బహుళార్థ జీవన సదుపాయాలను, ఆర్జనా విధానాలను కేంద్రప్రభుత్వము సామ్యవాద వ్యవస్థ స్థాపించటానికే కల్పిస్తోందా అని ప్రజలు చకితులవటములో ఆశ్చర్యమేమున్నది!

—"కాశ్యప"]



ఆంధ్రప్రదేశ్ లో నృత్యప్రదర్శనలిస్తున్న ఉదయశంకర్, ఆయనభార్య అమల

## మస్తిష్కాన్ని లేబరేటరీగా మార్చుకున్న

# మహామేధావి ఐన్‌స్టీన్

[జయంతి: మార్చి 14]

కొత్తగా జబ్బుపడి లేచిన అయిదేళ్ళ బాలుడు మంచంమీద పడుకుని, ఏమీ తోచక తన్నుకుంటున్నాడు. అతన్ని చూసి తండ్రి దిగులుపడ్డాడు. ఏదన్నా ఆడుకోటానికిస్తే కొంత తోస్తుందిగదా అనుకున్నాడు. చిన్న దిక్సూచి ఒకటి తీసుకొచ్చి ఇచ్చాడు. బాలుడు ఆ దిక్సూచిని కాసేపు ఊరికే పట్టుకుని కూచున్నాడు. తరవాత అందులో ముల్లును వింతగా చూశాడు. అక్కణ్ణించి అదేపనిగా దాన్ని జాగ్రత్తగా పరిశీలించ సాగాడు.

గదికవతల, ఇంటివెలుపల, భూగోళపు చివరల ఏవో అద్భుతశక్తుల ఆకర్షణకు లోబడి పనిచేసే ఆ దిక్సూచిని చూసినకొద్దీ అతడు ముగ్ధుడైపోయాడు. ఆ బాలుడి పేరు ఆల్బర్ట్ ఐన్‌స్టీన్. విజ్ఞాన ప్రపంచపు విచిత్రాలలోకి అతడు తొంగిచూడటం అదే మొదటిసారి. ఏదో ఆటవస్తువుతో ఆడుకున్నట్లు ఆడుకోక అతడెందుకంత ముగ్ధుడైపోయాడో తెలియక తండ్రి కంగారుపడ్డాడు. కొడుకు వేసిన ప్రశ్నలకు ఓపికగా సమాధానాలిచ్చాడు.

తోటిపిల్లలందరూ తోటల్లో పేటల్లో పరిగెత్తుతూ కేరింతాలు కొడుతూ ఆడుతూంటే ఐన్‌స్టీన్ ఒక్కడూ ప్రకృతి వింతలు మాసి సమస్యల్లో మునిగితేలేవాడు. ఎప్పుడు ఏవో ఆలోచనలో ఉండేవాడు. అందరికీ గుండె గాభరా కలిగించే ఆల్జీబ్రా లెక్కలతో అతడు ఆడుకునేవాడు.

* * *

ఐన్‌స్టీన్ 14 ఏళ్ళు వచ్చేసరికే టీచర్లకు హడలుగా తయారయ్యాడు. వాళ్ళు విద్యార్థులుగా, ఇతడు టీచరుగా ఉండవలసిన పరిస్థితి అది. అతడికి అందరిలో తిరగటం, మాట్లాడటం అంటే సిగ్గేసేది. చాలా భిడియస్థుడు. అయినా తెలుసుకోవాలనే ఆసక్తి కొద్దీ తన్ను తాను మరిచిపోయి క్లాసులో ప్రశ్నలమీద ప్రశ్నలు కురిపించేవాడు. ఆ ప్రశ్నలు టీచరేకాదు ఎవరూ జవాబు చెప్పలేని ప్రశ్నలు. వాటికి కొన్నిటికి సమాధానాలు తరువాతకాలంలో అతనే కనిపెట్టాడు.

మరీ ఉక్కిరిబిక్కిరైపోయిన ఒక టీచరు క్లాసులో అందరూ వెళ్ళిపోయాక ఐన్‌స్టీన్ని ఆపి ఇలా అన్నాడు:

"నీతో ఒకటి చెప్పాలోయ్."

"ఏమిటండి?"

"నువ్వు అదేపనిగా క్లాసులో కొశ్చన్లు వేస్తున్నావు. వీటికి నేనేకాదు ఎవరూ జవాబు చెప్పలేరు. ఇది నాకు చాలా తలవంపులుగా వుంది."

"క్షమించండి సార్. నాకు నిజంగా తెలుసుకోవాలని ఉండి..."

"అవునవును. నీ ప్రశ్నలకు జవాబుల కోసం ప్రపంచమే అన్వేషిస్తోంది. నన్ను క్లాసులో ఇక ప్రశ్నలడిగి సిగ్గుపరచవద్దని కోరుతున్నాను."

ఈ కోరికను ఐన్‌స్టీన్ మన్నించాడో లేదో తెలియదుగాని, అతనిలో ప్రశ్నలు కలగటంమటుకు మానలేదు. ఆ ప్రశ్నలే చివరికి సాపేక్షసిద్ధాంతానికి దారితీశాయి.

* * *

శాస్త్రజ్ఞులలో రెండు రకాలవారున్నారు. ఒకరకంవారు లేబరేటరీలలో పరికరాలతో పరిశోధనలు చేసి కొత్త విషయాలు కనిపెడతారు. మరొకరకంవారికి మస్తిష్కమే లేబరేటరీ. కాగితాలు, కలమే పరికరాలు. ఐన్‌స్టీన్ రెండోరకంవాడు. ఎప్పుడూ ఏ లేబరేటరీలోనూ పరిశోధన చేయలేదు. ఇతరులు చేసిన పరిశోధనల ఫలితాలను పరిశోధించి సాపేక్షసిద్ధాంతం కనిపెట్టాడు.

నక్షత్రాలనుంచి వచ్చే కాంతి సౌరమండలంలోకి వచ్చేసరికి వక్రీభావం చెందుతుందని, ఈ సంగతి సంపూర్ణ సూర్యగ్రహణం నాడు చూడవచ్చునని ఐన్‌స్టీన్ ఒకసారి వ్రాశాడు. అతని జోస్యం నిజమో కాదో తేల్చటానికి బ్రిటన్‌నుంచి రెండు పరిశోధక దళాలు ఆఫ్రికాకు, బ్రెజిల్‌కు పనిగట్టుకుని వెళ్ళాయి. నానాతంటాలూ పడి శాస్త్రజ్ఞులు అతడు చెప్పింది రైటేనని తేల్చారు.

"మీరు చెప్పింది ఋజువైంది చూశారా?" అని శాస్త్రజ్ఞులాయన్ని అభినందించారు.

"ఋజువులు కావలసింది నాకు కాదు. మీకు" అని ఐన్‌స్టీన్ ధీమాగా సమాధానమిచ్చాడు.

* * *

సాయంకాలం ఎప్పుడూ ఒక రొట్టెముక్క ఉంచేది ఐన్‌స్టీన్ భార్య. గడ్డానికో సబ్బూ, వొళ్ళురుద్దుకునేందుకో సబ్బూ ఉంచితే ఏది దేనికో కనిపెట్టటం ఈ ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడికి అసాధ్యమయ్యేది.

* * *

ఐన్‌స్టీన్ జీవితచరిత్రను సినిమా తీయాలని ఒక హాలీవుడ్ కంపెనీ ఉబలాటపడి ఆయనకు ఆ విషయం వ్రాసింది.

"వెర్రిలోకం!" అని ఆయన నవ్వుకున్నాడు.

* * *

ఆయనసిద్ధాంతాలు అర్థం చేసుకున్నవారు శాస్త్రజ్ఞులలోనే కొద్దిమంది. ఆయన చెప్పేది అర్థంకాకుండానే ప్రపంచ ప్రజలందరూ "అద్భుతం" అని జోహార్లు అర్పించారు. ఆయనకు లభించినంత కీర్తిప్రతిష్ఠలు మరే శాస్త్రజ్ఞుడికీ లభించలేదు. ఈ కీర్తివలన తనపై ఒక బాధ్యత పడిందని ఆయన భావించాడు. లోకశాంతికి, మానవశ్రేయస్సుకూ దోహదంచేసే అనేక ఉద్యమాలను ఆయన ప్రోత్సహించాడు. ముఖ్యంగా యుద్ధాలను, అందులో దారుణశాస్త్ర ప్రయోగాలను ఆయన ఖండించాడు. "మూడో ప్రపంచ యుద్ధంవస్తే ఏ ఆయుధాలతో జరుగుతుందో ఏమోగాని, నాలుగో ప్రపంచ యుద్ధం మటుకు కర్రలతో జరుగుతుందని చెప్పగలను" అని ఒకసారి ఆయన అన్నాడు. ★

### నూతిబిరుచి

కొత్తగా కాపరానికి వచ్చిన భార్య భర్తతో:- "అయ్యో, చారులో ఉప్పెక్కువ వేశానండీ"

ఆమెవైపు ప్రేమగా చూస్తూ భర్త:- "అదేం కాదు. చారు కాస్త తక్కువైంది, అంతే."




# ఇంజనీర్లూ, సివిల్ ఉద్యోగులూ

ఒక్క ఇంజనీరు ఇరవై మంది సివిల్ ఉద్యోగులకు సమానం. ఇది భారత ప్రధాని అభిప్రాయమట. ఉన్నతాధికారులను విమర్శిస్తూ చండీఘర్‌లో చేసిన ప్రసంగ సందర్భంలో ప్రధానమంత్రి ఈ అభిప్రాయం వెలడించారు. ఆయనతో వచ్చిన చిక్కేమిటంటే, ఖచ్చితమైన నిశ్చయాలున్నాయిగాని, అవి ఆచరణలోకిరాకుండా మధ్య దారిలో ఆగిపోతాయి. ఒక ఉదాహరణ: సెక్రెటరీ జనరల్ శ్రీ రాఘవన్ పిళ్ళెకు ఉద్యోగ పరిమితిని ఇంకో ఏడాది పొడిగించే బదులు ఆ ఉద్యోగాన్ని ఇంజనీర్ కెవరికైనా ఇచ్చి ఉండాల్సింది. దీనివలన, విదేశాంగ కార్యదర్శి, కామన్వెల్తు కార్యదర్శి మొదలైన ఇంకో 19 మంది సివిల్ అధికారుల స్థానాలు ఖాళీ అయ్యేవి. ఇంకెందుకు—లండన్ లోని భారతీయ హైకమీషన్ కార్యాలయంలో బోలెడు మంది సివిల్ ఉద్యోగులతో సహా మొత్తం 1400 మంది ఉద్యోగులున్నారు. వీళ్ళ బదులు అర డజను మంది ఇంజనీర్లను పెట్టుకుని హైకమీషన్ కార్యకలాపాలను సుఖంగా జరుపుకోవచ్చును.

కేంద్ర జల—విద్యుచ్ఛక్తిమండలిలో 50 మంది ఇంజనీర్లు పనిచేస్తున్నారు. ప్రధాని వేసిన లెక్క ప్రకారం ఆ 50 మంది ఇంజనీర్లు చేసే పని చేయటానికి 1000 మంది సివిల్ ఉద్యోగులు కావల్సివచ్చేవారు.

కాని.........

ఇంజనీర్లు సాధించిన మహత్తర విజయాలను కూడా ఒక కంట కనిపెట్టవలసిన అవసరం ఉంది. ఢిల్లీ ఆగ్రాలమధ్య అన్ని ఋతువులకూ పనికివచ్చే రోడ్డు ఉంది. 1526 లో మొగలాయి సామ్రాజ్యానికి పునాదిరాళ్ళు వేసుకోటానికి ఈ దేశంవచ్చిన బేబర్ కాలంనుంచీ ఈ మార్గం చరిత్ర ప్రసిద్ధి కెక్కినది. ప్రస్తుతం నాలుగు నెలలనుంచీ ఈ మార్గం నీళ్ళలో ఉంది.

కిందటి వర్షకాలంలో న్యూఢిల్లీలోని చాలా ప్రాంతాల ఇళ్ళలోకి వరదనీరు ప్రవహించింది. 'ఈ వరదనీటికి కారణము అధిక వర్షములే' అని వర్క్సుశాఖ డిప్యూటీ మంత్రి చెప్పారు. అయితే—350 ఏళ్ళ క్రితం ఇంత పెద్దపెద్ద చదువులేమీ చదువుకోని ఇంజనీర్లు పాతఢిల్లీలో కట్టించిన ఏ యింటిలోకీ వరదనీరు రాలేదు, ఎందుచేత ?

ఎడ్వర్డురోడ్ (ప్రస్తుతం మౌలానా ఆజాద్ మార్గ్)లో ఒక పెద్ద భవనరాజము 1957-58 లో నిర్మించబడింది. ఈ భవనం గోడలు నవీన పద్ధతుల లో నిర్మించినవి గాబోలు — చప్రాసీలు తలుపులు ధఢాలున మూసినప్పుడల్లా ఢడాలున పెత్తికలు రాలుతూ ఉంటాయి. దీనివల్ల ఒక సౌకర్యం ఉంది— తాకీ పనివారికి పని అయిపోతుందనే భయం లేదు; తాకీగా ఎప్పుడూ ఏదో మరామత్ చేస్తూనే ఉంటారు.

గవర్నమెంట్ ఎస్టేట్ నిర్వహణ వగైరా పనులకు కోట్లాది ధనం ఖర్చుచేస్తున్నారు. కావలావాళ్లు, పాకీవాళ్లు చాలా మంది ఉన్నారు. వీరంతా సమర్థులైన ఇంజనీర్ల క్రింద పనిచేస్తూ ఉంటారు. వీరు ఇతరులు పనిచేస్తుంటే చూడటమే పనిగా పెట్టుకుని ఆ పనివల్ల అలిసిపోయే బాపతు.

ఇండియన్ సివిల్ సర్వీస్ శాంతిభద్రతల శాఖ అని ప్రతీతి. ఈ లెక్కన - కాంగ్రెసు సంస్థ అశాంతి అభద్రతల సంస్థ అవుతుంది. ఇది మునపటి సంగతిగాదు, ఇప్పటి సంగతే. ఉద్యోగులమీద రాళ్ళువిసరటానికి ప్రతి వారూ తయారే. కాని కేంద్రంలో గాని, రాష్ట్రాలలో గాని ఏ కాంగ్రెస్ మంత్రికీ తన ఆధ్వర్యంలో ఉన్న శాఖకు ఉన్నతాధికారిగా ఐ. సి. ఎస్. మనిషి తప్ప మరొకరు పనికిరారు.

ఐ. సి. ఎస్. అంతరిస్తున్న వ్యవస్థ. పూర్తిగా అంతర్థానం కావటానికి అట్టే కాలం పట్టదు. ఈ వ్యవస్థను త్వరలో పూర్తిగా రద్దుచేసి, అంతకంటే సమర్థులైన ఉద్యోగులను అంటే ఇంజనీర్లను ఆయా స్థానాలలో నియమించటం మంచిది. భారత స్వాతంత్ర్యసిద్ధి తరవాత బ్రిటన్‌కు వెళ్ళిపోయిన ఐ. సి. ఎస్. ఉద్యోగులలో ఏ ఒక్కరూ నిరుద్యోగిగా ఉండిపోవటం జరగలేదు. వీరిలో చాలా మంది భారతదేశంలోకంటే ఎక్కువ ధనం సంపాదిస్తున్నారు. అలాగే ఐ. సి. ఎస్. లోని భారతీయ ఉద్యోగులుకూడా ఆ ఉద్యోగాలనుంచి తొలగినప్పటికీ బాగా సంపాదించుకో గలరు.

అవినీతిపరులైన ఐ. సి. ఎస్. ఉద్యోగులను సమర్థిస్తున్నానని కాదు గాని, మొత్తం మీద ఐ. సి. ఎస్. ఉద్యోగులు నీతి, నిజాయితీ తప్పకుండా, తమ ప్రభుత్వంపట్ల విధేయతతో ప్రవర్తించారనే చెప్పవచ్చును. కారణం ఏదైనా వీరిలో బహు కొద్దిమంది మాత్రమే న్యూఢిల్లీలో ఇళ్లు కట్టుకున్నారు. అందులో స్వాతంత్ర్యం వచ్చినపిదప ఇళ్లు కట్టుకున్నవాళ్లు ఇంకా తక్కువ. కాని కేంద్ర పబ్లిక్ వర్క్సుశాఖలో చూస్తే, చీఫ్ ఇంజనీరు సరేసరి ఓవర్‌సీర్లుకూడా ఇళ్లు కట్టేసుకున్నారు.

* *

కేంద్ర బడ్జెట్‌పై రకరకాల వ్యాఖ్యానాలు వెలువడినాయి. మచ్చుకొన్ని :—

టైమ్స్ ఆఫ్ ఇండియా :— శ్రీ మురార్జీ దేశాయ్‌గారి మొదటి బడ్జెట్ చూసి 'అమ్మయ్య ఫరవాలేదు' అనుకోవటానికి వీలులేదు. ఈ సంతృప్తి కేవలం భ్రమమాత్రమే కావచ్చు. ఈ బడ్జెట్ ప్రతిపాదనల సారాంశం ఏమిటంటే ప్రజల జేబులోంచి మరొక 28 కోట్ల రూ. లు సంగ్రహించటం. ఇది నిరుత్సాహకరంగా పరిణమించవచ్చు.

స్టేట్స్‌మన్ : వర్తమాన సంవత్సరంలో అనుకున్న దానికంటే ఎక్కువ రివిన్యూలోటు కనబడింది. వచ్చే సంవత్సరపు బడ్జెట్‌లో కూడా భారీలోటు కనబడుతోంది. అందుచేత ఏంచెయ్యటానికీ అవకాశం తక్కువ. అందుమూలాన ఒకచేత్తో ఇచ్చినదాన్ని కొంతవరకూ మరొకచేత్తో తీసుకోవటం జరిగింది.

హిందూస్థాన్ స్టాండర్డ్ ఈ బడ్జెట్ సమగ్రదృష్టితో ఆలోచించి తయారుచేసినది కాదనీ, అది మన ప్రణాళిక నిర్వహణలో ఒకానొకదశను ప్రతిబింబిస్తున్న బడ్జెట్ అయితే ఆ ప్రతిబింబం ఏమంత ఆశాజనకంగా లేదనీ వ్రాసింది.

హిందూస్థాన్ టైమ్స్ పన్నుల ప్రతిపాదనలలో ఎక్కువభాగం అసంతృప్తి కలిగించేటంత కఠినంగా లేవని వ్రాసింది. అయితే "ఉత్పత్తిని పెంచటానికిగాని, పొదుపుచేయటానికిగాని ఈ బడ్జెట్‌లో ప్రోద్బలంఇచ్చే అంశాలు కానరావు"అని కూడా ఆ పత్రిక అభిప్రాయ పడింది.

శ్రీ దేశాయి ప్రస్తుతక్లిష్ట పరిస్థితిలో చేయగలిగినంతా చేశారని ఇండియన్ ఎక్స్‌ప్రెస్ వ్రాసింది.

"ఇది ప్రధానంగా అభివృద్ధి కార్యక్రమాలను దృష్టిలో పెట్టుకొని తయారుచేసిన బడ్జెట్. ఎందుచేతనంటే లోటు బడ్జెట్ అయితే అనే భయంలేకుండా, ప్రభుత్వరంగంలో పెట్టుబడిని ఎక్కువచేయటానికీ, ప్రైవేటు రంగంలో వారికి కొత్త ప్రోత్సాహం కలిగించటానికీ ఆయన వెనకాడలేదు"అని కూడా ఆ పత్రిక వ్రాసింది.

ట్రిబ్యూన్:—"శ్రీ మొరార్జీ దేశాయిగారి మొదటి బడ్జెట్ ఇంతేసరళంగా, సూటిగా ఉన్నందుకు దాన్ని విమర్శించవలసిన అవసరంలేదు...ఏవో కొన్ని చిల్లరమల్లర సర్దుబాట్లు, హెచ్చింపులు తప్పిస్తే కొత్తగా ప్రత్యక్షపు పన్నులను దేశం నెత్తిన రుద్దనందుకు సంతోషించాలి."

* * *

1958–59 సం॥ ఆర్థిక సమీక్ష అంటూ ఆర్థికశాఖ ఒక ప్రకటన చేసింది. అందులో వివిధ వస్తువుల టోకు ధరల సూచిక ప్రకటించింది. ఈ విధంగా ఉంది:—

| ఆహారపదార్థాలు | 1955 మే | 1959 జనవరి |
|---|---|---|
| అపరాలు | 67 | 105 |
| గోధుమ | 58 | 125 |
| జొన్న | 52 | 107 |
| సజ్జ | 67 | 132 |
| పప్పులు | 48 | 117 |
| సెనగ | 88 | 121 |
| వంటనూనెలు | 76 | 119 |
| నువ్వులనూనె | 91 | 139 |
| పంచదార, బెల్లం | 82 | 127 |
| వంటచెరకు, విద్యుచ్ఛక్తి వగైరా | 93 | 115 |

దేశమంతటా కార్మిక తరగతి వాడుకునే అన్ని వస్తువుల ధరలూ మొత్తం మీద 1955 లో 95 ఉంటే 1958 అక్టోబరునాటికి 123కు పెరిగింది.

దీని మీద వేరే వ్యాఖ్య దేనికి? భారత అగ్రనాయకులు భూవసతికి గరిష్ఠ పరిమితిని గూర్చి, సహకార సంస్థలుగూర్చి, ఆహార ధాన్యాల వ్యాపారం జాతీయం చేయటం గూర్చి చర్చలు జరుపుతూ కాలయాపన చేస్తుంటే, సామాన్య మానవుడికి పూట గడవటం గండంగా ఉంది. ఢిల్లీలో గోధుమ మణుగు రూ. 25, పప్పులు రూ. 40, పంచదార రూ. 45, బొగ్గు రూ. 10. అమ్ముతున్నారు. జీవన వ్యయం ఒకమూల పెరుగుతూంటే పొదుపు చేయగల ధనం తగ్గిపోతోంది. ఈ తగ్గుదల పోస్టల్ సేవింగ్, బాంకులలో బాగా కనిపిస్తోంది. ఈ బాంకులు పూర్వమంత బాగా పనిచేయటంలేదని ఆర్థిక మంత్రి అభిప్రాయం.

జాతీయాదాయం పెరగడంలోను, చిన్న మొత్తాల పొదుపు తగ్గిపోవటంలోనూ ఉండు కున్న రహస్యం ఛేదించాలీ అంటే లోటు బడ్జెట్ అంకెల్ని పరిశీలించటం అవసరం. 1961 మార్చి 31 తో అంతమయ్యే రెండవ ప్రణాళిక కాలూకు అయిదేళ్లలో నూ రూ 1200 కోట్ల దాకా లోటుబడ్జెట్ పద్ధతి అనుసరించవచ్చునని ప్రణాళికా సంఘం నిర్దేశించింది. మొదటి రెండేళ్లలోనూ లోటు పద్ధతిన భర్తీ అయిన ధనం రూ 638 కోట్లు. మూడోఏటికి రూ 254 కోట్లు అని అంచనా వేశారు. అంటే మూడేళ్లకీ రూ 883 కోట్లు అన్నమాట. కాని ప్రణాళికసంఘం సరిదిద్దిన అంకెల ప్రకారం ఈలోటు రూ 900 కోట్లు ఉండాలి. పైన చూపిన ధరలపట్టిక ప్రకారం దేశములో ద్రవ్యోల్బణం వున్నది. ఈకారణం చేత ప్రణాళికలో మిగిలిన రెండేళ్లకీ లోటు పద్ధతి ధనం రూ 200 కోట్లకు మించగూడదని ప్రణాళికా సంఘం 1958 మే లో నిర్ణయించింది. అయితే ఆర్థికమంత్రి 1959-60 సం॥లో లోటు పద్ధతి ధనం రూ 245 కోట్లు ఉండటం అవసరమని అంచనా వేశారు. అంటే ప్రణాళిక నాలుగో ఏడు ముగిసేసరికి లోటు పద్ధతి ధనం రూ 1138 కోట్లు అవుతుంది. (అయిదేళ్లకీ వేసిన అంచనా రూ 1200 కోట్లు.)

ఇక్కడితో ఏమైంది? ఇంకా మనం నాందీ ప్రస్తావనలోనే ఉన్నాము. కేంద్ర వేతన నిర్ణాయక సంఘం వలన కలిగే ఆర్థిక భారాన్ని ఆర్థికమంత్రి లెక్కలోకి తీసుకోకుండా వదిలేశారు. అదికూడా లెక్కలోకి తీసుకుంటే, ఇంకా బోలెడు లోటు పద్ధతి ధనం సేకరించవలసి వస్తుంది. ఈ విధంగా ద్రవ్యోల్బణం ద్విగుణీకృతోత్సాహంతో దేశంమీద విరుచుకు పడే ప్రమాదం ఏర్పడుతుంది.

# తారుమారు

శ్రీరంగం నారాయణబాబు

రాణి: అమ్మో, బావెలా ఉంటాడే?

జానకమ్మ: లక్షణంగా ఉంటాడు. ఆ కాలేజీరోజుల్లో బావను చూచి అంతా మెచ్చుకునేవారు. ఉంగరాల జుత్తు, గుండ్రని ముఖం, ఉప్పాడ జరీపంచె, సిల్కు లాల్చీ, గులాబిరంగు శాలువ వల్లెవాటు వేసుకొని నడుస్తూ ఉంటే వాడివైపు చూడని ఆడపిల్ల ఉండేదికాదు.

రాణి: అయితే మరి యింతవరకు పెళ్ళి చేసుకోలేదేమిటి?

జాన: చదువుకొన్న పిల్ల, చూడ చక్కనిది, నవనాగరికత కలిగింది, అయివుండాలి. మన కుటుంబల్లోదై వుండాలి, అని పట్టు పట్టాడు. ఇంతకు మా అన్నయ్య నిన్ను చేస్తావని ఏనాడో అన్నాడు. అందుకేకద నిన్ను బి. ఏ. ప్యాసుచేయించింది, సంగీతం చెప్పించింది.

రాణి: మరి యింజనీరింగుకి వెళ్ళాడేమే ఎమ్. ఏ. చదవక?

జాన: వాళ్ళ నాన్న అనడం బి. ఏ. ప్యాసయ్యాక అతనిలో ఏదో మార్పు వచ్చిందనీ, యింజనీరింగు చదివి పూర్తిఅయ్యాక కాని పెండ్లి చేసుకోనని అన్నాడట. లేకపోతే యీపాటికి ఏనాడో నీపెళ్ళి అయిపోయివుండేది. ఈపాటికి ముగ్గురు పిల్లలతల్లివవుదువు.

రాణి: ఛీ. అలా అంటావేమిటమ్మా... అవును కాని, మనింటికి ఎప్పుడూ రాలేదేమే బావ?

జానకి: మనం విశాఖపట్టణంలోను, వాడు చెన్నపట్టణంలోను. అక్కడికి రెండు మార్లు వచ్చాడు. నీవు లేకపోయావు. వసుంధర చూచింది; కావలిసే వసుంధరనడుగు.

రాణి: చెల్లి, ఏంచేస్తున్నావిల్లారా? ఎప్పుడూ పెరట్లో ఏడుస్తావేమిటి?

వసుం: పెరట్లో గొప్పులు తవ్వి పాదులు పెడుతున్నా. ఈ వర్షాకాలం వెళ్ళేసరికల్లా, కావలసినన్ని కూరలు. చెట్టునుంచి కోసిన కూరలైతే, రుచి, ఆరోగ్యం, అందం. పుస్తకాల్లో ఏముందక్కా?

రాణి: చూడమ్మా, ఎంత అసహ్యంగా ఉందో చెల్లి, గునపాం, మురికిచీర, చెమట చిత్తడి, రామ. రామ. నాజూకు ఒక్క పిసరూ కూడా లేదుకద. చిన్న కూచా ఏమిటి. పెండ్లీడు పిల్ల. నాకంటె రెండేళ్ళు కద చిన్న. పెళ్ళివాలా? ఇలా ఉంటే ఎవడు పెళ్ళాడుతాడు? అందమైంది అయితే సరా? రోత, రోత.

జాన: దాని ఖర్మం. మగాడిలా ఏదో చేస్తూ తిరుగుతూ ఉంటుంది. వద్దంటే మానుతుందా! అందముంటే సరా, పైమెరుగు లుండొద్దూ? బురదలో మాణిక్యంలా ఉంటుంది. ఎవ్వడూ పెళ్ళాడడు. దాని ఖర్మం.

వసుం: అందమంటే, ఎత్తు మడమల జోడు, లిప్‌స్టిక్, ముఖానికి పౌడరు, సిల్కు చీర, భుజాల మీద పడేలోలక్కాలోను లేదు. అందమనేది మన పుట్టుకతోనే ఉంటుంది. తరువాత కాయకష్టపడితే కండలుతిరిగిన శరీరమే, నాతికి శోభ.

రాణి: నీవు నాతివికావు కోతివి. చత్రాతివి. సహజంగా వనితకుండే నాజూకు నీలో బ్యాటరీలైటువేసి వెతికినా కనిపించదు. ఈ రోజుల్లో పూర్వంలా పెళ్ళిళ్ళు జరుగవు. చదువొక్కటుంటే సరిపోదు. సావిత్రి, అనసూయలక్కరలేదు; సినిమా స్టార్లు కావాలిగాని. బడుద్ధాయిలా, పల్లెటూరి రైతులా ఉంటే ఎవ్వడూ మొగ్గడు.

వసుం: అక్కా, నీవింకా పాతకాలంలోనే ఉంటున్నావు. నీవనుకున్న రోజులు నీకు తెలియకుండానే మారిపోతున్నాయి.

రాణి: ఏమిటో, ఆ మార్పు?

వసుం: పరాయి ప్రభుత్వం బానిసలుగా తయారు చేసేందుకు పెట్టిన విద్య అభ్యసించి, మిడిమిడిజ్ఞానంతో మేడిపళ్ళలా తయారై, స్త్రీ అంటే కేవలం ఒక భోగవస్తువని, చాలా నాజూకుతనం చూపించాలని, అబలఅనీ అనుకొనే రోజులు పోయాయి.

రాణి: అయితే నీ ఉద్దేశం ఆడువాళ్ళను మగవాళ్ళుగా తయారవమంటావా?

వసుం: అవమని అనటంలేదు. అవసరం

వస్తే అయ్యేందుకు జంకకూడదు. ఆడుది తన ధర్మాలు తనునిర్వర్తించుకొంటూ, మగవానికి చేదోడు వాదోడుగా ఉండటమే కాకుండా, అవసరంవస్తే పురుషధర్మాలను కూడా నిర్వర్తించేందుకు సిద్ధంగా ఉండాలి.

జాన: ఏమిటి వసుంధరా, యీ వాదన? అక్కనుచూచి నీవెన్నో నేర్చుకోవాలి. అక్కంత చదువుకున్నది. నీవనుకున్నట్లు మగవారనుకుంటూ రనుకోవడం శుద్ధతప్పు. దేశానికి మనకి ఎంత స్వతంత్రం వచ్చినా, యీ దేశంలో ఆడది ఆడదే. మగాడు మగాడే.

వసుం: ఏ దేశంలోనైనా అంతే.

రాణి: ఎందుకమ్మా దాంతో? సరే నీయిష్టంగాని, ఒకటి చెబుతున్నా విను. రేపుఉదయం బావవస్తున్నాడు. జీవితమంతా అందంతో ఆనందమయం చేసుకోవడం అతని ఆదర్శం. అతన్ని పెళ్ళాడటం నా ఆశయం. నీలాంటి వాస్తవిక జీవితానికి చెందిన మాటలన్నా పనులన్నా అతనికి రోతకలిగిస్తాయి. అతనుండేది రెండు రోజులు. ఈ రెండురోజులు మంచిబట్టలు వేసుకొని, అందంగా ఉన్నట్టు కనిపించు. లేకపోతే నీచేష్టలవల్ల నా పెండ్లి పాడవచువచ్చు, అన్నిటికంటె ముఖ్యం ;రోజూ ఆ ఎండవేళ వెళ్ళి, సాయంత్రం మేము పండుకొని లేచేవేళకు వస్తావే,అదిమాత్రంమానాలి. లేకపోతె ఆ పనిచేస్తూ బావకంట పడ్డావా, మన కుటుంబానికే మచ్చ వస్తుంది. జాగ్రత్త-

వసుం: నిన్ను పెండ్లాడాలని బావ వస్తే నేనేం వద్దంటానా? నిన్ను చూడానికి బావ వస్తే నేనెందుకు అందంగా తయారవడం? ఆమాటకొస్తే నీకంటె నేనే బావకు బాగా తెలుసును, చూడు, నన్ను ముందు పలకరిస్తాడు. నేను యథాతథంగా నే ఉంటాను. నాలో మార్పుండదు. ఇతరుల్లో వస్తే దానికి నేను బాధ్యురాలను కాను. నీవన్న పని కూడా మానను. అయితే బావ కంటమాత్రం అప్పుడు పడను అని హామీ యిస్తాను. సరా?

* * *

జానకమ్మ: వసుంధరా, వసుంధరా ఏం చేస్తున్నావు? తెల్లారిపోయింది. బావ వచ్చే వేళైంది. ఏమైనా ఫలహారం చేశావా లేదా?

వసుం: వస్తున్నా, తెల్లవారు జామున లేచాను. పనితో చస్తున్నాను. ఉప్మా చేశాను, బిస్కత్తులు చేయమని దొరసాని అక్కయ్యగారి ఆర్డరైందికదూ! దొర బావగారికి బిస్కత్తులు కూడా ఉండాలట టొమాటోపళ్ళ పచ్చడి చేశాను. ఒక్కత్తిని ఛంతకని చావటం?

జాన: ఎందుకంత విసుగూ? నాకో వంట రాకపోవడము చేతనేకద. కాస్త ఏమైనా వస్తే ఆకొస్తా మరచిపోయాను.



శ్రీశైలంలో మల్లికార్జునాలయం.

మీ నాన్నగారున్న రోజుల్లో యిద్దరు వంటవాళ్ళు ఉండేవారు. వంటకొకడు, ఫలహారాల కింకొకడు.

వసుం: అందుకు నేనేమీ అనలేదమ్మా! అన్నీ సిద్ధమయాయి. పాలుపితికే వాడు రాలేదు. బావరాగానే వేడి వేడి కాఫీ యివ్వాలి కద? కొన్న పాలేమి బాగుంటాయి చెప్పు! ఇంతకు యింట్లో పాడి వుండగా కొనటం ఖర్మమేం?

జాన: నీవింకా ఆ కట్టుకున్న చీరతోనే ఉన్నావు, ఏం సాధనమే, నీకేం చెప్పినా వినవు, బావ వచ్చే వేళైంది.

వసుం: నామాటకేమిలే, నేను యింకా పాలుకూడా పితకాలి ఆవిడగారిని లేపు. బాగుండదు, లేచాక టాయిలెట్ మూడు గంటలసేపైనా అవుతేకాని వరులకంటబడదు కదా. ఈవేళే నా తొందరగా లెమ్మనమను.

జాన: ఏమిలేనప్పుడే, ఎనిమిది పౌడర్లు, తొమ్మిది లిప్‌స్టిక్‌లు కావాలి ఆవిడగారికి. ఈవాళ మనతరం కాదు ఆవిడను గదిలోంచి పైకిలాగేందుకు.

వసుం: వెళ్ళిపాలు పితికి వస్తాను. నేనెంతలో తయారవాలి, క్షణం పట్టదు.

జాన: ఏం రాణీ! యివాళ మరి లేవవేమిటి? బావుండదే, బావ వచ్చే వేళైంది. నిన్ను బ్రతిమాలుకుంటాను, లేచినా ముస్తాబే మూడు యుగాలు పడుతుందికద, దీంతో నాకేమి సాధనం?

[మురళి ప్రవేశిస్తాడు]

ముర: వసుంధరా! ఈ నాలుగేళ్ళలోనే నీవు ఎంత మారిపోయావు! ఇప్పుడు ఎంత అందంగా ఉన్నావు? జ్ఞాపకమున్నానా?

వసుం: ఎంత మంచి శకునం బావా! పూర్ణకుంభంతో ఎదురుకొందామని పాల చెంబుతో వస్తున్నాను.

మురళి: నాతో పాలు పంచుకొనేందుకేనా?

వసుం: నీతో పంచుకొనేది నేను కాదు మా అక్క.

ముర: ఇంకా పాత పాటేనా?

వసుం: అదేమిటి బావా, కూలివాడు దొరకలేదూ? సూటుకేసు, బ్యాగు నువ్వే పట్టుకొన్నావు. ఈ వాలకం ఏమిటి?

రాణి: అమ్మా, చూడు బావొచ్చినట్టుంది. ఆ గేటుదగ్గర ఆతనెవరు? కాకినిక్కరు, మాసిపోయిన బుష్‌కోటు, ఒక చేత్తో సూటుకేసు, ఇంకో చేత్తో బ్యాగు పట్టుకొని చెల్లితో మాట్లాడుతున్నాడు.

జాన: ఛీ, అదేమిటే ఖర్మం! మీ బావ అలా ఉంటాడులే?

రాణి: బావని అనలేదమ్మా! బావొచ్చాడేమో అన్నాను కాని, వీడు కూలివాడై ఉంటాడు. వసుంధరా, ఆ కూలి మనిషిని యింట్లోకి తెమ్మనమను సామానులు.

వసుం: నీ ముఖం, కూలి మనిషేమిటే బావే! నే పట్టుకుంటాను సూటుకేసూ, అవి, నీవు లోపలికి పద బావా! అమ్మ నీకోసం ఎదురుచూస్తున్నాది.

మురం: అక్కరలేదు.

వసుం: నిన్ను సామానులు తీసికెళ్ళనివ్వను. నా చేతికియ్యి, నేను పాల్లో పిటిని పడేసి వస్తా.

[మురళి లోపల ప్రవేశించి]

ముర: ఏం అత్తయ్యా! కులాసాగా ఉన్నారా? నిన్ను చూచి ఎంతకాలమైంది!

జాన: ఏం కులాసా నాయనా! మామయ్య లేకపోవడం, ఆ యిద్దరు ఆడపిల్లలకు మూడు ముళ్ళు పడకపోవడం-ఏమిటో



"వలపు తలపులు"

చిత్రకారుడు : కొర్లపాటి వెంకటసత్యనారాయణ.

# ★ తారుమారు ★

ఎప్పుడు నువ్వొస్తావు, పెద్ద దాని కన్నె చెర ఎప్పుడు విడిపిస్తావని, ఎదురుచూస్తున్నాను. ఇంత కాలానికి నీ దయ కలిగింది. అవును గాని, నువ్వేమిటీ యిలా మారిపోయావు! ఆ రోజుల్లో నిన్ను చూడ్డానికి రెండుకళ్ళు చాలేవా?

ముర : ఆ రోజులు వేరు అత్తయ్యా! అవి చదువుకొనే కాలేజి రోజులు. తల్లి తండ్రులు పుష్కలంగా డబ్బు పంపుతూ ఉంటే, చీకు-చింతా లేకుండా, విలువైన బట్టలు వేసుకోవడం, తెలివైనవాణ్ణి అందమైనవాణ్ణి అని అనిపించుకోనేందుకు తాపత్రయ పడే రోజులు. నేను బాహ్యంగా కాదు. మానసికంగా కూడా పూర్తిగా మారిపోయాను. అప్పటి నన్ను తలచుకుంటే యిప్పుడు నవ్వు వస్తుంది. అప్పటి, మురళి, మురళీ గాన లోలుడు. ఇప్పటి మురళి, జీవితసంగ్రామ మధ్య గీతాధ్యాపకుడు.

జాన: అలాగా. ఇంజనీరింగు చదువుతే, ఆ కాకీనిక్కరు, మాసిపోయిన నల్లబుష్ కోటు వేసుకోవాలా ఏమిటి? అవేమీ బాగు లేవు.

ముర: ఏమిటో అత్తయ్యా! అందంగా ఉన్నవన్నీ ఉపయుక్తమైనవి కాకపోవచ్చును. ఉపయుక్తమై ఉండటమే అందానికి నిర్వచనం.

జాన: అల్లాగుటోయి బాబూ! అవన్నీ నాకు తెలియవుగాని, వేగం స్నానంచేసిరా కాఫీ, ఫలహారం సిద్ధంగా ఉన్నాయి.

ముర: క్షణంలో వస్తున్నా.

*  *  *

జాన: మురళీ! టేబిలుముందుకు లాగాలా ఏమిటి? ఆ కుర్చీమీద నీవుకూర్చో. రాణి నీపక్కను కూచుంటుంది. వసుంధర ఇక్కడ నా పక్కను కుర్చీమీద కూచుంటుంది.

ముర: కూర్చుంటుందీ ఏమిటి? అప్పుడే కూర్చుందే. వసుంధరా! సింపిల్‌గా ఎంత అందంగా ఉన్నావు! బ్యూటీ యీజ్ ఇన్ సింప్లిసిటీ. "ముఖంమీద కుంకుమబొట్టు సూర్యోదయంల్లా ఉంది. ఈ దిశోదయం నా కోసమే ఏమో! నారీధర్మం నీలో పరిమళిస్తోన్నాది. కాని పెండ్లి మీ అక్కకిట. నారీధర్మం అలవరుచుకోలేని విలాసవతికి, వివాహయోగ్యత ఉండదు. లోకం తారుమారుగా ఉంది. అయితే మీ అక్కయ్య ఏదీ! అరగిద్దామా?

వసుం: అయ్యో, వస్తున్నాది. గదిలో దుస్తులు వేసుకుంటున్నాది.

జాన: వసుంధరా! అక్కయ్యను వేగం రమ్మనమను. బావ కాచుక్కూచున్నాడని తొందరపెట్టు.

[రాణి ప్రవేశం]

రాణి : క్షమించాలి బావా! నా పౌడరు డబ్బా ఎక్కడో పోయింది, ఎంతవెతికినా కనిపించలేదు. ముఖాన్ని మంచి పౌడరేనా లేకుండా పరులకంట పడనుకదా. నీకంట ఎట్లా పడటం చెప్పు.

ముర : ముఖాన్ని అంతుంది, అదేమిటి మరి?

రాణి : మా చెల్లి ముఖాన్ని వేసుకుంటుంది, ఇండియన్ ప్రిపరేషన్. పౌడరనబడే సున్నంపొడి. నాకు ఇండియన్‌వంటే ఏమి పడవు.

ముర : హిందూదేశానికి, భారతీయులకు యింతకంటే, గ్రాస్‌యిన్‌సల్టు ఏమీ ఉండదు. అయితే నీకు ఇండియన్‌దేది పడదన్న మాట.

రాణి : అన్నమాటే మరి.

ముర : ఎంతమాట. నేడు దేశం ఎంతో మారిపోయి నా దేశం, నాదేశంలో తయారైంది అని గర్వపడటానికి బదులు, నామోషీ కూడానా? ఇది నాగరికత అనుకుంటున్నావు గామోసు; కాదు ఒట్టి అస్వాభావికత. కృతకత. ఇందులోంచి నీవు బయటపడేవరకు నీకు మోక్షంలేదు. మన దేశపు వస్తువులే పనికిరానపుడు. మనదేశపు మనుషులు పనికొస్తారా. పరాయిదేశస్తుణ్ణే భర్తగా చేసుకోవడం మంచిది.

రాణి : బావా, నీకు కోపంవచ్చినట్టుంది. వీటికి నేను అలవాటు పడిపోయాను. ఇవి నాలో ఒకభాగం అయిపోయాయి.

ముర : కోపంకాదు విచారం ఎక్కువ వేస్తున్నాది. ఈ రోజుల్లో కూడా యిల్లాటి మాటలు వింటున్నామా అని.

రాణి : ఇవి లేకుండా నేను ఉండలేను.

ముర : నిజమే నీవు చెప్పింది. లేకపోతే ఏమిటా పెదిమల కరం! తాంబూలం అందం, ఆరోగ్యం కూడాను. చలిదేశాలలో వాళ్ళకంటే పెదిమలారి నల్లబడిపోతుండా, లిప్‌స్టిక్‌గాని మన కెందుకు?

రాణి : చూడు నా అధరం దొండపండులా లేదూ! నిగనిగలాడుతూ దాని కేమిటి లోటు?

ముర : ఆహా, దొండపండులాగే ఉంది గాని, లక్క దొండపండులా ఉంది.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక
# త్వరలో కొత్తసీరియల్

రాణి : ఊఁ. సమారాధన అయిందికొబట్టి పద చాలిద్దామా!

ముర : ఇంతకు రాణిగారి సెలవు కద.

రాణి : రాజువు నీవు కొబట్టి నా అధికారమంతా నీకే సంక్రమిస్తుంది.

ముర : ఈ రోజుల్లో, సామాన్యుణ్ణి అనుకోవడంలోగొప్పుందిగాని, రాజుననుకోవడం లేదు. నేను స్వతహాగా సామాన్యుణ్ణి. అది నా రాణిని పెండ్లాడి రాజునవడం నా కిష్టంలేదు. వాంఛించను.

రాణి : బావకు ప్రయాణపు బడలిక అనుకుంటాను. కొస్త సేద తీరుతేకాని, యీ మాటిపోటి మాటలు తగ్గవు. కొస్త రెస్టు తీసుకో బావా! తరువాత మాటాడుదాం.

ముర : రెస్టు తీసుకోనెందుకు వీల్లేదు. నేను ఉద్యోగరీత్యాకూడా యీ ఊరు కొంతపనిఉండి వచ్చాను. అందేత ఊళ్ళోకి వెళ్లాలి. ఒక్కటి సంతోషంగా ఉంది. నువ్వు నేను ముందే ఒకరి నొకరు అర్థం చేసుకోవడం నీకు నాకు కూడా మేలు.

జాన : త్వరగా వంట చేయించేస్తాను.

ముర : వీల్లేదు. నేను వెళ్ళాలి.

జాన : ఫోంచెయ్యకుండానా?

ముర : కలుసుకే అలకదన్నారుగా.

* * *

[మురళి ప్రవేశిస్తాడు]

జాన : ఏం నాయనా ఊళ్ళో ఏదో వనుందన్నావు. అది చక్కబెట్టుకున్నావా?

ముర : మీకు దగ్గరగా నాలుగుమైళ్ళ దూరంలో ఉన్న ఏటివంతెన పని చేయమని, గవర్నమెంటువారు యీమధ్యే నన్ను ఇంజనీరుగా వేశారు. ఆ పనిలో ఉండగా యిక్కడ కొంతమంది అవవాళ్ళ శ్రమదానంచేస్తూ రోడ్డు వేస్తున్నారని ఆ పని చూచి వద్దామనుకున్నాను. అడిపని. ఆ చూడ్డమైంది.

జాన : అయితే యింకేం, నువ్వుయిక్కడ ఉండి అక్కడకెళ్ళి ఉద్యోగం చూసుకుంటూ ఉండవచ్చు; పెళ్ళయిపోతే...

ముర : అత్తయ్యా నేను నీతో కొంచెం మాటాడాలి. వాళ్ళిద్దరు ఇప్పుడిక్కడికి రాకూడదు.

జానకి: వాళ్లింట్లో లేరు.

ముర : నువ్వు నొచ్చుకోకూడదు. నేను చెప్పిందంతా విని తరవాత నీవు చెప్పవలసిది చెప్పు.

జాన : ఏమిటది వేగం చెప్పు

ముర : చూడు అత్తయ్యా, నేను రాణిని సుఖపెట్టలేను. నన్ను రాణి కూడా సుఖపెట్టలేదు. అందేత యిద్దరి జీవితాలు పాడవడం మంచిదంటావా?

జాన : అంటే, నీవనేమాట?...

ముర : నాకేస్సు బతకవలసిన జీవితం; స్వభావాలు, స్వభావాలు కలియనప్పుడు, లాభమేముంది? ఈ నాడు అడమగ అనకుండా, అహోరాత్రాలు కష్టపడితేనేగాని, దేశంలో ఉండె దారిద్ర్యాన్ని, అజ్ఞానాన్ని పటాపంచలు చేయలేము. నిద్రా ఆహారాలకి కూడా చాలినంత కాలం దొరకదు. నేనా, ఏ ఆనకట్టదగ్గరో, వంతెన దగ్గరో పగలంతా కష్టపడి, యిల్లు చేరుకొనేసరికి, నాకింతపుష్టి అయిన ఆహారం రుచి అయింది పెట్టాలి. అమ్మ చిన్నప్పుడే లేదు, నీకు తెలుసుగా.

జాన : ఏమిటి వింతమాటలు?

ముర : మా నాన్న నీకిచ్చినమాట తప్పను.

జాన : నీవు చేయేస్సు వదిలాలి.

ముర : రాణి అందమైందే కాని, వసుంధరలో సహజసౌందర్యం ఎక్కువ. ఇంతకీ వాళ్ళిద్దరికీ, వయస్సులో కొంతేళ్ళ కద వ్యత్యాసం?

జాన: అఁ!

ముర : వసుంధర రోజూ ఎండలో వెళ్ళి సాయంత్రం వరకు, తక్కిన ఆడవాళ్ళంతచేత పనిచేయించి, తనూ కష్టపడి మనప్రజల కోసం రోడ్డు వేయిస్తున్నాది, అని ఊళ్లో అంతా చెప్పేసరికి నేను స్వర్గం అందుకున్నాను. స్త్రీ గృహధర్మాలనేకొకుండా, సాంఘిక ధర్మాలు కూడా నిర్వర్తించాలి. అందేత నీవు అంగీకరిస్తే నేనువసుంధరనే...

జాన : అయ్యో...బ్రతుకింత తారుమారవుతుందనుకోలేదు. 

[ఆలిండియారేడియో ప్రసారితం]

## కొస్త తెడాలో

ఒక గొప్ప తెలుగువాడు :-

"నేను ఒకరోజు పొద్దుకే నిద్ర లేచేసరికి గొప్పవాణ్ణయిపోయి ఉన్నాను."

అతని మిత్రుడు : నాదంతా నీకు వ్యతిరేకం. నేను గొప్పవాణ్ణయిపోయి, తరవాత నిద్ర లేచాను.

## నం. భేటి

ఒక రాజకీయ నాయకుడు మరొక పిటోగారితో:—

"ఏమండోయ్. మనగురించి అవతల పార్టీవాళ్లు అబద్ధాలు ప్రచారం చేస్తున్నారు చూశారా?"

"పోన్లెద్దురూ. మనగురించి నిజం ప్రచారం చేస్తేగదా మనకి భయం?"

# విషాద గీతం

## ఐ. హేమలత

ప్రోగ్రాము ఆ నర్సుల మాట వినిపించక పోయివుంటే, రాధ జీవితం యింత దారుణంగా అంతమయ్యేది కాదేమో! ఏ మాటలు రాధ వినకూడదో ఆ మాటలే ఆమె చెవిని పడ్డాయి. అవి వినడం ఫలితంగా రాధ పుష్పంలాంటి తన జీవితం చేతులారా నాశనం చేసుకుంది. నవనవలాడుతూ పైకి వచ్చే సుకుమారమైన లతను గోటితో గిల్లి వేశాలు. మొదలంటూ వాలిపోతుంది. గొడ్డలిపెట్టు అనవసరం. ఒక జీవితంలో పున్నమి వెన్నెల విరిసేందుకూ, కారుచీకట్లు క్రమ్ముకునేందుకూ పూలులాంటి ఒక్క మాట చాలు. అందులో రాధలాంటి వారి సంగతి చెప్ప నవసరం లేదు.

తెల్లని పవిత్రమైన శల్యావశిష్టంగా పడి వుంది రాధ. అది స్పెషల్ వార్డు. ఆ గదిలో రాధ ఒక్కతే రోగి. జబ్బు నయమైంది. కాని లేచి తిరిగే శక్తి రాలేదింకా! పైన తిరిగే పంకాను చూస్తూ నిర్లిప్తంగా వుంది రాధ. అంతకుముందే స్నేహితురాలు లీల వచ్చి మాటాడి వెళ్ళింది. తనకు నయమయ్యాక "పిక్‌నిక్" ప్రోగ్రాం వుందని చెప్పింది. తన గ్రూప్ అంతా వస్తారు కాబోలు. అందరినీ తన చిలిపితనంతో నవ్వించి కవ్వించాలి సరదాగా! ఏమిటేమిటో ఆలోచిస్తూ వుంది పదహారేళ్ళ అమాయక రాధ.

మధ్యాహ్నం రెండింటికి కావస్తోంది. అప్పాట డ్యూటీనుండి రిలీవ్ అయిపోతున్న నర్సులు టెంపరేచర్ తీసుకుందుకు వచ్చారు. నార్మల్‌గా వుంది. చార్టులో మార్కు చేసి గడప దాటబోతూ ఒక నర్సు ప్రక్క నర్సుతో అంటూంది మెల్లిగా!

"ఇక యీ అమ్మాయి జీవితం యింతే కదా పాపం. ఏ ఆనందం అనుభవించేందుకు లేదు కదా! పదహారేళ్ళకే యీ జబ్బు రావాలా! ఎప్పుడూ యిలా బెడ్‌లో వుండాల్సిందే కదా! ప్చ్ పాపం" అంటూ తన సానుభూతిని వ్యక్తపరిచింది.

ఆ మాటలన్నీ వక్కటికూడా విడవకుండా విన్నది రాధ. అతి సమీపంలో పిడుగుపడినా అంత అచేతను రాలయ్యేది కాదేమో! తన కా విషయం యిన్నాళ్ళూ తెలీదు. తన జీవితమంతా యిలా మంచంపై గడిచిపోవాలట. "ఏంపాపం చేశాను భగవాన్!" కళ్ళవెంట ధారగా నీరుకారుతూ వుంది. అలా ఎంతసేపుందో తనకే తెలీదు. తనకోసం కారియర్ తెచ్చిన జవాను యింటికి వెళ్ళి చెప్పినట్లున్నాడు. తమ్ముడు రఘు వచ్చి ఆత్రంగా "అన్నం తినలేదేం రాధా!" అన్నాడు. తలెత్తి తమ్ముడివైపు చూడలేక దిండులో తలదాచుకుని భోరుమంది. వాడికేమని చెప్తుంది. వాడే కారియర్ తెరిచి తన ముందుంచాడు. కన్నీటి ధారలు అడ్డుపడుతూ వుంటే భోజనం ముగించింది. తమ్ముడు వెళ్ళిన తర్వాత మూడు గంటల దాకా తలుపువేసుకుని ఏడ్వగలిగినంతసేపూ తనివితీరా ఏడ్చింది. సాయంత్రం టెంపరేచర్ నూరు దాటిపోయింది. ఆశ్చర్యంగా చూస్తున్న నర్సుకు వాడిపోయిన రాధ కళ్ళు జవాబు చెప్పాయి. మొదటినుండీ ఆప్యాయంగా చూసే నర్సుల్లో ఆమె ఒకతె. తలుపేసి వచ్చి "ఎందు కేడ్చే"వంది. ఎంత బ్రతిమాలినా రాధ "నాకీ జబ్బు నయం కాదు కదూ!" అంటుందే తప్ప మరోమాట చెప్పదు. "ఆ మాట నీకెవరు చెప్పారు? జబ్బులు నయంకాక అలానే వుంటాయా! మేమంతా వున్న దెందుకు? ఏడ్చి మళ్ళీ జ్వరం తెచ్చుకున్నావు. నాలుగు రోజుల్లో డిశ్చార్జి చేయాలనుకుంటున్నారు: ఇలా అయితే ఎలాగమ్మా" అని నచ్చచెప్పింది. అదంతా రాధ యీ చెవిగుండా విని ఆ చెవి ద్వారా విడిచిపెట్టింది. "తనకు జబ్బునయం కాదు." అది ఒక్కటే ఆమెకు నమ్మదగిన మాట. తానికమందులు తీసుకోగూడదు. వాటి వల్ల లాభంలేదు. అన్నీ మానెయ్యాలి. అర్థంలేని యీ జీవితానికి యిక యేమీ వద్దు, అనుకుంది. అవే ఆలోచనలు రాధ మనస్సులో గాఢంగా నాటుకు పోయాయి. ఉదయం చూడానికి వచ్చిన డాక్టరుతో "నేనింటికి వెళ్తా"నంది. చార్టుచూపించి "జ్వరం తగ్గాలమ్మా" అన్నాడు. "నాకు తగ్గదు!" నిర్భయంగా నిశ్చలంగా చెప్తున్న రాధవైపు నివ్వెరపోయి చూశాడు డాక్టరు. సాయంత్రం వరకూ నచ్చచెప్పడానికి ప్రయత్నించి విఫలుడై రాధ తండ్రికి తెలిపారు.

బరువెక్కిన గుండెతో యింట్లో అడుగు పెట్టింది. జీవితంలో తన కేమీ లేదనుకున్న పదహారేళ్ళ రాధ. వంటరిగా కూర్చుని ఆలోచిస్తూ వున్న రాధ దగ్గరకు తండ్రి వచ్చి "బాగా రెస్టు తీసుకోవాలమ్మా! కొన్నాళ్ళపాటు కదలకుండా వుండాలి", అన్నారు. "కొన్నాళ్ళపాటు" అంటు

న్నప్పుడు ఆయన గొంతు వణుకుతున్నట్లు రాధ గమనించకపోలేదు. ఆయన చెప్పేటప్పుడు సూటిగా తనవైపు చూచి చెప్పలేక ఎటో చూస్తూ చెప్పారు. "ఎందుకీ తెర వెనుక భాగోతం?" అనుకుంది రాధ. అందరి మీదా అన్నిటిమీదా ఏదో చెప్పరాని నిర్లక్ష్యం. జీవితంపై నిర్లక్ష్యం. తల్లి యేదన్నా చెపితే "నాకెందుకమ్మా!" అనడం రాధకు పరిపాటయింది. ఆ సమాధానం తల్లికి శూలంలా తగిలేది. చిన్నపిల్ల రాధ కెందుకీ వైరాగ్యం అనుకునేది తల్లి. మిగతా పిల్లలంతా కలకలలాడుతూ సినిమాలకూ, పార్టీలకూ వెళ్తూ సరదాగా వుంటే, రాధ తన కేమీ సంబంధం లేనట్లు నవలలు చదువుతూ ప్రొద్దుపుచ్చేది. రాధ అనేవ్యక్తి ఆ యింట్లో లేనట్లే ప్రవర్తించేది. అనారోగ్యానికి తోడు పిచ్చి పిచ్చి ఆలోచనలతో మనస్సు పాడుచేసుకుని మళ్ళీ ఆస్పత్రిపాలయింది. తను వెళ్ళనంటుంది. కాని తల్లిదండ్రులు వూరుకుంటారా! చేతులారా మృత్యువు కప్పగించలేరుగా! నర్సులు గంట గంటకూ చూస్తున్నారు. రాధకు ఆ మందులు మంచి నీళ్ళలా కన్పిస్తున్నాయి. నమ్మకం లేనప్పుడు ఎన్నివుంటే యేంలాభం! మందులకన్నా ముందు మనోబలం వుండాలికదా! ఈ డాక్టర్లు, నర్సులు ఎందుకిలా నాటకమాడ్డం? లాభం లేదని తెలిసివుండీ మందులు వాడటం ఎందుకు?

ఈ సారెందుకో రాధ ఆలోచనలన్నీ ఒకే వ్యక్తిపై నిలిచిపోయాయి. ఏదో చెప్పరాని ఆరాటం. ఆ వ్యక్తికి మనసువిప్పి అన్నీ చెప్పుకోవాలని ఆత్రం. రవి రాధకు తెలీకుండా రాధ హృదయంలో ప్రత్యేకస్థాన మేర్పరచుకున్న వ్యక్తి. అతన్ని గురించి ఆలోచనలు అప్పుడప్పుడూ రాధలో తలెత్తక పోలేదు. అయితే ఈ నాటి అంత బలంగా నాటుకుపోలేదు. అతన్ని చూడాలనీ ఏకాంతంగా తనబాధ చెప్పుకుని భోరునఏడ్వాలనీ రాధ వూరికే ఆరాట పడ్తూందిప్పుడు.

నాలుగేళ్ళ క్రిందట ఇరుగు పొరుగునవున్న బంధువులు, రవీ, రాధా. అప్పుడు ఒకే మాటమీద నిలచిన స్నేహం వారిది. ప్రతి దానిలోనూ అన్యోన్యంగా వుండేవారు. అలా రెండేళ్ళున్న తర్వాత, కాలమూ వయస్సూ కలసి రవీ రాధలను దూరంచేశాయి. పెద్దవాళ్ళకు ఒకరి విషయాలు ఒకరికి తెలుస్తున్నాయి కాని ప్రత్యేకంగా రాధవిషయం రవికీ, రవి విషయం రాధకూ తెలిసేదికాదు. రవి బి. ఎ. చదువుతున్నాడని విన్నప్పుడు, రాధ కళ్ళల్లో రవి రూపం నిలచి గిలిగింతలు పెట్టింది. చూడాలనే ఆత్రం రాధను బాధించింది. అదంతా తను జబ్బు పడక ముందు విషయం. కాని యిప్పుడెలా రవికి ముఖం చూపగలదు? జీవచ్ఛవంలా వున్న తన్ను యిదివరకులాగా, రవి చూడగలడా! రాధ రోజు రోజుకూ మనస్సు వికలం చేసుకుంటూంది.

ఇక రవి: రవికి చిన్నప్పటినుండీ రాధపై ఒక విధమైన అభిమానం వుండేది. రాధ ఏం చెప్పినా కాదనే వాడుకాదు. రాధ చిలిపి పనులకు ముగ్ధుడై ఆనందించేవాడే కాని, ఒక్క మాటకూడా అనేవాడు కాదు. ఆ అభిమానమే దూరమైన తర్వాత రాధపట్ల అనురాగ బంధమైంది. కాని రవి యేనాడూ రాధకు తెల్పలేదు. ఎన్నోసార్లు రాధను చూడాలనీ, నవ్వించి కవ్వించాలనీ ఆత్రపడేవాడు. కానీ తాను అస్వతంత్రుడు. రాధ ఈపాటికి చాలా పెద్దదై వుంటుంది. "ఇప్పుడు గుర్తించగలనా! చిన్నప్పటి రాధకూ యిప్పటికీ ఎంత తేడా వుంటుందో!" రాధను చూడ్డానికి వెళ్తున్న రవి ఆలోచనలవి.

కానీ.....కానీ.....తన రాధేనా ఆ అమ్మాయి? తనతో పలకదేం? ఏదో దిగులుగా సర్వం పోగొట్టుకున్న దానిలా, అలా దీనంగా వున్నదేం? ఆ చలాకీ తనమంతా 'యేమయింది? ఏమిటీ రాధలోని మార్పు? ఒంటరిగా కిటికీగుండా ఎటో చూస్తూ నిలబడివున్న రాధను "రాధా" అన్నాడు. "ఆ" అంటూ యిటు తిరిగిన రాధ కళ్ళల్లో నీళ్లు చక్రాలు తిరిగాయి. "ఎందుకు రాధా!" దగ్గరగా వచ్చాడు రవి. "చెప్పలేను రవీ!" అంటూ త్వరగా వెళ్ళిపోయింది. రాధ చెప్పలేని విషయం యేమిటి? రవి మనస్సంతా వికలమైపోయింది. తనదగ్గర దాచడమెందుకు? తప్పించుకు తిరిగే రాధనుండి యేవిషయమూ తెలుసుకోలేక పోయాడు. నిలదీసి అడిగేందుకు రాధ తలెత్తి కూడా చూడటం లేదు. ఆఖరికోనాడు దొరికిపోయింది రాధ.

చల్లని వెన్నెల పాల నురగలా పరచుకుని వుంది. డాబాపై ఒంటరిగా చందమామ చూస్తూ నిలబడివుంది రాధ. మధ్య మధ్య చిరుమబ్బులు దోబూచులాడుతూ వున్నాయి. క్రిందినుండి రేడియో భావగీతం ప్రసారం చేస్తూవుంది. అదేదో విషాద గీతం. మామిడి చెట్టుకల్లుకున్న మాధవీలత తుఫాను దెబ్బకు వాడి నేలరాలిపోయింది. అది ఆ గీతంలోని సారాంశం. రాధకు గుండెలు పిండినట్లయింది. ఏదో అవ్యక్త బాంధవ్యం తనకూ, ఆ మాధవీలతకూ వున్నట్లు భావించింది. కళ్లు రాధ మాట వినకుండా అశ్రువులు రాలుస్తున్నాయి. కళ్లు తుడుచుకుని వెనక్కు తిరగగానే వెనుకనే అర్థంగాని ఆమె ఆవేదనను పంచుకునేందుకు నిల్చునివున్న రవి కనిపించాడు. రవిని చూడగానే రాధ కాళ్లు తడబడ్డాయి. రవి చాచిన చేతుల్లో తూలిపడింది. "నీబాధ నాకుచెప్పవా రాధా!" అన్నాడు రవి ఆవేదనగా. రవి హృదయంలో తలదాచుకుని రాధ కుమిలిపోతూంది. గంటలకొద్దీ వోదార్చిన తర్వాత తన బాధంతా రవికి చెప్పింది, అంతావిని రవి పగలబడి నవ్వాడు. ఆ నవ్వులో లేదనుకున్న ఆశాజ్యోతి రాధకు కన్పించింది. ప్రశాంత గంభీరమైన రవి నవ్వులో రాధకు తనజీవితం ప్రతిబింబించింది. అంతకన్నా రాధకేం కావాలి!

మోడువారిన రాధ జీవితం తిరిగి చివురించడం మొదలిడింది. అనురాగంలో అంత మహిమ వుందని రాధకు అవగాహన కాసాగింది. ఆరిపోవలసిన రాధ జీవితజ్యోతి దేదీప్యమానంగా వెలుగుతూందిప్పుడు. భగవంతుని ఎదుట నిల్చి "నా జీవితాంతం వరకూ నా రవి నాపై చూపే అనురాగానికి అడ్డు కలిగించకు భగవాన్" అని నిండు హృదయముతో ప్రార్థించేది. రాధ ప్రార్థనలూ, నోచిన నోములూ ఫలించే సమయం దగ్గరకు వచ్చింది. కానీ...

తెల్లవారితే మూడు రోజులుంది—రవీ, రాధలు దంపతులయ్యే శుభ ముహూర్తం. రవి మనసు రాధ రూపాన్ని క్షణమొకయుగముగా వూహించుకుంటూ తన్మయత్వం చెందుతూ వుంది. సాయంత్రం టిఫిన్ అయిన తర్వాత వాలుకుర్చీలో కూచుని ఊహాల ఊయలలో ఊగుతున్నాడు. అలా కొన్ని క్షణాలు గడిచాయి. భగవంతుడు ఇక రవిని

# విషాదగీతం

అలా ఆనందంగా వుంచలేక పోయాడూ ఎర్రని సైకిల్ పై వచ్చిన వ్యక్తి గులాబిరంగు కాగితం గల కవరునందించాడు. అదిరేగుండెలను అదిమి పట్టుకుని చదివిన రవి, హృదయ విదారకంగా "రాధా" అన్నాడు. "స్టార్ట్ ఇమీడియట్లీ, రాధా సీరియస్." రవి పెదవులు వణుకుతూ ఉచ్చరిస్తున్నాయా మాటలు.

స్వాధీనంలో లేని తన శరీరాన్ని యిరవై నాలుగ్గంటల్లో స్పృహ లేని రాధవద్దకు చేరవేశాడు రవి. అసలు విషయం అడిగేంత ఓపిక లేదు రవికి. అతని ఆవేశం చూచి రాధ తండ్రి వంటరిగా రాధ దగ్గర వదిలాడు.

"రాధా! కళ్లు తెరవ్వూ! నీ రవిని—వచ్చాను రాధా! రాధా పలకవూ! ఎందుకలా అయ్యావు రాధా! నీ రవిని అన్యాయం చేసి వెళ్తావా! రాధా!" రవి పిదుపులకు కొన ప్రాణంతో వున్న రాధ కళ్లు విప్పింది. ఎవరికోరకు స్పృహ లేకున్నా రాధప్రాణం తపిస్తూ వుందో—ఆ రవి తన ప్రక్కన వున్నాడు. అంతకన్నా రాధకేం కావాలి? ఒక ప్రాణికై తపించే మరో ప్రాణి వుండం టే జీవితానికి అంతకన్నా కోరదగింది యేముంటుంది? జన్మ తరించినట్లే వుంటుంది. రాధ తృప్తిగా, బరువుగా శ్వాస వదులుతూంది. "పలకవా రాధా!" అన్న రవి పిలుపుకు "తప్పులు చేస్తే మన్నించవూ!" అంది కళ్ళనిండా నీళ్ళతో. "నన్నెందుకిలా బాధిస్తావు రాధా!" రవి పలికే ప్రతి మాటలో అతని హృదయావేదన రాధకు కన్పిస్తుంది. లేచి "రవీ వెళ్ళనా!" అంది జీవం లేని నవ్వుతో. "రాధా" గుండెలు తరుక్కుపోయేలా విలపిస్తున్నాడు రవి. రాధకు ఆయాసం ఎక్కువయింది. రవి రోదన విని అందరూ వచ్చారు. అందరినీ చూచి రాధ చెప్పలేక చెప్పలేక "నాతప్పులు మన్నించండి" అంటూ చేతులు జోడించి, ఆఖరిచూపు రవిపై నిలిచి తల ప్రక్కకు వాల్చింది. ప్రక్కనున్న వారిని కూడా మరిచి రాధపై తల బాదుకున్నాడు రవి. ఆఖరున చూచిన డాక్టరు అంటున్నాడు. "ఇలాంటి జబ్బు వున్నవారికి మితిమీరిన ఆనందం కానీ, దుఃఖం కానీ కలుగనివ్వకూడదు. అయిపోయింది ఆ అమ్మాయి జీవితం," అన్నాడు భారంగా. కడుపులో దేవినట్లయింది కన్నతండ్రికి. అనంత వాయువుల్లో లీనమైన రాధ ప్రశాంతంగా దీర్ఘనిద్ర పోతూంది. పదహారేళ్ల రాధ! ప్రపంచంపై నిర్లక్ష్యం యేర్పరచుకున్న రాధ! ఏ పాపం ఎరుగకుండా ఘోరఫలిత మనుభవించిన రాధ! దీర్ఘనిద్ర పోతూంది. అందరికీ రాధ చనిపోయింది కాని ప్రేమమూర్తి అయిన రవి హృదయంలో చిరంజీవిగా నిలిచింది—రాధ కోరింది కూడా అదే. ★



మూలం
మానిక్ బంద్యోపాధ్యాయ
అనువాదం
మద్దిపట్ల సూరి

[గతవారం తరువాయి]

శశికి వాళ్ళ అందరియెడ ఆదరాభిమానాలున్నాయా ? లేవు. శశి అంటే వాళ్ళకిమాత్రం ఉన్నాయి. పల్లెటూరి జీవితంమీద శశికి మధ్య మధ్య మరీ అసహ్యం కలుగుతూంటుంది. నిజానికి చెప్పాలంటే చాలా సంవత్సరాలనుంచి అతడి కిక్కడ ఉండ బుద్ధి పుట్టటంలేదు. కుసుమవల్లనే మనస్సు కేమిటో ఎప్పుడూ బాధగానే ఉంటోంది. అయినా ఈ ఊరు విడిచిపెట్టి పోవటం అంటే మనసు కెలాగో ఉంటోంది. శశి ఈ గడ్డమీదనే పుట్టాడు, ఇక్కడే పెరిగి పెద్దవాడయినాడు. అతడి జీవితం ఈ గ్రామంతో ముడిపడి ఉన్నది. కుసుమ పరాయి ఊరపడుచు. వెళ్ళాలని ఎప్పుడైతే అనిపించిందో, అప్పుడే అందరిదగ్గర సెలవుతీసుకునివెళ్ళిపోయింది—శశి ఎందుకని వెళ్ళలేడు? బయలుదేరి వెళ్ళేప్పుడు బహుశా శశికి కళ్ళవెంబడి నీళ్ళు రావొచ్చు. రావొచ్చు ఏమిటి ? కచ్చితంగా వస్తాయి.

"ఎందుకని శశిదాదా ! మమ్మల్నందర్నీ విడిచి ఎందుకు వెళిపోతున్నట్లు ?" అంటూ ఏడ్చింది కుసుమ.

సేన్ దీదీ కొడుకు భారం పైన వేసుకోవటంతో కుసుమకి పనులు హెచ్చు అయినాయి. అయినా ఆమె శశి ఉపచారాలనూ వాటినీ కూడా హెచ్చు చేసింది. శశి యింట్లో ఉన్నంతసేపూ ఏదో సాకు పెట్టుకుని, తీరుతుణానికి అతడి గదిలోకి వస్తూంటుంది ! కంట తడి పెట్టుకుంటూ శశికేసి చూస్తుంది. అతడితో ఎన్నో సంగతులు మాట్లాడాలని ఉన్నదామెకి. కాని ఏది మాట్లాట్టానికీ ధైర్యం చాలటం లేదు.

"ఏమిటికుసుమా ? ఏంజరిగింది ?" అని అడిగాడు శశి.

"అయిన వాళ్ళని మమ్మల్నందర్నీ విడిచిపెట్టిపోవటం మంచిదా శశిదాదా ?"

"అలా ఎవరూ వెళ్ళరంటావా కుసుమా ? అందరూ పుట్టిన ఊళ్ళోనే ఉండిపోతే ?"

"అలా వెళ్ళేవాళ్ళు పొట్ట చేతపట్టుకుని వెళ్ళేవాళ్లు. మీకు వెళ్లాల్సిన అవసరం ఏముంది ?"

ఎవరి అపేక్షీ కోరవటటం మూలంగా శశిమనస్సు ఇంతబావురుమంటోందో ! అది కుసుమ ఇంత ఆప్యాయంగా మాట్లాడటంతో చక్క బడుతుందా ? కుసుమ మరింత ఆప్యాయత వెల్లడించనియ్. మరింత విలవిలలాడిపోనియ్-అనిపించింది మనస్సులో

విలవిలలాడిపోయాడు గోపాల్. అతడేదో మరీ జీవచ్ఛవంలా అయిపోయాడు-తన యింట్లో తప్పుచేసినవాడిలా బెదిరిబెదిరిఉంటూ, శశి కార్యకలాపాలను కనిపెడుతూ-శశి ఉద్దేశ్యం ఏమిటసలు? అని వాళ్ళనీ వీళ్ళనీ ఆచూకీ తీస్తుంటాడు. శశి ఎదుటికివచ్చి మాట్లాడే ధైర్యం కాస్తా మాయమైంది గోపాల్ కిప్పుడు. కన్నకొడుకైనా కట్టడి తప్పినవాడు, ఎగురుపడితే ఏమనబోయి ఏమంటాడో చివరికి; ఎవరు చెప్పగలరు? శశి ఎక్కడికి వెళ్ళాలనుకుంటున్నాడో, ఏం చెయ్యాలనుకుంటున్నాడో సరియైన ఖోగట్టా ఎవరూ ఇవ్వలేకపోయారు గోపాల్ కి. అయినా అతడే ప్రయాణపు ధోరణిచూస్తే-ఏదో పదిహే నురోజులుండి రావటాని కెళ్లటం కాదు. శాశ్వతంగానే వెళ్ళిపోతున్నాడనే అనుమానం కలగకమానదు.

తర్వాత ఓనాడు-శశి వ్రాసిన ఉత్తరానికి సమాధానంగా ఆస్పత్రిలో ఉద్యోగం కోసమై దరఖాస్తు పెట్టినవారిలో ఒకరు ఊళ్ళోకి వచ్చారు. అతడిపేరు అమూల్య! శశి అతడు ఒక్క సంవత్సరమే ప్యాసయినారు డాక్టరు పరీక్ష. శశికా పేరు జ్ఞాపకం లేదు, కాని చూడగానే గుర్తుమాత్రం పట్టాడు. అమూల్యతో కొంచెంసేపు మాట్లాడటంతో అతడు శశికి నచ్చాడు. అది కాక ఈస్వల్ప ఉద్యోగానికై బాధ్యత వహించగలవని నచ్చిన మిత్రుణ్ణి ఎవరు వెనక్కి పంపగలరు? ఇంక ఎవర్ని నియమించటమా అనే మీమాంస పడవలసిన అవసరం లేకపోయింది. కొన్నాళ్ళుపోయాక ఫలానా తేదీకి రావలసిందని వ్రాసిన వ్యక్తికివద్దని రాసేశాడు.

తమ యింట్లోనే ఒక గది అమూల్యకి ఏర్పాటు చేశాడు శశి. "ఈ నాలుగురోజులూ నాతోనే ఉండి, నావెంట తిరుగుతూండాలి అమూల్య! రోగుల్ని పరిచయంచేసి, వారి చికిత్సకి సంబంధించిన సంగతులన్నీ చెపుతాను. ఇహనుంచి భారమంతా నీదే, ఊళ్ళో నిన్ను పిలవనంపే వారిలో చాలామంది బీదవాళ్ళు. ఫీజు యిచ్చారా లేదా అని చూసుకోకపోవటం నేర్చుకో. ఇవ్వగలశక్తి ఉన్నవాళ్ళు—వాళ్లంతవాళ్ళే ఇస్తారు. పల్లెటూళ్ళ వాళ్ళు డాక్టర్ని మోసగించేందుకు ధైర్యం చెయ్యలేరు" అన్నాడు

అమూల్యని వెంట పెట్టుకుని ఆస్పత్రికి తీసుకు వెళ్ళాడు శశి. తన కుర్చీ ప్రక్కనే అతడికొక కుర్చీ వేయించాడు. అమూల్య కొంచెం లావుగా ఉంటాడు. నెమ్మదయినవాడు. అయినా ఉత్సాహానికేం లోపం లేదు. శశి అనుసరించే పద్ధతుల్ని శ్రద్ధగా పరిశీలించాడు. ఆస్పత్రిలో ఉన్న పరికరాలు, గదులూ అన్నీ చూశాడు. అక్కడి నియమనిబంధనలను అడిగి తెలుసుకున్నాడు. బాధ్యత అంతా ఇప్పుడే పైన వేసుకున్నాడా అనిపించింది శశి వెళిపోతున్నాడు, ఇంక ఎప్పటికీ తిరిగిరాడు అన్న సంగతి తెలిశాక ఇక్కడి విషయాల్లో చొరవచేసుకునే అధికారం





వచ్చిందతడికి. శశితో కొంతవరకు సంప్రతించాడు. ఇక్కడి పనులన్నీ అమూల్య బాగానే చేసుకుపోగలడు, అయినా శశికి ఆకారణంగానే మనసులో కొంచెం కించ బయలుదేరింది తన రాజ్యాన్ని మరొకరు స్వాధీనపరచుకున్నట్లున్నదతడికి. ఎంత కష్టపడి, ఎంత శ్రద్ధవహించి ఈ ఆస్పత్రిని ఈ స్థితికి తీసుకు వచ్చాడు తాను! అందరూ 'శశిగారి ఆస్పత్రి' అనే అంటారు. తాను ఈ ఊరువదిలి పెట్టిపోయే వాణ్ణని తెలిసికూడా ఈ ఆస్పత్రిని పెద్దది చెయ్యటానికి ఎక్కువ ప్రయత్నం చెయ్యలేదు. రెండు రోజులు పోయాక ఇక్కడే ఆస్వర్యమంతా అమూల్య వహిస్తాడు. ఇది వృద్ధిలోకి రావొచ్చు, క్షీణ స్థితికి పోవచ్చు. ఏమయినా శశి చూసేందుకు రాబోడు.

తాను వెళ్ళిపోవటం ఆలోచన వచ్చినప్పుడల్లా—ఒకటి అనిపిస్తూం దేదతడికి—తనవెవరూ ఇక్కడినుంచి వెళ్ళిపొమ్మనలేదు. తనంతటతానే వెడుతున్నాడు. ఇప్పుడు తాను వెళ్ళటం మానుకున్నా ఎవరూ ఏమీ అనేందుకు లేదుకదా అని!—అయినా వెళ్లకపోతే వీల్లేదు, వెళ్లి తీరాలి! ఎవరో తనని ఉళ్ళోంచి వెళ్ళగొడతున్నట్లు—ఇంక ఇక్కడ ఉండటానికి అవకాశం లేనట్టు—అనుకునేవాడు.

వెళ్ళాలంటే బెంగ ఎందుకు శశికి? వెళ్లిపోవాలని తాను ఎన్నాళ్ళనుంచి కలలు కంటున్నాడు: వెళిపోయే ఏర్పాట్లు చేసుకుంటున్నప్పుడు—మళ్ళీ వెనక్కి తగ్గకూడదు, అశ్రద్ధ వహించకూడదు అని అతను చేసుకున్న ప్రతిజ్ఞ ఏమయిపోయింది? అమూల్యలో తన భవిష్యత్తు ప్రతి రూపాన్ని ఊహించుకునే సరికి మళ్ళీ మనస్సు ఇలా చెదిరిపోయిందా? భవిష్యత్తును గురించి ఎన్నో కలలుకంటూ గడుపుతున్నవాడు—ఈ గ్రామాంతరాలలోని చిన్న ఆస్పత్రిమీది వ్యామోహంతో ఇక్కడే ఉండి పోవాలని కోరుకోవటం—తాను చెయ్యతగిన పనికాదు.

అమూల్యని చూసి అతడెందుకు వచ్చిందీ తెలుసుకుని గోపాల్ మరీ బేజారయిపోయాడు. అతడిహ మొదలకుండా ఊరుకో లేకపోయాడు. రాత్రి శశి భోజనానికి కూర్చున్నప్పుడు గోపాల్ ఎక్కడనుంచో వచ్చి, ఓ పీట తానే తెచ్చుకుని శశి ప్రక్కన వేసుకుని కూర్చున్నాడు. అత్త వచ్చి, మంచినీళ్ళు తెచ్చి అతడి ముందర పెట్టి దగ్గరలో కూర్చోబోతూంటే "నువ్వెళ్ళి పాల్లో కూర్చో" అన్నాడు గోపాల్.

ఆమె వెళిపోయాక గోపాల్ "నువ్వెక్కడికి వెళిపోతున్నావ్ శశీ?" అని అడిగాడు.

"ముందు కలకత్తా వెడతాను"

"తర్వాత అక్కడినుంచి పశ్చిమానికి అక్కడికీ వెళ్లి తిరిగి వస్తావనుకుంటా. అయితే ఒక నెలయినా పట్టవచ్చు అవునా?"

"కలకత్తానుంచి విదేశాలకి వెడతాను."

"సీమకా" నోట్లో ముద్దపెట్టుకుని ఉన్న గోపాల్‌కి అది ఇంక మింగుడు పడలేదు. "సీమకెందుకు?" అని అడిగాడు.

"మరికొంత నేర్చుకుని వస్తాను"

గోపాల్ వ్యాకులపడుతూ, "దానికి అయితే చాలారోజులు పడుతుందనుకుంటా శశీ! కనీసం మూడు నాలుగేళ్ళకి తక్కువ పట్టదు—ఇన్నాళ్ళూ నేనొక్కణ్నే పడిఉండనా ఇక్కడ?" అని అడిగాడు.

శశి ఆశ్చర్యపోతూ—"ఒక్కరూ పడి ఉండాలా?" అని అడిగాడు.

ఒక్కడూ ఉండట మేం? ఇంటి నిండా చుట్టాలూ—పక్కాలూ కావలసినంత మంది ఉంటారు. ఊరినిండా మిత్రులం-శత్రువులూ ఉంటారు. అయినా శశి కనుక లేకపోతే తాను ఒంటరివాణ్ణి అవుతానన్న సంగతి ఇన్నేళ్ళొచ్చిన కొడుక్కి గోపాల్ ఎలా తెలియ చెప్పటం! గోపాల్ మనస్సుకి స్వస్థత చేకూర్చగల వారెవరున్నారీ జగత్తులో? అతడికి ప్రపంచంలో ఎవరన్నా అపేక్ష లేదు. తన కూతుళ్ళన్నా లేదు. ఒక్క శశిమీదనే ఇప్పటికీ విపరీతపేక్ష అతడికి. గోపాల్‌లోని ధీరత, గాంభీర్యం చెదిరిపోయాయి. దుఃఖంతో పట్టుకుపోయిన గొంతుతో "ఎందుకు వెళ్లటం నాయనా? నామీద కోపంతో వెడుతున్నావా? నీకు నేనేమీ చెయ్యలేదే!" అన్నాడు.

"జీవితంలో పైకిరావాలనే ప్రయత్నంతో వెడుతున్నాను. ఇందులో కోపం ఏముంది?"

గోపాల్ కొంచెం ఆలోచించి- "మూడు నాలుగేళ్లు పోయాక మళ్ళీవచ్చినా బహుశా నన్ను చూడలేవుశశీ!" అన్నాడు.

మూడు నాలుగేళ్లు పోయాకయినా తాను వచ్చేదీ రానిదీ ఆ సంగతి శశి ఏమీ చెప్పలేదు. మొదలకుండా అన్నం కలుపుకో సాగాడు.

"ముసలివాణ్ణి అయిపోయాను. ఒక వేళ హఠాత్తుగా ఎప్పుడో ఒకప్పుడు, నువ్వు దగ్గిరలేకపోతే ఇదిఅంతా ఎవరు చూసుకుంటారు" ఇన్నాళ్ళూ కష్టపడి సంపాయించిందంతా పాడైపోతుంది" అన్నాడు గోపాల్ మళ్ళీ.

"మీ యిష్టంవచ్చిన వాళ్లి కెవరికైనా ఇవ్వండి" అన్నాడు శశి.

"ఇది కుర్రతనపుమాట శశీ! కోపంతో అనేమాట!" అని గోపాల్ ఉత్సుకదృష్టితో చూస్తూ ఊరుకున్నాడు. వృథా ఆశ! సరియైన సమాధానం శశియేమీ చెప్పలేదు. గోపాల్‌కి లోపల తిరుక్కుపోతోంది. శశి అంతర్యం ఏమిటో అంతు పట్టకుండా ఉందే! ఎంత విచిత్రంగా తయారయాడు కొడుకు! తన ఉద్దేశ్యం ఏమిటో స్పష్టంగా చెప్పకూడదా శశి! అన్నీ వదులుకుని కొడుకు ఏం కావాలన్నా సరే ననటానికి సిద్ధంగా ఉన్నాడు గోపాల్. తన ఇష్టాయిష్టాల్ని చూసుకోనే చూసుకోడు. ప్రయోజకుడై తన మాట విననివాడైనాడు కొడుకు. ఇంకేం చెయ్యగలడు గోపాల్? అన్నిటినీ సహించి ఊరుకోవలసిందే. ఆ ధోరణిలోనే కొంచెంసేపు మాట్లాడాడతడు. అతడు బతిమాలు కుంటున్నట్లు మాట్లాడాడు. గోపాల్ ఎంతకోపాన్ని, భయాన్ని, విచారాన్ని అణచుకుని మాట్లాడుతున్నదీ శశి గ్రహించి తాను పెద్ద ఇరకాటంలో పడ్డానే అనుకున్నాడు. అయినా అతడేమీ సందివ్వలేదు. తండ్రి కొడుకుల మధ్య ఇవాళ ప్రారంభమయిన సంఘర్షణ అందరికీ తెలిసిపోయింది. అందరూ తలుపులచాటున—కిటికీలచాటున చెవులొగ్గి నుంచుని ఉన్నారు. వాళ్ళుకాస్త బిగ్గరగా మాట్లాడుకొంటే చెవులారా వింటారు. అసహజమైన స్తబ్దత ఆవరించుకుంది ఇల్లంతా. ఏక్షణాన లేగుతుందో తుపాను—చెప్పలేము.

తుపాను మరోకవైపుగా లేగింది. సేనదీదీ కొడుకుని చంక నెత్తుకుని కుంద ఎక్కడినుంచో హఠాత్తుగా వచ్చి నుంచుంది. భోజనమయి లేచాక "ఒక్కసారిచూడు శశిదాదా! ఒళ్ళు వేడిగా ఉన్నట్లుంది" అన్నది.

శశి తలఎత్తి చూడలేదు, మాట్లాడలేదు. గోపాల్ ఆదుర్దాగా "జ్వరం వచ్చిందా? ఏదీ చూడనియ్. చూడుశశీ, ఒక్కసారి ఒంటిమీద చెయ్యివేసి, జ్వరంలాగానే ఉంది" అన్నాడు.

శశి మొదలకుండా అన్నం విడిచిపెట్టి, లేచి వెళిపోయాడు.

'జ్వరం వచ్చిందేమో చూడు పసివాడికి' అని బతిమాలినందుకు అలా లేచివెళిపోయాడంటే అర్థమేమిటో గోపాల్‌కి



శ్రీశైల మల్లికార్జునాలయ దృశ్యం

కోపపడకుండా ఉంటుందా! కుంద ఆశ్చర్యపోయి చూస్తుంటే, గోపాల్ కివాళ సిగ్గుతో ఒళ్ళంతా గరిపొడిచింది. ఇలాంటిది జీవితంలో ఇదే తొలిసారి అతడికి. తర్వాత గంభీరంగా నిగ్రహించుకున్నాడు దాన్ని. తన మామూలు ధోరణిలో—"ఫో పాపిష్టిదానా! ఫో ఇక్కణ్ణుంచి" అని కుందని గద్దించాడు.

ఉత్తిపుణ్యానికిలా గద్దించటాన్ని కుంద సహించలేకపోయింది. మొదట్లో నిర్ఘాంతపోయింది. తర్వాత ఏడుస్తూ తన గదిలోకి వెళ్ళిపోయింది. చూస్తూ చూస్తుండగానే కుతూహలం పట్టలేకుండా ఉన్న ఆడవాళ్ళంతా అక్కడ గుమిగూడారు. ఇంట్లో ఈ వాతావరణం కొన్నాళ్ళనుంచి అందరికీ తికమకగానే ఉంది. ఇదాకా ఎదురులేని కుంద యిప్పుడు యజమానిచేత చీవాట్లు తినటం వాళ్ళందరికీ సంతోషంగానూ ఉంది, ఆశ్చర్యంగానూ ఉంది...

"ఎందుకే కుందా? నిన్నెందుకు కేకలేశారు?"

కుంద అంత తేలిగ్గా బయటపెడుతుందా!

"ఎందుకు విసిగిస్తారు నన్ను, వెళ్ళండి" అంటూ గుసగుసలాడిందామె. అందరూ కలిసి ఆమెని ఉబ్బించగా ఉబ్బించగా గోపాల్ కోపానికి కారణమేమిటో అప్పుడు బయటపెట్టింది. "ఇదంతా నా రాత! సేన్దీది కొడుకుని కేదా దగ్గరికి ఎప్పుడూ తీసుకు వెళ్ళొద్దు" అని మామ ఎన్నోసార్లు చెప్పాడు నాకు. సమయానికి నాకామాట జ్ఞాపకమే రాలేదు. నేనొక్కతే అమాయకపు ముద్దని. నాకిలాంటి పెద్దారపు మాటలు ఎక్కడ జ్ఞాపకముంటాయి?" అన్నది.

"అవునే కుందా! ఆ పిల్లాణ్ణి తీసుకువచ్చినప్పట్నుంచే కదా ఇలా రేగిపోతున్నాడు. తండ్రితో మాట్లాడటమే మానేశాడు, విరక్తిపుట్టి లేచిపోతాడు కదా అనేమో?" అన్నారు అందరూ.

"లేకపోతే ఏమిటి మరి?" అన్నది కుంద.

కుంద కొంచెం నవ్వింది. "ఈ పిల్లవాడి మూలంగా తండ్రీకొడుకుల మధ్య పచ్చిగడ్డి వేస్తే ఎలా భగ్గుమంటున్నదో మీకేం తెలుసు? నాకు తెలుసు అదంతా. తండ్రీకొడుకు లిద్దరూ భోజనానికి కూచున్నారు కదా, ఒకసారి తీసుకెడితే అయినా ఏమవుతుందో చూద్దామనే తీసుకువెళ్ళాను చిన్నత్తా. అయినా ఇలా తిట్లు తినాల్సి వస్తుందని మాత్రం అనుకోలేదు. అప్పుడే ఏమయింది? ఈ పిల్లవాడి మూలంగా ఇంకెంత రగడవుతుందో చూడండి. మామూలు తల్లికన్న బిడ్డ కాదు వీడు!"

"దానికి తోడు నీదగ్గిర పాలుతాగుతున్నవాడాయె! కాదు కుందా! వీడుంటే గాలి కొంపకి చిచ్చే!"

(64 వ పేజీ చూడండి)

# జీవితాన్వేషణ

తండ్రి దగ్గరనుంచి వచ్చిన ఉత్తరాన్ని మళ్ళీ ఇంకోసారి చదువుకొని, బరువుగా నిట్టూర్చి ఆలోచనలో పడ్డాడు రఘు.

ఎందుకు వీళ్ళందరూ తనను హింసిస్తారు? పిల్లల సౌఖ్యాన్ని ఆదర్శంగా పెట్టుకున్నట్లు తాము భావించి, తమ తొందరపాటు వల్ల వాళ్ళ జీవితాలలో క్రొత్తగా వచ్చే సమస్యలతో జీవితమంటే విరక్తి కలిగించి మరింత వేదాంతులుగా చేస్తారు తల్లిదండ్రులు. కొడుకుని ఒక యింటివాడిగా చేశామని మీసం ఖుశానాగా దువ్వుకొని పెళ్ళిపందిట్లో హుషారుగా తిరుగుతాడు తండ్రి. నలుగురిలో గొప్పగా కొడుక్కి చేసిన పెళ్ళి విశేషాలు చెప్పుకుంటాడు. ఈ పెళ్ళి చేసి కొడుకుని బాగు చేశామని సంతృప్తిని సూచించే నిండుతనపు మందహాసాన్ని వ్యక్తం చేస్తాడు సంఘానికి. తనలాటి తోటి తండ్రులకి: "హు, చూశారా, మా అబ్బాయిని బాగుచేశాను. వాణ్ణి ఒక ఇంటివాణ్ణి చేశాను. వాడూ, కోడలూ చిలకా గోరింకల్లాగ కాపురం చేస్తూ సుఖంగా ఉంటారు. వాళ్ళకి పిల్లలు పుడతారు. వాళ్ళకి నా పేరూ, మా ముసిలావిడ పేరూ పెట్టుకుంటారు. మేం గుటుక్కు మనకుండానే మనమల పెళ్ళిళ్ళు కూడా చూసేసి వెళ్ళిపోతాం" అని బరువైన బాధ్యతను తాము మోస్తున్నట్టూ, అది ఈ నాటికి తీరిపోయినట్టూ భావిస్తారు. కాని తమ బాధ్యతనే కొడుకు భుజాలమీద పెట్టేసినందుకు బాధపడరు. సానుభూతి చూపించరు! ఇక తల్లి తనకొడుక్కి ఈ పెళ్ళి అనే నిచ్చెన వేసి పున్నామ నరకంలో పడకుండా జాగ్రత్తగా స్వర్గలోకపు కోటగోడ ఎక్కించామని, మనమల ముద్దుమాటలు విని జన్మ ధన్యం చేసుకోవాలనీ, ఇన్ని ఆశలు యీ నాటికి నెరవేరే శుభసమయం ప్రాప్తించిందనీ ఆనందభాష్పాల్ని రహస్యంగా పమిట చెంగుతో తుడుచుకుంటుంది. తన తోబుట్టువులు లాంఛనాల సరదాలతో తమ చిరకాల మనోరథాలన్నీ తీర్చుకుంటారు. బంధువులు ముచ్చటలకోసం, పిండివంటల కోసం కీచులాడతారు.

నిజానికి తను పెళ్లి చేసుకోడం ఇంతమంది ఆశలు తీర్చడానికే గాని తను సుఖపడ్డానికి కాదు. చాలా కాలంనుంచి తను పెళ్ళి చేసుకోకూడదని సంకల్పించుకున్నాడు. పెళ్లి చేసుకుని సుఖంగా జీవించే దంపతుల్ని మాత్రం చూసి ఆనందించగలడు. వివాహమనే సంఘటన తన జీవితంలోకి మాత్రం ప్రవేశించడం ఇష్టం లేదు. ఇదొక ఆదర్శమనీ, రఘూ ఆదర్శజీవి అనీ, ఆచరణకి సాధ్యంకాని ఆదర్శం నష్టానికే దారితీస్తుందనీ చాలామంది విమర్శించారు. తన సంస్కారపు అవధిలో లోకం లేదు కనుక తనఆశయం వారికి అర్థంకాదని రఘు నమ్మకం.

క్రిందటి సెలవుల్లో వాళ్ళ ఊరికి వెళ్ళినప్పుడు ఈ విషయం మీద రఘూకీ, తండ్రికీ తీవ్రమైనవాగ్యుద్ధం జరిగింది.

ముసిలాయన "కుర్రాడులే, ఎప్పటికైనా తెలియకపోదు. మాటకాదనే ధైర్యం

## ప. గోపీచంద్

ఉందా?" అని రఘు వినకుండా భార్యతో అన్నాడుకూడా. రఘు పట్టుదల ముసిలాయనకి ఆశ్చర్యమూ, అనుమానమూ కలిగించింది.

రఘుకి నాటి సంఘటనలన్నీ జ్ఞాపకం వచ్చాయి. అదంతా ఒక పీడకల. జీవితం నుంచి ఆ దుస్సంఘటనలన్నీ త్రోసివెయ్యాలని ప్రయత్నంచేస్తుంటాడు. కాని ఈ ఉత్తరం ఆ సంఘటనలన్నీ సింహావలోకనం చేయించింది.

తన తల్లిదండ్రులకీ, తనకూ రాజీకుదరని ఈ వాగ్వివాదం తమ అనుబంధానికి ప్రతిబంధకమౌతుందేమోనని ఆలోచించాడు. తన ఆదర్శాన్ని తండ్రి కోరికకు బలి ఇచ్చి జీవితాంతమూ అతకని బ్రతుకులతో పరిమితం కావడమా? లేక తల్లిదండ్రుల కోపానికి గురై దూరం కావడమా? ఒక నిర్ణయానికి రాలేకపోయాడు.

ఆ మర్నాడు రాత్రి ఊరికి తిరుగుప్రయాణం. ప్రొద్దున తండ్రి ఆఫీసుకి వెళ్ళినసమయం చూసుకొని, తల్లి ఎంతో కాలం నుంచి మనస్సులో దాచుకున్న విషయాలన్నీ మాట్లాడాలనీ నిశ్చయించుకుంది. ఆమె ప్రయత్నాన్ని రఘు గ్రహించాడు. చివరికి తల్లిదండ్రులలో ఏ ఒక్కరైనా తన ఆశయాన్ని అర్థంచేసుకోగలిగితే చాలునని అతను ఆశపడ్డాడు.

ఈ ప్రస్తావన ఎలాగ ప్రారంభించాలో, తనని దారిలోకి తీసుకువచ్చేటట్లు ఎలాగ నచ్చజెప్పాలో ఆమె ఆలోచించుకుంటున్నట్టు ఆమె నిశ్శబ్దతని బట్టి ఊహించాడు. తనే ప్రారంభించాడు.

"అమ్మా, జీవితంలో తెలిసి చేసేతప్పులూ, తెలియక చేసేతప్పులూ ఒకే విషఫలితాన్ని ఇస్తాయి. అందరు తల్లిదండ్రులూ తమ పిల్లల పెళ్ళిబాధ్యతల్ని మీద వేసుకున్నట్టే మీరూ నాది వేసుకున్నారు. అందరు తల్లిదండ్రులలాటి వారేమీరు. కాని అందరి కొడుకులలాటి వాణ్ణి కాను. ఇక్కడే భేదం. సృష్టిలో చాలా వస్తువులు ఏదో ఒక ప్రయోజనానికి ఉపయోగపడుతున్నా, కొన్ని వస్తువులు అసలు ఉపయోగం అనే ఉద్దేశానికే సృష్టించ బడలేదు, దానికి నా వైవాహిక జీవితం ఒక ఉదాహరణ."

ఇంత సంగ్రహమైన భాషలో అనల్పంగా తన ఆదర్శాన్ని అంతా ఇమిడ్చి స్పష్టం చేశానని రఘు తృప్తిపడ్డాడు. కాని అది అడియాస అని వెంటనే తేలిపోయింది!

"రఘూ! ప్రపంచంలో ఎందరు పెళ్లిళ్లు చేసుకోడంలేదు? ఎందరు సుఖంగా ఉండడంలేదు? దీనికి అర్హతలేమిటి, అడ్డుగోడ లేమిటి?" అంది ఆమె.

రఘు బాధపడ్డాడు. ఆమె కూడా తండ్రిలాగే మాట్లాడుతోంది!

"అమ్మా, నువ్వు వేరే వ్యక్తివి. అంటే నీ వ్యక్తిత్వం నా వ్యక్తిత్వానికి చాలా భిన్నమైనది. నీకు కలిగే అభిప్రాయాలూ, భావాలూ వేరు. నావి వేరు. కాబట్టి నా దృక్పథంతో నువ్వు ఈ విషయాన్ని ఆలోచించలేక పోతున్నావు.

కాని ఒకటి. ఎదుటి వ్యక్తుల జీవితాల్ని తమ జీవితాలతో సమన్వయించుకొని అర్థం చేసుకోలేకపోయినా, వారి జీవిత సమస్యలెంత కఠినమైనవో ఊహించవచ్చు." అన్నాడు.

రఘు ఈ విధంగా తర్కిస్తూ మాట్లాడడం ఆమెకు నచ్చలేదు.

"రఘూ, నీ జీవితానికి పెళ్ళివల్ల వచ్చే ప్రమాదం ఏమిటో చెప్పు?" అంది విసుగ్గా.

రఘు చాలా నిరుత్సాహ పడ్డాడు.

"అమ్మా, అందరి జీవితాలూ ఒక్కలాగే లేవు. ప్రపంచంలో పెళ్ళి చేసుకోనివాళ్ళు ఉండవచ్చు. అందరూ సుఖపడుతున్నారనుకోడం ఆత్మవంచన. భ్రమ. దానికి కారణం చాలామందికి వివాహం అతకదు. వివాహానికిముందు జీవితంలో సుఖంగా ఉన్నవాళ్ళు, వివాహమైన తరువాత విరాగులుగా మారడానికి ఇదే కారణం. అసలే అంతకుముందు ఉన్న జీవిత సమస్యలతో జీవితమంటే నరకమనే అభిప్రాయం కలిగిన వ్యక్తి. వివాహం తరువాత తన సమస్యలనేకాక, సంసార సమస్యలను గురించికూడా ఆలోచించలేక, పరిష్కరించలేక జీవితంలో బ్రహ్మచారుల్నీ, వేదాంతుల్నీ, సన్యాసుల్నీ చూసి అసూయ పడడంలో ఆశ్చర్యం ఏముంది? వివాహానంతరం ఏ కొద్ది నెలలో అనుభవించిన దాంపత్య సౌఖ్యంతప్ప, పిల్లలూ, భార్యా, అకాల వార్ధక్యమూ, రోగాలూ, మనోవ్యాధులూ వీటితోబాటు ఇందరి సమస్యలకు పరిష్కార మార్గం కనిపించక మానవ జీవితం అంటే ఒక శాపం అనుకొని చావలేక జీవించేవారిని నేను ఎప్పుడూ చూస్తూనే ఉన్నాను. వారు వివాహం అనే పేరుతో మోస్తున్న ఈ సమస్యల బంధానికి అంతమంటూ లేకపోవడం చూసి జాలిపడుతూంటాను. వారి అనుభవాలు మాత్రం నా జీవితంలోకి ప్రవేశించకూడదని గుణపాఠం చెప్పుకుంటుంటాను. వద్దమ్మా వద్దు. వివాహమంటే సమస్యల తోరణం కాదు. జ్వాలా తోరణం. జీవితాంతం ఈ పంచాగ్ని మధ్యంలో పడి నరకబాధ అనుభవించాల్సిందే."

ఆమెకు అతన్ని నచ్చచెప్పగలననే ధైర్యం పోయింది. కోపంగా,

"జీవితంలో ఏ నాటికైనా నువ్వు ఒంటరితనానికి తప్పకుండా బాధపడకపోవు" అంది లేచిపోతూ.

"ఒంటరితనంలో ఆనందాన్ని కాక విషాదాన్ని చూసే వ్యక్తులలో చేరనమ్మా. అక్కడే నా జీవితానికీ, వారి జీవితాలకూ భేదం" అన్నాడు.

ఆమె లోపలికి వెళ్ళిపోతున్నదని ఆమెకు వినిపించేట్టు అవరోహణ స్వరంలోనుంచి, ఆరోహణ స్వరంలోకి హెచ్చించాడు ఆ వాక్యం.

ఆ సాయంత్రం తండ్రి తనతో మాట్లాడలేదు. పెడమొహం పెట్టుకుని ఇంట్లో తిరిగాడు తను కనిపించినప్పుడంతా. రైలు టైం అయింది. రఘు గుమ్మం దిగుతూ తల్లిదండ్రుల దగ్గర సెలవు తీసుకోడం ఎలాగ? అనే మీమాంసలో పడ్డాడు. తండ్రి మొహం తుఫాను రావడానికి ముందు ఒక విధమైన విచిత్ర గాంభీర్యం పొందిన ఆకాశం లాగ ఉండడం చూసి ఈ సంఘర్షణకి రాజీ లేదని నిర్ణయించుకున్నాడు. గుమ్మం దిగుతున్న రఘుని చూసి గర్జిస్తున్నట్టు.

"నీభవిష్యత్తుని నిర్ణయించుకునే అధికారివి నువ్వే అని పొరబాటు పడకు. పెద్దవాళ్ళు జీవితాన్ని అనుభవించి అర్థం చేసుకున్నవాళ్ళు థియరీస్ వల్లించడమూ, జీవితాన్ని అనుభవించడమూ ఒక్కటి కాదు." అన్నాడు గంభీరంగా.

రఘు ఉద్రేకాన్ని ఆపుకోలేకపోయాడు.

"—కాని వివేచనాశక్తి ఉన్న వ్యక్తి థియరీస్ కీ, జీవిత స్వానుభవాలకూ భేదం వుండదు నాన్నా. ఆ థియరీసే జీవిత సారం!" అని దిగిపోయాడు మెల్లగ గబగబ.

తన వెనుక తండ్రి నవ్విన నవ్వులో లక్ష అర్థాలు తీయవచ్చు. తన జీవిత సర్వస్వం మీద ఆయనకు స్వామ్యమున్నదనే అర్థం, ఒక బానిసమీద యజమానికి ఉండే సంపూర్ణ అధికారం, పిచ్చివాడి పిచ్చిమాటలకు హేళన సూచించే నవ్వు—ఇంకా, ఇంకా ఎన్నో అర్థాలు వెతుకుతూ టిక్కట్టు కొని రైలెక్కాడు.

ఆ నవ్విన నవ్వులోని అధికారపాశమే తన స్వేచ్ఛాజీవితాన్ని బంధించగల నియంతృత్వపు హస్తాన్ని ఈ ఉత్తరంలో ప్రకటిస్తోంది. రఘు కోపంతో ఆ ఉత్తరాన్ని ఉండచుట్టి మూలకు గిరవాటు వేసి లేచాడు. ఆఖరిసారి తండ్రితో తన ఉద్దేశాన్ని చెప్పివేసి తన స్వేచ్ఛనూ, తన మహత్తర ఆదర్శాన్నీ నిలబెట్టుకోవాలని ని



విరహిణి
చిత్రం : పీరిశెట్టి అచ్యుతరావు.

నికి వింతగా కనిపిస్తుంది" అని అన్నాడు.

ముసలాయన చాలాసేపు ఓపికగా విన్నట్టు—

"ఇంకా ఉందా చెప్పవలసింది? అయిందా?" అన్నాడు.

రఘు "ఇంతకంటే చెప్పవలసిందేముంది నాన్నా" అన్నాడు.

వెంటనే తీరా జ్వాలాగ లేచి—

"ఉద్ధరించావ్ లేవోయ్. జీవితాశయాలట! భావనా సుందరిట!! ప్రపంచంలో ఎందరు పెళ్ళిళ్ళు చేసుకుని సుఖంగా ఉండడం లేదు? నీ ఉపన్యాసం వింటూంటే ఏదో పాతుకచెప్పినట్టు ఏదో అయితే గియితే మరేదో జరుగుతుందని అపని మాను కున్నవాడి అతితెలివిలాగ ఉంది" అన్నాడు చిరాకుగా.

"కాదు నాన్నా. భవిష్యత్తులో జరగని అసంభవాల్ని ఊహించి భయపడిపోయి పిరికివాడిలాగ వివాహాన్ని నిరాకరించడం లేదు. వ్యక్తిత్వాల విభేదాలు వ్యక్తుల జీవితాలను వేరు వేరుగా నిర్ణయిస్తుంటాయి. ఇందుకే నా జీవితానికి, మీరు అనే ఇతరుల వైవాహిక జీవితాలకూ భేదం! వివాహం అనే సంప్రదాయాన్ని గౌరవించడంకోసం నా యావజ్జీవిత సౌఖ్యాన్ని త్యాగం చెయ్యలేను. జీవితంలో వ్యక్తి సౌఖ్యానికి శాశ్వతత్వం ఉండాలంటే ప్రేమ అనే దివ్యానుభూతి అజరామరం కావాలంటాను. ఈ 'ప్రేమ' వివాహం కావడంతో దంపతుల శారీర కానుభూతితో క్షీణించిపోతుంది. కాని మానసికానుభూతివల్ల మాత్రమే ప్రేమలో నిత్యనూతనత్వం, తపనా, ఆనందమూ శాశ్వతంగా ఉంటాయి" అన్నాడు రఘు.

"ఇంత డొంకతిరుగుడుగా చెప్పడమెందుకు? నువ్వు ఎవరినైనా ప్రేమించావా? నిజం చెప్పు?" అన్నాడు రహస్యం కనుక్కున్నట్టు.

"నా మానసిక ప్రణయారాధనలోని ప్రేమని పొందడానికి లోకంలోని ఏ స్త్రీకీ అర్హత లేదు నాన్నా" అన్నాడు రఘు, తన ఆదర్శాన్ని తండ్రి అర్థం చేసుకోలేకపోయాడనే విచారంతో.

ఇంక ఓపిక పట్టలేక కోపంతో అరిచాడు ముసలాయన.

"అయితే నవలలద్వారా, సినిమాల ద్వారా నువ్వు నేర్చుకున్నదాన్ని నీ జీవితంలో ప్రవేశపెట్టుకొని చెరులారా నాశన మౌతావా?"

"నవలలూ, సినిమాలూ వాస్తవిక జీవితాల్లో తటించడానికి ఉపయోగపడే విలువైన జీవిత సత్యాలను బోధిస్తే స్వీకరించడంలో తప్పులేదు నాన్నా. అయితే వాస్తవిక జీవితాలకు అనుభవ దూరమైన అసత్యాలను బోధిస్తే వాటిని స్వీకరించలేను. కాని ఒక్కటి. మీరనుకుంటున్నట్టు నాయీ ఆశయాన్ని నవలలనుంచీ, సినిమాలలోనుంచి గ్రహించలేదు. దీన్ని నా జీవితం బోధించింది."

"వ్యవహారం చెయ్యి దాటిపోతోంది. చాలాకాలంనుంచి ఓర్పుగా ఉంటున్నాను. ఏమైనా సరే యీ పెళ్లి జరిగితీరాలిసిందే. ఆయనకు మాటకూడా ఇచ్చేశాను" అన్నాడు తండ్రి.

"తల్లిదండ్రులు పిల్లల సౌఖ్యాన్ని కోరుతున్నప్పుడు వారి వివాహాల విషయంలో స్వేచ్ఛను ఇవ్వడంకన్నా కావలసిందేముంది నాన్నా" అన్నాడు.

"నీ పంతాన్ని వదలకపోతే నీకీ ఇంట్లో స్థానం లేదని తెలుసుకో. నిన్ను కని, పెంచి, పెద్దవాణ్ని చేసినందుకు కృతజ్ఞత ఇదేనన్నమాట?"

"ఇక నా పొరపాటు పిల్లలు తమ మాట వినకపోతే ఆఖరి ప్రయత్నంగా పెద్దవాళ్ళు ప్రయోగించే దండోపాయం. పెంచిన కృతజ్ఞతాభావానికి జీవిత సౌఖ్యాన్ని అమ్మకపని ఋణం తీర్చుకోవాలని శాసించడం వాంఛనీయమైనది కాదు. కృతజ్ఞత హృదయంలో దాచుకుని నిశ్శబ్దంగా అనుభవించే గౌరవభావం," అన్నాడు రఘు.

"నువ్వు నాకు చెడువు కలుగుచున్నావ్. విశ్వాసఘాతకుడా! వెంటనే ప్రయాణం కట్టు" అని లేచి వెళ్ళిపోయాడు తండ్రి.

సంప్రదాయానికి తలవంచలేదని సంఘం విశ్వాసఘాతకుడి వేషం వేసింది. లోకంలో స్వతంత్రంగా ఆలోచించుకుని, జీవించడంలో స్వేచ్ఛగా ఊపిరి పీల్చుకోదాన్ని అడిగిన వివేచనాశక్తిగల వ్యక్తులకు విప్లవకారులుగా రంగుపూస్తుంది సంఘం! దచ్చినా, చావలేక జీవిస్తున్నా ఆ సంప్రదాయాలను గౌరవించవలసిందే!

ఆ సంప్రదాయాల చాకచక్యాలు కొందరి జీవితాలకు పరిపాక పోయినా సరే అందులో బిగువుగా బిస్సుకులాడి ఊపిరాడక చిత్రవధ అయినా సరే.

రఘు కళ్లనుంచి నీళ్ళు కారాయి. తన స్వతంత్రంగా సౌఖ్యంకోసం ఆదర్శాన్ని కాంక్షించుకున్నందుకు తండ్రి—తనకు దూరంగా ఉండాలని ప్రవాస శిక్షని వేశాడు! తను ఈ ఇంట్లో ఉంటే తన తల్లిదండ్రులకు మనశ్శాంతి ఉండదు.

రఘు లేచి ప్రయాణ సన్నాహాలు చేసుకోడానికి లోపలికి వెళ్ళిపోయాడు. రాత్రి ప్రయాణ సమయం సమీపించింది.

రైలుకి వెళ్ళబోతూ తల్లిపాదాలకు వంగి నమస్కరించి, అన్నాడు:

"అమ్మా నాకు జీవితాన్ని ప్రసాదించిన దేవతవి. నీకెప్పుడు కావలసినా నా దగ్గరికి నువ్వు రావచ్చునని అనడానికి నే నెవరిని?"

ఆమె పాదాలమీద అతని వెచ్చని అశ్రుకణాల స్పర్శకు ఆమెలోని మాతృత్వం అగ్నిపర్వతంలాగ బద్దలయి మేల్కొన్నది. ఆమె రహస్యంగా కళ్లు ఒత్తుకుంది. తండ్రి వైపు చూసి మెల్లిగా దిగాడు.

తనసూచించి తానుతత్వపరిశీలన చేసుకుంటున్నట్టు ముసలాయన కిటికీలోనుంచి చీకటిలోకి చూస్తూ నిలబడ్డాడు.

ఆ ఇల్లంతా చేతనా రహితంగా, నిర్జీవంగా చీకట్లు కమ్ముకున్నాయి. రఘు వెళ్ళిపోతున్న వైపు గాలివాన రావడానికి ముందు ఆకాశమంతా కమ్ముకునే కారుమబ్బులతో కటిక చీకటి కాటుక లాగ పులుముకుంది. ★



## పూవు మీ అదృష్టం చెప్పగలదు

మీ భవిష్యత్తులో ఏమి జరుగబోవునదిన్ని, మీ సరియైన దర్శనుకురించిన్ని మీరు తెలుసుకోవగోరినట్లయితే ఒక పోస్టుకార్డుపైన మీకు యిష్టమగు ఒక పువ్వుపేరున్నూ, మీరు వ్రాయు తేది, వేళ వివరములున్నూ, మీ సరియైన చిరునామాయున్నూ వెంటనే వ్రాసి పంపండి.

జ్యోతిష శాస్త్రములోని రహస్య గణితము మూలముగా మేము గుణించి, మీరు కార్డు వ్రాసిన తేదిలగాయతు 12మాసములలోను మీయొక్క అదృష్టము, లాభనష్టములు, జీవితమార్గము, ఏ వ్యవహారములో మీకు జయముకలుగునో, మీ ఉద్యోగం విషయంలో మంచిచెడ్డలు, మార్పులు, ఆరోగ్యవిషయము, పరదేశగమనము, తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము, నిధినిక్షేపములు, లాటరీ, అకస్మాద్ద్రవ్యలాభము మొదలగు వానినిగురించి స్పష్టముగా మాసవారీగా వ్రాసి రు. 1-4-0 లకు మాత్రము వి. పి. గా పంపగలము. (వి. పి. చార్జిలు ప్రత్యేకం) దుష్ట్రగహము లేనయినా వున్నయెడల శాంతిచేయు విధానంకూడా తెలుపగలము. వివరములు పూర్తిగా పైన పంపబడును. మేము పంపిన ఫోకటా మీకు తృప్తిగా నుండనియెడల పైకము వాపసు చేయబడును. ఒకసారి పరీక్షించి చూడుడు. మీ అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

Pt. DevDutt Shastri, Raj Jyotishi (WP-13) Jullundur City.

# రెండు దృశ్యాలు



నెత్తిమీది తట్ట వొయ్యారంగా దింపుకుని, మెల్లిగా తడిక తోసుకుని లోనికి అడుగు పెట్టింది బంగారు. నులక కుక్కిలో ముసుగు తన్ని పడుకున్నాడు రంగడు.

"ఏటి మావోయ్, పొద్దు ఇంకా గూడు పేరి పొద్దన్నా కాలే అప్పుడే తొంగున్నావేటి? లెగు, లెగు" అని ముసుగులాగేసి జబ్బ పట్టుకు లేవదీసింది.

"పో, పోయే ఇంత పొద్దాయేదాకా నువ్వు పెత్తనాలు సేత్తావుంటే, నేను కుక్కలాగా వాకిలి కాయాలిటే. బంగారూ! నువ్వు పనిసేసి ఇంటికాడే వుండనేకపోయావూ!" చెయ్యి విదిలించుకుని అటు తిరిగి పడుకున్నాడు.

"ఆబ్బోస్, ఎంతకోపం వచ్చినాది. మరి పండగపవంటే మాటలేటి! తప్పాలన్నీ తోమీ తోమీ సేతులు మంటలెత్తినాయనుకో, పనయేసరికి ఈయాలయింది. ఏటి సెయ్యమన్నావు" జాలిగా అన్నది బంగారు.

అంతలోనే రంగడికోపం కాస్తా ఎగిరిపోయింది. గబుక్కున లేచికూర్చుని, "అవునే బంగారూ ఈ పాడుపని సెయ్యొద్దంటే ఇన్నావు కావు. ఇప్పుడు కష్టమంటే నేనేటి సెయ్యను. నేను సంపాదించి తెచ్చేది మనిద్దరికే సాలదటే అంటే ఇనవు. నెల ముప్పయిరోజులు పనిసేత్తే ముష్టి మూడు రూపాయలు ఇత్తారు. ఎవవ పాసిపని రేపటాల నుంచీ మానెయ్యి."

"ఏటిమావా కబుర్లు సెప్పినావు. నువ్వు కష్టపడి తెస్తావుంటే నేను కులుకుతూ కూర్చుని తినమంటావా! పనిసేత్తే తప్పేటి మావా! ఇప్పుడు సుఖంమరిగితే రేపు పిల్లా పిచికా కలిగినాక పని సెయ్యాలంటే వొళ్ళు వొంగుతుందా. నువ్వన్నీ పిచ్చికబుర్లు చెప్తావు గానీ. నువ్వు సంతోసంగుంటే నా మీద కన్నెర్రజెయ్యకుండా వుంటే నాకు ఏనుగంతబలం మావా ఎంతపనైనా ఇట్టే సేసెత్తాను."

"నీ బాబు నీకు ఏరికోరి పేరెట్టినాడు నిజంగా నువ్వు బంగారానియ్యే నే. నువ్వు రాకముందు గంజినీళ్ళకికూడా కరువైపోయేవోణ్ణి, నువ్వడిగట్టినకాణ్ణించి నాగాలేకుండా కూడ్డబ్బులు దొరుకుతున్నయ్యి అదంతా నీ అదుష్టమేనే బంగారూ! నీమీద కన్నెర్రసేత్తానటే భాచా."

"అమ్మగోరు కొత్తసీర ఇచ్చినారుమావా చూడు ఎంత పెద్దపువ్వులో కళ్ళుజిగేలుమంటున్నయ్యి ఈ సీర నాకు బాగుండదామావా."

"నీకతే బంగరూ పాతికోక సుట్టుకున్నా ముద్దబంతి పువ్వునాగుంటావు" రెండు చేతులూ పుచ్చుకుని దగిరికి తీసుకోబోయాడు.

"ఛీ, ఛీ ఏటిది! ఏళాపాళాలేని పరాసికాలు ఇంక బువ్వతానొద్దేటి చీటికలో వుడుకునీళ్ళెట్టుతాను తానంచేద్దువుగానీ," అంటూ రంగడి చేతుల్ని విడిపించుకుని పెరట్లోకి పారిపోయింది బంగారు.

గిన్నెలో అన్నం పెట్టిదగ్గిర కూర్చుని కొసిరి కొసిరి పెడ్తూ, అమ్మగోరు మామంచివోరు లేమావారు ఎన్ని పిండొంటలు పెట్టినారో నాదూ ఎంతపనిసేసినా కష్టవుంచుకోని చల్లని చెయ్యి తల్లి వెయ్యికాలాలు వర్ధిల్లాల! ఇదిగో ఇడ్డోలుకూడా పెట్టినారు. ఇంకొకటి తినుమావా బ్రతిమాలి కడుపునిండా తినిపించింది. ఆ గిన్నెలోనే తనూ పెట్టుకుని గబగబాతిని, ఇల్లంతా చిమ్మియినాసది వేసి, నులకమంచంమీద వుతికినబట్ట పరిచి, బుడ్డిదీపం తగ్గించి పక్కజేరింది. "మావా నే వోమాట అంటాను కోపంసేయవుగందా!" అన్నది బంగారు "నీమీద కోపమేటే బంగారూ సెప్పు సెప్పు" అన్నాడు.

"మావా మన మనువయ్యాక ఇది నాలుగో సంకురేతిగదా ఒక్క పాలన్నా మా అయ్య తీసుకెళ్ళి ఇంత గుడ్డముక్క ఇచ్చిన పాపాన పోనేదుగందా! నన్ను సేసుకుని నీకేటిసుఖం మావా నీజతిగాళ్ళంతా పెళ్ళాలతో కులుకుతా అత్తోరింటకెళ్ళితే కా అనుటం సెగు మా అయ్యేటి గతిమాలినోడయిపోయిండు." కళ్ళనీళ్ళు పెట్టుకున్నది బంగారు.

"ఛీపాయే ఏటిది పండగపూటా ఏడుస్తారుటే వూరుకో యేమీ అయ్య పెట్టకపోతే మన రెక్కలు నల్లగుండాల కష్టపడి సంపాదించుకుని తినాల. ఏటికోవాడు మీ అయ్య ఇంత బువ్వెట్టి ఓ గుడ్డపాత ఇస్తే

మన బతుకులు వెల్లమాగుతయ్యిలే పిచ్చి దానా వూరుకో వూరుకో. నాకు లేని దిగులు నీకెందుకే. బజ్జిరంవాటి పిల్లనిచ్చినాడు చాలదటే" రంగడు వోదార్చాడు.

"అది కాదు మావా ఒక్క పాలన్నా అందరం ఒకసోటజేరి పండగ సేసుకుంటే ఎంత సంతోసం వుంటాది చెప్పు. తోడ బుట్టోడన్నా లేసికెళ్లి ఇంత పసుపుకుంకుమ బెట్టకపోతే నాకు మనేదిగుంటదేటి"

"పోనియ్యి, నీకంత మనసుగుంటే కష్టపడి ఎట్టాగో నాలుగు డబ్బులు కూడబెట్టి వచ్చే సంకురేతిరికి మీ అయ్యని అమ్మని ఇక్కడికే పిల్సుకొచ్చి పండగ సేసుకుందాము లేయే, ఇంతమాత్రానికే ఇదయిపోతారులే. నీకు కళ్లంట నీళ్లొస్తే నామనసంతా ఎటాగో వుంటాది. నా బంగారానివి కొదు, వూరుకోయే." బుజ్జగించి దగ్గిరిగా తీసుకున్నాడు. నా మావ ఎంత మంచోడు నా అదుష్టం కొద్దీదొరికాడు. సుక్కల్లో సెందురు నాటివోడు నా మావ అని అమాయకమైన పరవశంతో కండలు తిరిగిన అతని బలమైన చేతుల్లో గువ్వపిటలాగా వొరిగిపోయింది బంగారు. ఏరోజు కూలీ ఆరోజు సంపాదించుకుంటూ పొట్టనింపుకుని వున్నంతలో సంతృప్తిపడి హాయిగా జీవితాన్ని గడిపే ఆ అమాయక హృదయాల్లో ఎంత పండు వెన్నెల. పాలలాటి స్వచ్ఛమయిన మనస్సులు వారివి. అయితే బాహ్యానికి అటువంటివారు అజ్ఞానులూ, అనాగరీకులూనూ.

* * *

అనునాతనంగా పెంచబడిన పూదోటలో రమణీయమైన మూడంతస్తుల మేడ. ఆ మేడలో రెండో అంతస్థులో విశాలమైన గది. విలువైన ఫర్నిచర్‌తోనూ, కిటికీలకీ గుమ్మాలకీ సిల్కు తెరలతోనూ శోభాయమానంగా అలంకరించబడివున్నది గది. పూల కుండీలో అప్పుడే తెచ్చి అమర్చిన గులాబీలూ, సంపెంగలూ గదంతా పరిమళాన్ని వెదజల్లుతున్నయ్యి. పెద్దపందిరిమంచంమీద పాలమీగడలాటి పక్కపరిచి అక్కడక్కడా జాజిపూలు చల్లబడివున్నయ్యి. పాలరాతి గచ్చునేలమీద విలువైన తివాసీ అడుగుపెట్టే నలిగిపోతుందా అన్నంత మృదువుగా వున్నది. గోడలమీద రాధా మాధవ లాస్యం శివపార్వతుల నృత్యభంగిమ చిత్రాలు ఒకపక్కన, ఉషోదయం, సంధ్యారాగం మొదలయిన ప్రకృతి చిత్రాలు ఒకవైపు వ్రేలాడతీసివున్నయి. ఇంత చక్కగా అలంకరించిన గదిలో నలుమూలలా సిగిరెట్టు పీకలు పడివుండటం కొంత జుగుప్సాకరంగా వుండకమానదు. కానీ సిగరెట్టు కాల్చటం, అవి నలుమూలలా విరజిమ్మకోటం నాగరికతా లక్షణం అనుకునేవారికిమాత్రం అది కూడా అందంగానే కనపడొచ్చు. రేడియో మెల్లిగా సరళసంగీతాన్ని ఆలపిస్తోంది. ఇంత చక్కని వాతావరణం శేఖర్‌ని ఏమీ ఆహ్లాదపరుచుటలేదు. పైపెచ్చు మహా విసుగ్గా పచార్లుచేస్తూ మాటిమాటికీ గుమ్మంవంక చూస్తున్నాడు. గడియారం బరువుగా తొమ్మిదిసార్లు మ్రోగింది. చేతిలో సిగిరెట్టు విసురుగా మూలకి గిరవాటుచేసి సోఫాలో కూలబడి గట్టిగా నిట్టూర్చాడు. కాలం అతి మందంగా కదులుతున్నట్లు చికాకు పడసాగాడు. ఒకింతసేపటికి మెల్లిగా పట్టు పరదా ఒత్తిగించుకుని, పాలగ్లాసు, తాంబూలపళ్లెం చేతపట్టుకు అడుగులో అడుగు వేసుకుంటూవచ్చింది శారద. శారద నిజంగా అపరశారదాదేవే. చదువుల సరస్వతి, అందాలరాణి ప్రత్యేకించి ఆ రోజు చేసుకున్న పండగ అలంకరణ మరింత ముగ్ధమోహనంగా వున్నది. విశ్వకర్మ ప్రత్యేకమైన శ్రద్ధతో అందాలనన్నిటినీ ఒకచోట పోగుపోసి మలిచిన పాలరాతి విగ్రహంలాగా కనబడుతుంది ఆమె లావణ్యం. అయితేనేం ఆమె అందాన్ని చూసి ఆనందించే పరిస్థితిలో లేడు శేఖర్. అంతంలేని మంకుపట్టుదలతో అతన్ని మనస్సు శిలారూపం వహించింది. ఆమెని చూడనట్లు మొఖం అటు తిప్పుకున్నాడు. శారద మెల్లిగా అతని దగ్గరగా కుర్చీలాక్కుని కూర్చుని పండి, పళ్లెంలోని తమలపాకులు సున్నంరాసి చిలకలు చుట్టి అతనినోటికి అందించింది.

## ఎస్. ఎస్. ప్రసూన

"ఊ...ఇప్పటికి తీరుబాటు అయిందన్నమాట రాణీగారికి" విసురుగా ఆమె చేతిని తోసేశాడు.

"తొమ్మిదేగదండీ! ఏదో వదినావాళ్లు కబుర్లు చెప్పుతుంటే ఆలస్యమయింది." నసిగింది శారద.

"అదే నే చెప్పేదిన్నీ. పుట్టింటికి వస్తే ఆడవాళ్ళకి వొళ్ళూపైతెలీదు. ఈ వెధవొక్కడు ఈ గదిలో పడి ఏడుస్తున్నాడు అనైనా జ్ఞానంలేదు."

"పోనిండి ఇకనుంచి ఆలస్యం చెయ్యను. ఏదో పొరపాటైంది. ఈ ఆకులు వేసుకోండి"

"నాకేం అక్కర్లేదు. ఆకులకోసం వాచికూచోలేదు"

శారద మాట్లాడలేదు. కాస్సేపటికి తలెత్తి అక్కడే బల్లమీద మడత విప్పకుండా వున్న టె[illegible]సూటు చూసి

"ఏమండీ మా నాన్న మనసుపడి ఇది మీకు ఎంతో బాగుంటుందని తెచ్చేరు ఒక్కసారి వేసుకుంటే సంతోషించేవారు. పోనీ ఇప్పుడైనా వేసుకోండి"

"మహా చెప్పొచ్చావులే నేను కట్టుకోవాలనీ ఆయన సంతోషించాలనీ అనుకుంటే నన్నింత అవమానంపాలు చేసేవారేగాదు"

"అవమానం ఏమిటండీ అందరూ మిమ్మల్ని నెత్తిమీద పెట్టుకుని గౌరవిస్తుంటే"

"అవునవును ఇదంతా గౌరవించటమే మరి ఏమీ తెలియని వెధవనంగనాచి కబుర్లు నువ్వూను."

"ఏమిటండీ అసలు. ఎందుకింత కోపం మీ మనస్సులో వున్నదేమో చెప్పరాదూ"

"ఇంకా చెప్పేదేమిటే మొద్దూ. మూడేళ్లగా వాయిదా వేస్తున్నారా? పోనీ ఇప్పుడయినా మీ మాట నిలబెట్టుకుంటారేమో అనుకున్నాను. ఛీ, ఛీ. మాటనిలకడలేని అమర్యాదస్తు లనుకోలేదు."

ఏమిటండీ మీ రనేదేమిటో అర్థం కావటంలేదు. మనస్సులో ఉన్నదేమిటో చెప్పండి.

"ఏమిటింకా చెప్పేది. నీకు తెలియదా ఏం? పదిసార్లు నాచేత వాగించాలనీగానీ, మన పెళ్లినాడు మీ నాన్న చేసిన వాగ్దానం నువ్వు మర్చిపోయినా నేను మర్చిపోలేదులే. వెధవ్వేషాలు వెయ్యక ఇప్పుడయినా ఇస్తానన్నది ఇవ్వమను."

"ఓ అదా! ఇంకా ఏమిటో అనుకున్నాను. చేతిలో డబ్బుఆడి చూచుకుని ఇస్తారు. మోటారు సైకిలంటే మాటలతో వస్తుందా ఏమన్నానా! కాస్త మీరూ పరిస్థితులు అర్థంచేసుకోవాలి మరి."

"ఆఁ. ఇస్తాడు ఇవ్వడూమరి, అప్పుడైతే 'ఇస్తానులేవోయ్' అని ఒక్కమాటంటే తీరిపోతుం దనుకున్నాడు. ఇప్పుడేమో డబ్బు ఖర్చుపెట్టొచ్చేసరికి పీకపట్టుకుంటోంది."

"అన్నీ తెలిసినవారు మీరే ఇట్లా అంటే ఏమి చెప్పేది. మా నాన్న సంగతి మీకు తెలీదుగానీ, ప్రాణం పోయినాసరే అన్నమాట నిలబెట్టుకునే మనిషి."

"తెలుస్తూనే వుంది మీ నాన్న నిజాయితీ. మూడేళ్లనుంచీ వాయిదా వేస్తున్నారు. పోనీ ఇప్పుడైనా ఇస్తారేమో అనుకుంటే ఓ సూటు మోహానపారేసి పొమ్మంటున్నాడు. అంత గతిలేనివాళ్లు పండక్కి రమ్మని ఎందుకు పిలవాలి. ఏమయినా ఈసారి మోటారు సైకిలు ఇవ్వాల్సిందే."

"మీరట్లా అంటే ఏం చెప్పను. అసలే వ్యాపారంలో దెబ్బతిని సగంప్రాణంతో వున్నారు. దానికితోడు ఈ ఏడు చెల్లాయి పెళ్ళొకటి చెయ్యాలనుకుంటున్నారు. దానికే డబ్బు సమకూడక సతమతమయిపోతున్నారు. ఇదే అదననీ అనుకొని మీరున్నూ ఇల్లా వత్తిడి చేస్తే ఎల్లా చెప్పండి కాస్త దయతలచి ఇప్పటికి వూరుకోండి". ప్రాధేయపడింది శారద.

"అదే నేనున్నూ అనేది. ఇప్పుడే ఇల్లా వున్నదా! ఇహ కొత్తల్లుడుగాయనస్తే నా

# రెండు దృశ్యాలు

మొహం చూసేవాళ్ళు కూడా వుండరు. అందులోనూ నేను వఠీ బి. ఏ గాణ్ణయ్యె. ఆ వచ్చే దొరగారేమో పి. హెచ్. డి గాండయ్యె ఇంకేం ఆయనగారొక సీమదొర నేను ఆయనదగ్గరవఠీ ప్యూనుగాణ్ణి అన్నట్టు చూస్తారు. మీ సంగతిఇప్పుడే తెలుస్తోంది."

"మీరంత ఇదిగా మాట్లాడితే నేనేమి చెయ్యను ఇటు మీకొ చెప్పలేను అటు వాళ్ళకీ చెప్పలేను. మధ్య నా కొచ్చింది తిప్పలు మూడేళ్ళుగా ఒకటే రభస" కళ్ళనీళ్ళు పెట్టుకున్నది శారద.

"ఎందుకు నాదగ్గిర ఏడుస్తావు అదేమిటో మీ నాన్న దగ్గిరే వచ్చి చెప్పుకో."

"ఏమండీ ఈసారికి ఊరుకోండి నాన్న పరిస్థితి చూస్తే అడగటానికి నోరు రావటం లేదు. ఈ మాత్రం దయతలచండి."

"దయ మాపట్టే ఇన్నాళ్ళుగా ఆగింది. నీ నాన్నని చూస్తే అడగలేవు. ఆ బుంగ మొహం బుర్రమీసాలు చూసేసరికి బెదిరి పారిపోతావ్. ఈ బక్క వెధవ దగ్గిరే నీ ఆటలన్నీ సాగుతున్నయ్యి అనుకుంటున్నావేమో. మర్యాదగా ఇస్తారా ఇవ్వమనను లేదా పర్యవసానం బాగా రుచిమాద్దువుగానీ" మొండిగా అన్నాడు.

"మీరేమన్నా చెయ్యండి నేను మా నాన్నను అడగలేను కావాలంటే మీరే అడగండి"

"హూ...అడగవుగా! ఇదిగో శారదా చెప్తున్నాను విను. మీ నాన్నే మాటవిలవైతు తనేవాడనుకుంటున్నావేమో. నేనే అంత చాతగాన్ని వాణ్ణిగాను. మర్యాదగా వూరుకున్నా వాళ్ళు లొంగిరారు. ఒక్కటే మాట చెప్తున్నాను ఆలోచించుకో. రేపు నువ్వు నాతో రాదల్చుకుంటావా మోటారు సైకలయినా లేక దానికి సరిపోయే డబ్బైనా తీసుకురావాలి. లేదా అది వచ్చేంతవరకూ నీకుకూడా మాకుమ్మంలో కొక్క అర్హత లేదు. ఇంక పోయిక్కణ్ణుంచి"

"అదేమిటండీ నాన్నగారే ఇస్తానన్నది ఇవ్వకపోతే వాళ్ళమీద కోపం చూపించాలి గానీ నా మీదేమిటండీ నేనేమైనా మీకు లోపం చేసున్నానా నన్ను నలుగుర్లో నగుబాటుపాలు చెయ్యకండీ"

"నీ వెధవ బుడి బుడి దీర్ఘాలు నా దగ్గర పనికిరావు. నీ కన్నీళ్ళు చూసి కరిగిపోతాననుకున్నావేమో అసలు ఏడ్చేవాళ్ళని చూస్తే వొళ్ళుమంట. నా దగ్గరైతే ఏడవగలవ్ మళ్ళీ మీ నాన్నని అడగలేవు. పదారేళ్ళు పెంచి ఎవడికో అంటగట్టి చేతులు దులిపేసుకునే నాన్నమీద ఎక్కడలేని జాలీను, జన్మంతా బరువుభారాన్ని మోసేవాడిమీద చిన్నసుంత గౌరవమున్నా లేకపోవటమూను...

"ఛీ ఛీ మీ ఆడవాళ్లే అంత కట్టి కృతఘ్నులు - ఫో ఇక్కణ్ణుంచి చెప్పేది నీక్కాదూ"

"అలా అనొద్దండీ ఈ సారికి మన్నించండీ"

"మన్నించబట్టే నెత్తిన పెట్టుకున్నాను. చేసిన చేతుల్తోనే ఎగుర్కొట్టే వాళ్లు మీలాంటి వాళ్లకి అదేముంది. ఇంక నీ దారి నీది నాదారి నాదీని"

"ఏమైనా నేను ఇక్కణ్ణుంచి కదలను"

"కదలవుగా!" చెంప ఛెళ్ళుమన్నది చిదిమితే పాలుగారే చెక్కిళ్ళేమో ఒక్క దెబ్బకి బుసబుస పొంగిపోయింది అయినా కిక్కురు మనకుండా అతడి పాదాలు గట్టిగా పట్టుకుని...

"మీరేమైనా చెయ్యండి ఏరోజు మీ చేతిలో పెట్టారో అప్పుడే మీ సొత్తయిపోయాను. ఇప్పుడు మీరు కాదంటే పోతుందా. నేను మీ పాదాలు విడిచి ఎక్కడికీ వెళ్లను"

శేఖర్ కి వెర్రికోపం వచ్చింది ఆమె జడ పట్టుకుని జరజరా లాక్కువచ్చి గది అవతలకి తోసేసి తలుపేసుకున్నాడు.

శారద తండ్రి కలప వ్యాపారస్థుడు. వ్యాపారంలో బాగానే గడించి మంచి స్థితిలోనే వుండేవాడు. శారద పెండ్లిలో అల్లుడు శేఖర్ మోటారుసైకిలు కావాలని అడిగేడు. అప్పట్లో ఆయనకి అదో లెక్కలోది కాకపోయింది. "అంతే కావాలంటే రేపు పట్నం వెళ్ళి మంచిది చూసి కొందాములే" అన్నారు. కానీ అనుకోకుండా పరిస్థితులు తారుమారై పోయింది. వ్యాపారంలో పెద్దగా నష్టపోయి నిలువునా మునిగిపోయాడు. కొంత కూడదీసుకుని అయినా చిక్కుక అల్లుని కోర్కెను తీర్చాలనుకున్నాడు. కానీ ఎంత ప్రయత్నించినా వీలు కాకనే పోయింది. వాయిదాల మీద వాయిదాలు వేస్తూ మూడేళ్ళు జరిగిపోయినయ్యి. కాని అల్లుడికోర్కె తీర్చలేక పోయానే అని ఆయన అనుక్షణం బాధపడుతూనే వున్నాడు. కానీ శేఖర్ మామగారి పరిస్థితిని ఎంతమాత్రం అర్థం చేసుకోలేదు. తన కోరికలు తీరటమే ప్రధానంగానీ, అందుకోసం ఇతర్లు ఎంత కష్టపడ్డా ఏమైపోయినా తనకి కాదనుకునే వాళ్ళల్లో శేఖర్ ప్రథముడు. అందుకనే ఈ సారి ఇంత మొండి పట్టుదలలోకి దిగేడు. శారద మాత్రం ఏమి చేస్తుంది? కన్న తండ్రినీ అడగలేదు—చేసుకున్న మొగుడికీ నచ్చచెప్పలేక మనస్సు నలిగిపోయింది. గది అవతల శారద భర్తని ఎన్నివిధాలుగానో ప్రతిమాలుకుని ఏడ్చింది. కానీ ఆ కఠినుడి మనస్సు కరుగలేదు. తలుపు తియ్యలేదు. ఇక తల్లిదగ్గిరికి వెళ్ళి అమ్మా అంటూ తల్లి ఒళ్ళో వాలిపోయింది. ఆ తల్లి మాత్రం ఏమి చెయ్యగలదు? కూతుర్ని దగ్గిరగా పొదువుకుని "ఆడవాళ్ళ తల్లీ. అనురాగాల్నీ అవమానాల్నీ అన్నిట్నీ ఒకవిధంగా స్వీకరించాలమ్మా. అల్లా అయితేనే స్త్రీ క్షమాస్వరూపిణి అన్న పేరు సార్థకమవుతుంది. ఊరుకోమ్మా. నాన్నగారితో చెప్పామంటే తలతాకట్టుపెట్టి ఎక్కడినా తెస్తారు. మీకోసమే కాదుటమ్మా మా బ్రతుకులు. మీరు సుఖంగావుంటే చాలు- మేము ఏమైపోయినా ఫరవాలేదు." అని ఎంతో ఓదార్చింది అమ్మ. ఆ రాత్రల్లా అమ్మ ప్రక్కలోనే గడిపింది శారద. గదిలో అగరు ధూపాలు గూడుకట్టి ఆరిపోయినయ్యి. వెండిగాసులో పాలు ఏ రాత్రివేళో విరిగిపోయింది. శేఖర్ కి భార్యమీద కొంత కూడా జాలి కలగలేదు. అల్లాగే కాలుజాపి మరింతగా దగ్గిరికి తీసుకుని పడుకున్నాడు. రమణీయమయిన భవంతుల్లో పట్టు పరుపుల మీద శయనించే వారి మనస్సుల్లో ఎంత కటిక చీకటి. వారి హృదయాల్లోనే కాకుండా వారి చుట్టూవున్న పరిసరాన్ని కూడా కలుషితం చేస్తారు వీరు. అయినా నేం అటువంటి వారే బాహ్యాడంబరాన్ని బట్టి ఘరానావ్యక్తులుగా గౌరవాన్ని పొందుతారు. ఇదే నాగరికతలోని రహస్యం కాబోలు. ★



బొంబాయి, క్రాస్ మైదాన్‌లో ఏర్పాటుఅయిన రేడియో, అండ్ ఎలక్ట్రానిక్స్ ఎగ్జిబిషన్‌కు కేంద్రమంత్రి డా॥ కేస్కర్ మొన్న ప్రారంభోత్సవం జరిపారు. ఆ ప్రదర్శనంలో డా॥ కేస్కర్, జనరల్ రేడియో అండ్ అప్లయెన్సెస్ (ప్రైవేట్ లిమిటెడ్) వారి విభాగాన్ని సందర్శిస్తున్నపుడు తీసిన చిత్రం. డా॥ కేస్కర్ ప్రక్కనున్నవారు నేషనల్ ఎకో రేడియో కంపెనీ డైరెక్టరు శ్రీ హెచ్. వి. మేజర్, వెనుకనున్నవారు జనరల్ రేడియో కంపెనీ డైరెక్టరు శ్రీ వై. ఎ. ఫజల్‌భాయ్.




## ఆదిపర్వము - షష్ఠాశ్వాసము

సీ. ఇప్పాండుపుత్త్రుల నేలొకో ధృతరాష్ట్రుఁ, డేకత మనమున నిచ్చగించె
నిది యధర్మం బని యెఱిఁగి గాంగేయుండు, నేల వారింపఁడో యెఱుఁగరాకొ-
పితృపితామహులచే భృతపూర్వమై క్రమా, గతమైన రాజ్యంబు గరము నెమ్మిఁ
బాండుసుతజ్యేష్ఠు భరతకులశ్రేష్ఠు, ధర్మజుఁ బూన్పక ధర్మ ముడిపి

ఆ. యేల వృద్ధరాజు లెడ సేసిరో పార్థ నరులు నెడకు మనము నరిగి యతని
యున్నచోన ప్రీతి నుండుద మిం దుండ, నేల యనుచుఁ బౌరు లెల్లఁ దెరలి.

వ. తనపిఱుంద వచ్చువారిం బ్రియపూర్వకంబున నూరార్చి పితృవచనంబు సేయ కునికి ధర్మవిరుద్ధంబు గావున వారణావతంబునకుం బోయి వచ్చెద మని యందఱం గ్రమ్మఱించి చను చున్న ధర్మనందను పిఱుంద నొక్కింత నేల యరిగి విదురుం డొరులు వినియును నెఱుంగరాని వచనంబుల బహుప్రకార వచనరచనా విశారదుండైన యుధిష్ఠిరున కెల్లకార్యంబులు గఱపి కొడుకులం గౌఁగలించుకొని కుంతిదేవికి మ్రొక్కి పాండురాజుం దలంచి బాష్పపూరితనయనుం డై క్రమ్మఱి చనియె నిట కుంతియు ధర్మరాజు డాయ వచ్చి యిట్లనియె.

తే. విదురుఁ డేతెంచి యొరులకు వినియు నెఱుఁగ, గానియట్లుండఁ బలికినఁ గఱపె బుద్ధి
నట్లుచేయుదు నంటి వీ వతనిమతము, సెప్పనగునేని యెఱుఁగఁగఁ జెప్పుమయ్య.

వ. అనిన నగుచు ధర్మతనయుండు విదురువచనంబుల యభిప్రాయంబులు దల్లి కిట్లని చెప్పె.

ఆ. ఎల్ల కార్యగతులు నెఱుఁగుదు రయినను, నెఱుఁగఁ జెప్పవలయు నెఱిఁగినంత
పనియు లేక మిమ్ము బాపినకురుపతి, హితుఁడపోలె మీఁద నెగ్గు సేయు.

వ. కావున మీర లేమఱక విషాగ్నులవలన నప్రమాదులరై బుద్ధిగలిగియుండునది యని కఱపి మఱియు దుర్యోధను చేసెడుదుష్క్రియ లిమ్ముగా నెఱింగి వానికిం బ్రతీకారంబు సెప్పి పుత్తెంచెద ననియె నని చెప్పినవిని విదురబుద్ధికిఁ దయవలని నెయ్యంబునకు సంతసిల్లుచుఁ బాండవులు కతిపయ ప్రయాణంబుల వారణావతంబున కరుగునంత.

### పాండవులు జననీసహితంబుగా వారణావతంబుఁ జేరుట

సీ. వారణావతమున వారెల్లఁ బాండవా, గమనంబు విని సంత సమునఁ బెరిఁగి
కర మొప్పఁ గరిరథ తురగబలాఢ్యులై, యెదురువచ్చిరి మహా ముదముతోడఁ
గలయంగ గృహములఁ గలువడములు గడు, విలసిల్లె నంబర తలము గప్పి
మలయజమృగమదా విలసలిలంబుల, నిమ్ముగా నార్ద్రీకృతమ్ములయిన

తే. యంగుళుల నొప్పెఁ గర్పూర రంగవల్లు, లంగనలు గయిసేసియు త్తుంగహర్మ్య
తలము లెక్కిరి తత్పురీ విలసనంబుఁ, జూచు పాండుకుమారులఁ జూచువేడ్క.

వ. పాండుకుమారులు ననేక భూసురాశీర్వాదనాదాభినందితులై ఫాల్గునమాసంబున శుక్లపక్షమున నష్టమియు రోహిణి నాఁడు వారణావతంబు సొచ్చి సర్వాలంకార సుందరంబైన రాజమందిరంబున నున్న కొన్ని దినంబులకుం బురోచనుండు దనచేసినచతుశ్శాలి సకల జననయనాభిరామంబైన దానిం జూపినం జూచి పాండుసుతులు సంతసిల్లి పురోచన శిల్పాచార్యులం బూజించి పుణ్యాహరవపురస్సరంగా గృహప్రవేశంబు సేసి రంతం బరాభిప్రాయమాయోపాయ ప్రయోగవిదుం డైన ధర్మతనయుండు దానికృత్రిమ రమణీయతను లక్షించి యల్లన భీమునకిట్లనియె.

క. ఈ గృహకుడ్యంబులు లా, క్షాగర్భము లాజ్యతైల గంధులు మఱి శ
స్త్రాగారనివాసము మా, కీ గృహ మగు నిది యవశ్య మాగ్నేయం బై.

క. దీని నెఱుఁ గెఱిఁగినట్లు మ, హానిపుణుఁడు విదురుఁ డురువిషాగ్నులవలనన్
మానుగ నేమఱకుం డని, తాను ప్రబోధించె నేకతమ ననుఁ బ్రీతిన్.

వ. కావున మన మిందు విశ్వసించి యుండ వలవ దగ్నిభయం బగు నవిన విని భీముం డిట్లనియె.

ఆ. ఇట్టిదైన మనకు నిం దుండఁగా నేల, యరిగి ముంద ఱున్న యంద యుండి
యెఱిఁగి దీనితోన యిప్పురోచనుఁ గాల్చి, పోద మనిన ధర్మపుత్త్రుఁ డనియె.

క. ఎఱిఁగితిమి దీని నెఱిఁ గే, మఱి కొఱఁగనియట్లు గూఢమతి నుండుద మిం
దఱముఁ బురోచనుకృతకము, నెఱి నేర్పడునంతకును వినీతాత్ములమై.

వ. ఇప్పాపగృహ ప్రకారంబు మన మెఱుంగుట పురోచనుం డెఱింగిన దుర్యోధను నియోగంబు విఫలంబు గాకుండ శీఘ్రకారియై దీని దహించిన నక్కడ భీష్మ విదురాదులు విని కోపించినం గురుకులసముద్రక్షోభంబగు మఱిదాహభయంబున మన మొండుగడకుం బోయిన నెఱింగి మనయంతరంబ రోయుచున్న దురాత్ముండు దుర్యోధనుండు మన కపాయంబు సేయు నెట్లనిన,

సీ. రాజ్యపదస్థుం డ రాజ్యపదస్థులఁ, బక్షబలాఢ్యుఁ డ పక్షబలుల
విపులార్థవంతుఁడు విగతార్థసార్థుల, నవసరం బెఱిఁగి వాఁ డక్రమమున న
దూష్యులఁ దుదిజాఁక దూషించు మనల న, స్నిగ్ధురునకు నది నీతి గాదె
కావున నొరు లెఱుంగక యుండఁ గడునమ్ర, నట్టుల యుండుద మని దినంబు

తే. లెల్ల వేఁట లాడుచు రాత్రు లెల్ల నుద్య, తాయ తాయుధహస్తులై యనుదినంబు
నప్పురోచను వంచించి యనఘు లుండి, రప్రమాదులై పాండవు లప్పురమున.

## లా క్షా గృ హ ద హ న ము

వ. అట హస్తిపురంబున విదురుండు దుర్యోధనుదుర్మంత్రం బంతయు నిమ్ముగా నెఱింగి కడువిశ్వాసి నొక్క ఖనకు నతికుశలుం బాండవులపాలికిం బుత్తెంచినవాఁడును వచ్చి రహస్యంబునం బాండవులం గని తన్ను నమ్మునట్లుగా విదురు సాభిజ్ఞానవచనంబు లెఱింగించి యీకృష్ణచతుర్దశినాఁటిరాత్రి పురోచనుండు లక్కయింట దహనంబు దరికొల్పుం గావున నిందుండి మీకు వెలువడిపోవునట్టి యుపాయంబు మారాజునియోగంబునం జేయవచ్చితినని చెప్పి లక్కయిల్లు వెలువడునట్లుగా నొక్క బిలంబు నెవ్వరు నెఱుంగకుండం జేసి వారల కెఱింగించిన భీముండు దాని నిమ్ముగా శోధించి యెఱింగి యుండునంత.

క. ధనదానములను బ్రియభో, జనదానములను విశిష్ట సద్ద్విజతతులం
దనుపుచు నుండఁగఁ దత్పుర, మునషణ్మాసములు భరతముఖ్యుల కరిగెన్.

వ. ఆ కృష్ణచతుర్దశినాఁడు కుంతిదేవి పురంబునం గల బ్రాహ్మణపుణ్యాంగనల కెల్ల విశిష్టాన్నదానంబులం దుష్టిసేసి దేవపూజ గావించియున్నెడం బురోచనుపంపిన నిషాదవనిత సపుత్త్రియై బహువిధవన్యమూలఫలంబులు దెచ్చి యిచ్చుచుం గుంతీదేవిం బాయక సేవించి పాండవకృత్యంబులు నిత్యంబును నెఱింగించుచుండెడునది నాఁటిరాత్రియుత్సవంబున గాలచోదితయై తానునుం దనయేవురుగొడుకులు నధికమధుపానమదంబున మెయి యెఱుంగక లక్కయింటిపక్కంబున నిద్రవోయిన నర్ధరాత్రంబునప్పుడు భీముండు మేల్కాని పురోచనుకంటె ముందఱ దానయుత్సహించి వాని శయనగృహద్వారంబున హుతాశనంబు దరికొలిపి చెచ్చెరఁ దల్లిని నన్నను దమ్ములను బిలంబులోనికనిచి యాయుధాగారంబుతోడన లాక్షాగారంబు హుతాశనున కశనంబు సేసి ఖనకునకుం దమకుశలగమనం బెఱింగించి బిలప్రవిష్టుఁడయి కుంతిని ధర్మార్జున నకుల సహదేవులను బిలంబు వెలువరించి తోడ్కొని చనునప్పుడు

సీ. కడునిద్రఁ గానక తొడరుచు బడిగొని, నడవంగ నేరక తడయుచున్న
నెఱిఁగి చెచ్చెరఁ దల్లి నఱకడ నిడి ధర్మ, సుతవిజయులఁ దన వితతబాహు
యమళంబు నెక్కించి యములనుత్సంగంబు, లెక్కించుకొని భీముఁ డక్కజముగ
బఱిగెదుర్గమములఁ దరులు వ్రాల్పడి మ్రొగ్గఁ, బదఘట్టనంబులఁ జదిసి తూలు

ఆ. సుఱుముగాఁగ నిట్లు నెఱయంగ సత్త్వంబు, మెఱసి దాటి రెల్ల నుఱక పవన
తనయుఁ డరిగెఁ బవలు ననినట్లు చీఁకటి, యనక ముండ్లుగండ్లు ననక తెరలి.

వ. ఇట వారణావతంబున.

అయింది—పండ్లు తోముకొన్నాను.

సాయంత్రమే 'నూరో' కన్పించాడు. 'ఏరా బాబూ...అలాంటి ఘటాన్ని నాకు తగిలించావేరా ?" అన్నాను.

"ఏం చెయ్యనురా నాకర్మకాలి, సుందరం, మూడు నెలల క్రితం పరిచయ మయ్యాడు. అంతే ఆనాటినుండి, నాకిప్పటివరకు, రెండు డజనుల వార్నింగు లొచ్చాయి. ఆఫీసులో సరిగా పనిచేయటం లేదని. అడపాతడపా యింట్లో శ్రీమతీ చివాట్లు వేస్తోంది—అందుకే, నీకు తగిలించాను—" అన్నాడు. ఆనాటినుండి సుందరం నాకు తప్పిపోకుండా, ప్రొద్దున, సాయంత్రం, రాత్రి కలుసుకొంటూనే వున్నాడు. నోటికొచ్చినట్లు ప్రతివిషయంమీద, నానుండి, యెలాంటి సమాధానం లేకపోయినా మాట్లాడుతూనే వున్నాడు. క్రొత్తలో మంచి మర్యాద అన్నట్లు వూగుకోవలసి వచ్చేది. తర్వాత, తర్వాత కొద్దిగావిసుగు, అయిష్టత, చూపించేవాణ్ణి – సుందరం మరికొంత వుత్సాహం చూపించటం మొదలెట్టాడు. సుందరాన్ని తప్పించుకోటం నాచేత కాని పనిగా తయారయింది. నేను నిద్రలేవక పూర్వమే వచ్చేవాడు...స్నానం చేస్తున్నా, భోజనం చేస్తున్నా ఏవో చెపుతూనే వుంటేవాడు...

చివరకు సుందరం నాకొక సమస్య అయి పోయాడు.

సుందరాన్ని తప్పించుకోవాలని ప్రయత్నం చేశాను. రాత్రి వంటయింటిలో పండుకొని లేనని చెప్పించాను అమ్మచేత.

—'అలాగా అర్ధరాత్రికి అర్ధరాత్రికి వూరికెళ్లాడా ? పిన్నిగారూ! అసలే, అమావాస్య చీకటి, యెలాపోనిచ్చారండీ...అయినా, ట్రెయిన్‌లోగా ఫరవాలేదు... ఏం పరవాలేదులెండి, యీమధ్య రైళ్ళు మహాదారుణంగా పడిపోతున్నాయి. ఇది యెవరితప్పని అంటాం చెప్పండి...ఎవరిదీ కాదు...వచ్చిన వాళ్లకర్మ. కర్మంటే చెపుతా పిన్నిగారు, మనది కర్మభూమి అని శ్రీకృష్ణభగవానులు, అర్జునితో గీతలో అన్నాడు—అర్జునుడంటే సామాన్యుడా ! మహారథి...కాని, కర్మయోగాన్ని గురించి విని, తనో నిమిత్తమాత్రుణ్ణి అని గ్రహించగలాడు...' అంటూ అమ్మదగ్గర 12 గంటలవరకు వుపన్యసించి వెళ్ళిపోయాడు— ఆనాడు వంటయింటిలో క్రుగ్గిపోయాను. అమ్మ 12 గంటలకు పొయ్యి యెక్కించింది యెసరు—

సుందరం పరిచయమైన మూడు నెల్లలో మామూడు రోజులైనా టైముకు ఆఫీసుకు అనేదే అనుమానం.

గట్టిగా ఆలోచించాను. ఓ పదిరోజుల పాటు ఎక్కడికన్నా వెళ్ళిపోతే సుందరం మరెవ్వరితోనైనా పరిచయ మేర్పరచుకొంటాడు' అనిపించింది.



ప్రేమైక మూర్తులు

చిత్రం : వీరిశెట్టి అచ్యుతరావు.

రాజమండ్రి వెళ్ళిపోయాను.

* * *

రాజమండ్రిలో పదిరోజులు ప్రశాంతంగా గడచిపోయాయి. మళ్లీ గుంటూరంటే భయంవేసింది. కాని తప్పందికాదు గుంటూరు.

గుంటూరు వచ్చాక రెండు నెలలు సుందరం కన్పించలేదు. నాకాశ్చర్యమేసింది.

ఒకనాడు తొందర పనిమీద బ్రాడీపేట వెళ్ళుతున్నాండగా సుందరం కన్పించాడు వాళ్లింటి ముందర. రమ్మని ఆహ్వానించాడు. తెలిసి తెలిసి పెద్దపులి గుహలోనికి వెళ్లేవాడిలా వెళ్ళాను. సుందరం కాఫీ ఇచ్చి, అతిక్లుప్తంగా మాట్లాడి అడిగిందే తడవుగా వెళ్ళమని అనుమతి యిచ్చాడు. "మంచి బాలుడు రాము" అనే పద్ధతిలో కన్పించిన సుందరాన్ని చూచేసరికి నాకు ముచ్చటేసింది. గేటువరకు సాగనంపటానికి వచ్చినపుడు ఉండబట్టలేక 'ఏం సుందరం! మితభాషివి అయ్యావు?" అన్నాను.

"నాకీమధ్య పెళ్ళి అయింది. మా ఆవిడ కాపరానికొచ్చింది..." అంటూ నంగిగా నక్కచచ్చి మాట్లాడుతున్న సుందరం 'ఎక్కడికి?' అనే ప్రశ్నలాంటి భీకర, భీభత్స ధ్వనితో గిర్రున వెనక్కి తిరిగి గృహప్రవేశం జరిపాడు.

"లోకాస్సమస్తా—స్సుఖినోభవంతు—" అనే వాక్యాలు నా నోటినుండి అప్రయత్నంగా వెలువడ్డాయి. ★



# ముక్తాని

## వి.ఎస్. అవధాని

జీవితమే ఓ పెద్ద పరీక్ష. ఇక కళాశాలల్లో పరీక్షలసంగతి అంత పట్టించుకోవలసిన అవసరమేమిటి అనుకున్నాడు రామారావు. సెప్టెంబరులో కూడా ఇంటర్ తప్పినందుకు దిగులు లేదని కాదు. కావలసినంత దిగులు ఉన్నది. కానీ, కేవలం దిగులువల్ల ప్రయోజనం ఏమిటి? పరీక్షలయి ఉత్తీర్ణులు కావాలంటే చదవాలి; బాగా చదవాలి. చదివింది బుర్రకు ఎక్కాలి. బుర్రకు ఎక్కినది పరీక్షలలో అవసరం వచ్చినప్పుడు గుర్తుకు రావాలి. కానీ, రామారావుకు ఈ సౌకర్యాలేమీ లేవు. మొదటిసంగతి, నాకు లెక్కలు రావు మొర్రో అంటే గుమాస్తా సుబ్బయ్యగారు నాలుగు తిట్టి లెక్కలగ్రూపే తీసుకోమన్నాడు. ఎంత యత్నించినా ఆ లెక్కలు రావు రామారావుకు. రెండో సంగతి. ఇంటిపనులలో రామారావు కొన్ని చెయ్యాలి. సుబ్బయ్యగారు ఇంటిసంగతి పట్టించుకోడు. బజారుకెళ్ళి, ఇంట్లోకి కావలసినవి తీసుకురావడం, ఇంట్లో వాళ్ళల్లో ఎవరికి జబ్బుచేసినా ఆసుపత్రికి తీసుకువెళ్ళి మందు ఇప్పించటం వంటివన్నీ రామారావు చేయవలసిన పనులలో కొన్ని మాత్రమే.

ఏమైతేనేం మొత్తంమీద ఈ సారి కూడా రామారావు ఇంటర్ పరీక్షలో నెగ్గకపోవడం ఇంట్లో అందరికీ కష్టంగానే ఉన్నది. కాఫీ కావాలా నాయనా అని అడగలేదు అమ్మ. 'రిజల్టు' వచ్చినయిటగా అన్నది రెండో చెల్లెలు. బుల్లన్నయ్య ఈ సారికూడా 'ఫేల్' అన్నది కడసారి చెల్లెలు. నాలుగోవాడూ అయిదోవాడూ నవ్వారు. ఇదంతా మామూలు సంగతే. కానీ, రామారావుకు ఇదంతా ఎందుకో ఇవాళ్ళ ప్రత్యేకంగా బాధ కలిగించింది. ఒక్కొక్క మనిషి జీవితంలో ఇటువంటివి చాలా జరుగుతూంటయ్. రోజూ మామూలుగా జరిగే సంగతే. ఒకరోజు ఎందుకనో వింతగా కనిపిస్తుంది. లేదా కొత్తగా బాధ కలిగిస్తుంది. వాటివల్ల ఆ మనిషి జీవితమే పూర్తిగా మారుతుంది. రామారావు జీవితంలో కూడా ఇప్పుడు సరిగ్గా అదే జరిగింది. నిరాదరణ, అవహేళన భరించలేక రామారావు ఇంట్లోనుంచి బయలుదేరాడు. సెప్టెంబరులోనైనా నెగ్గాంకదా అని సంతోషిస్తున్న స్నేహితులు అనేకమంది కనిపించారు. అన్నయ్యలిద్దరూ ఊళ్ళోనే ఉన్నారు. వేరే ఉంటున్నారు. ఇద్దరూ పెద్ద పెద్ద ఉద్యోగాలలోనే ఉన్నారు. కానీ, ఈ ఇంటిసంగతి పట్టించుకోరు. నాన్నతో తగాదా పడి వేరె వెళ్ళారు. అయితే అంత మాత్రాన అసలు ఇక్కడికి రానే రారని కాదు. పండుగలకూ పబ్బాలకూ వస్తూంటారు. తన చదువు సంగతి వాళ్ళకు పట్టదు. వాళ్ళ ఇంటికి వెళితే కొంత సానుభూతి దొరుకుతుంది. అందులోనూ పెద్ద వదిన చాలా మంచిది. ఓర్పుగలది. [illegible] చక్కగా ఓదార్చుతుంది.

అయినా పరీక్ష తప్పి వదిన దగ్గరికి వెళ్ళడం ఏమిటి? ఎందుకు వెళ్ళాలి? ఆమె తనకు ఏ విధంగా సహాయపడగలదూ? పైగా చులకన అయిపోతాడు. ఎవరి దగ్గరికీ వెళ్ళకుండా, కనిపించిన వాళ్ళందరితోనూ క్లుప్తంగా "ఆ అవును... కాదు" అంటూ సాయంకాలందాకా గడిపాడు. పొద్దుటినుంచీ అన్నం తినలేదు. ఆకలవుతోంది. కాఫీతాగ రామన్నా చిల్లికానీ అయినా లేదు. చిల్లి నయాపైసలు ఇంకా రాలేదుగదా!

సాయంకాలమైంది. ఆకలి ఎక్కువవుతోంది. బాగా అలసిపోయినాడు. అయినా ఇంటికి వెళ్ళాలనిపించలేదు రామారావుకు. దారిద్ర్యం...దారిద్ర్యంలో వాత్సల్యాలూ ప్రేమలూ, అనురాగాలకు చోటు లేదు. నెలకు వందరూపాయలు వస్తయ్ గుమాస్తా సుబ్బయ్యగారికి. ఆ వంద రూపాయలూ ఏ మూలకూ? మొదటి తేదీ తెచ్చిన బియ్యం ఇరవై రోజులకే అయిపోతయ్ ఒక్కొక్కసారి. కూరగాయలకు డబ్బులు వుండవు ఒక్కొక్కసారి. పాలవాడి బాకీ తీరదు ఒక్కొక్కసారి. ఇంట్లో సత్యాగ్రహాలు జరుగుతయ్. రెండు మూడు రోజులలో ఎక్కడినుంచో అప్పు తెస్తాడు. దానితో కొంత సద్దు మణుగుతుంది. ఇటువంటి పరిస్థితులలో తన చదువు నాన్నకు బరువుగా వుండడం తనకు అర్థం కాని సంగతి కాదు. పెద్ద వాళ్ళిద్దరికీ సంసారాలు ఉన్నయ్. వాళ్ళకూ పిల్లలు ఉన్నారు. మరి వాళ్ళ గొడవ వాళ్ళది. నాన్నకూ అన్నయ్యలకూ తగాదా వచ్చింది. నెలనెలా ఇంకా ఎక్కువ డబ్బు ఇవ్వాలని నాన్న [illegible]

వాళ్ళు ఇద్దరు...ఇద్దరేరు. అమ్మకూ వదినెలకు తగాదా. అతిగాదా అనేక రకాలు ఏమైతే నేం వాళ్ళిద్దరూ వేరే ఉంటున్నారు వాళ్ళ కష్ట సుఖాలకు వాళ్ళే బాధ్యులు. ఒకరికి వాళ్లు బరువు కారు. తనే నాన్నకు బరువు. పాపం నాన్న ఎంత యాతన పడుతున్నాడూ? ఏదో కొంచెం పొలం ఉండబట్టి అట్లాట్లా లాక్కొ వస్తున్నాడు. ఛీ! ఛీ! ఏమి బతుకు? ఎట్లయినా నాన్నకు సహాయపడాలి. ఏదీ...ఈ ఇంటర్ నెగ్గితే...ఏం నెగ్గడం? ఎన్ని సార్లు కూర్చున్నా ఆ గ్రూప్ లో నెగ్గడం లేదు. ఆలోచిస్తూ నల్లకట్ట చెరువుమీద అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు రామారావు. పచార్లుచేస్తే ఆకలి తగ్గదు. ఆకలి అవుతుంటే ఏదన్నా తినాలి. ఏదన్నా. తినాలంటే ఇంటికి వెళ్లాలి. ఇంటికి ఎట్లా వెళ్లగలడూ? నాన్నకు ఎట్లా మొఖం చూపించగలడూ? ఇంటర్ లో తప్పిన సంగతి తెలిసి ఆయన ఎంత బాధపడుతున్నాడో? ఆయనకు ఎంత కోపం వచ్చిందో?

"అబ్బాయిగారూ..."

రామారావుకు మాటలు వినిపించడం లేదు. ఏదో ఆలోచన. ఏదో దిగులు. ఎవరిమీదనో కోపం. అదేదో ఆవేశం...ఉద్రేకం...మతి లేని స్థితి.

అబ్బాయిగారూ..."

"ఖాజా...ఇట్లా వచ్చావేం."

"ఈ వీధిగా మా ఇల్లు."

"ఇక్కడా మీ ఇల్లు. ఈ వీధిగా ఏమిటి – ఇక్కడేగా అనలేవూ? అలా మాట్లాడొద్దని ఎన్ని సార్లు చెప్పానూ?"

"దాందేముందిలేండి. అట్టాగే అంటా. ఇక్కడే మా ఇల్లు. ఇక్కడ తిరుగుతున్నారే? ఇంట్లో అందరూ మీకోసం వెతుకుతుంటారు."

తనకోసం అందరూ వెదుకుతున్నారు. ఎందుకూ? తనను ఎగతాళి చెయ్యడానికా? అట్బే తన చావు తనను చావనివ్వరు.

"మా ఇంటికి పోదాం రండి."

"పద" అన్నాడు రామారావు ఆలోచించకుండా.

ఖాజాబీబీ ముఖం అంతయింది. గబగబా దోవ తీసింది. దిగులుగా రామారావు ఆమె వెంట నడుస్తున్నాడు. పొద్దు కుంకింది. ఒక అరుగుల ఇంటిముందు ఆగింది ఖాజాబీబీ. దానిచేతిలో రెండు పెద్దపెద్దపొట్లాలు ఉన్న సంగతి అంతవరకూ రామారావు గమనించలేదు. ఒకటి గమనించాడు కనుకనా? అటువంటి సమయంలో ఒంటరిగా అసలు ఖాజాబీబి వెంట దాని ఇంటికి వెళ్లడం ఏమిటి? ఖాజా బీబీ తమయింట్లో పనిచేసే పిల్ల. మరి దాని ఇల్లు తాము అద్దెకు ఉంటున్న ఇంటికంటేకూడా బావుంది. పెద్ద పెంకుటిల్లు. తలుపు తాళంతీసి 'రాండి అబ్బాయిగారూ' అన్నది ఖాజా బీబీ.

రామారావు కొంచెం తటపటాయించాడు. వెళ్లితే ఏమీ? వెళ్లకపోతే ఏమీ. ఖాజా తనకంటే నాలుగేళ్ళు చిన్నది. చిన్నప్పటినుంచీ దానితో పరిచయం ఉన్నది. ఖాజాబీబి తల్లికూడా రామారావుకు తెలుసు. ఖరీజా కూడా తమ ఇంట్లో చాలా యేళ్ళు పనిచేసింది. అమ్మకు పురుళ్ళు పోసింది. తనను ఎత్తుకొని, అమ్మదగ్గర పాలు లేకపోతే పాలుకూడా ఇచ్చిందట.

"రాండి అబ్బాయిగారూ ఫరవాలేదు. రాండి" అన్నది ఖాజా. రామారావు అడుగులో అడుగు వేసుకొంటూ లోపలికి వెళ్ళాడు. మూడు గదులు ముచ్చటగా ఉన్నయ్. ఇల్లంతా చూపించింది ఖాజా బీబీ. రెండు గదులలో రెండు హరికెన్ లాంతర్లు, ఓ గదిలో పెద్ద పందిరి మంచం.



ఈ ఖాజాబీబీ తమ ఇంట్లో పని చెయ్యడం ఏమిటీ అనుకున్నాడు రామారావు.

ఓపట్టి మందం వాల్చింది హాలులో ఖాజా బీబీ. "కూర్చోండి అబ్బాయిగారూ. మంచి నీళ్ళు తెస్తా" అని రామారావుకేసి చూచింది. రామారావు ఖాజాబీబీ ఎడమ చెయ్యి పట్టుకున్నాడు.

ఖాజాబీబీ చెయ్యివిదిలించుకొని ఇంట్లోకి పారిపోయింది. రామారావుకు భయం వేసింది. ఇదేం పనీ? ఖాజా ఎవరూ? తను ఎవరూ? ఈ సంగతి నాన్నకు తెలిస్తే ఇంకా యేమన్నా ఉన్నదా? ఇవాళ్ళ పొద్దున లేచినప్పుడు ఎవరిముఖం చూచాడో? తప్పకుండా రేపు అమ్మకు చెబుతుంది ఖాజా. అమ్మకు ఖాజా అన్ని సంగతులూ చెబుతుంది......

అంతలో స్టెయిన్‌లెస్ స్టీల్ పళ్ళెంలో పకోడీలూ, తెల్లటి గ్లాసులో మంచినీళ్ళతో గులాబీరంగు వాయల్ జాకెటూ ఎర్రటి లంగా వేసుకుని, ఖాజా వచ్చింది. రామారావు అదే పనిగా ఖాజావంక చూస్తున్నాడు. ఖాజా రామారావువంక చూడడం లేదు. విదియనాటి చంద్రునికేసి చూస్తోంది. రామారావుకు ఏదో చెప్పాలని అనిపించింది. కానీ, నోట్లోమాట నోట్లోనే ఉన్నది. గొంతులో ఏదో అడ్డం పడ్డట్టు ఉన్నది.

"తినండి అబ్బాయిగారూ. తినండి." అన్నది మెల్లిగా ఖాజా. ఆ మాటలలో ఏదో బాధ? ఏదో ఆవేదన?—ఏదో రహస్యం దాగింది—

ఖాజా నవ్వుతోంది. భయం లేనుకొని రామారావు పకోడీలు తినడం మొదలు పెట్టాడు.

"పరీక్ష తప్పారని దిగులుపడితే ఎట్లా అబ్బాయిగారూ. దిగులుపడితేపడ్డారు తిండి లేకుండా ఊరెంట తిరుగుతే ఎట్లా? అన్నది లాలనగా.

"మగువ మనసులోని మర్మమేమిటయా మగుడ మగువమనసులోని మర్మమేమిటయా? రేడియో పాడుతోంది. ఆపాటతో ఓతియ్యటిగొంతు కలుపుతోంది.

"ఆపాట ఎక్కడినుంచీ?" అన్నాడు రామారావు.

"ఎక్కడినుంచి అయితే మీ కెందుకూ? మీసంగతి మీరు చూచుకోండి. ఇంకా కాసిని పకోడీలు తీసుకురానా?"

"వద్దు. మరి నీకో?"

"నాకెందుకూ. హాయిగా నేను రెండు పొగ్గు అన్నం తిన్నాను, మళ్ళీ ఇప్పుడు అన్నం వండుకుంటాను."

"మరి నేనే ఏమీ చెయ్యలేనంటావ్."

"చేతనైతే చెయ్యరాదూ? దిగులుపడడం దేనికీ? ఇంట్లో అమ్మమీదా నాన్నమీదా అలగడం దేనికీ?"

"ఓహో...కోయిలా" మళ్ళీ పాట ఈ సారి రేడియో కాదు. ఎవరో పాడుతున్నారు తియ్యగా.

"ఆపాటేది ఎవరూ?"

"అదే మీకు అనవసరం అని చెప్పానా? మళ్ళీ అడుగుతారేం?" అంది ఆదిలక్ష్మి. ఆదిలక్ష్మి అంటే ఈవూళ్లో చాలామంది కొంపలను ఆర్పిన శ్రీదేవి కూతురు."

'అట్లాగా.'

'అట్లాగాలేదు. గిట్లాగాలేదు. ఇకతమర్ని ఇంటిదగ్గర దించివస్తా పదండి."

'ఏం... నేను పోలేనా?'

"పోగలిగితే ఎందుకని ఇట్లా పొద్దుటి నుంచీ ఊరెంట తిరిగారూ."

"ఊరికినే తిరిగాను. ఏమీతోచక తిరిగానూ. అయినా ఇవంతా నీకెందుకూ?"

"ఎందుకా మీరు చెడిపోకుండావుండేందుకు సరేనా."

"అంటే నువ్వు నన్ను బాగుచేస్తావా?"

"చేతనైనంత వరకూ బాగుచేస్తాను. అయినా మన పిచ్చి! ఎవరిని ఎవరు బాగు చెయ్యగలరూ? మా నాన్న యుద్ధంలో చస్తే మాకు డబ్బు వచ్చింది. మాకు డబ్బు వచ్చింది గదా అని సంతోషిస్తూంటే కలరాతో మా అమ్మ చచ్చింది. నేను మిగిలాను. నా సంగతి మీకు తెలుసుగా? ఈ ఇల్లు మాది. నా దగ్గర డబ్బు ఉన్నది. మీకు ఆ సంగతి కూడా తెలుసు. మీకు చాలాసార్లు నేను డబ్బు ఇచ్చాను బళ్ళో. జ్ఞాపకం లేదేమో? అమ్మ ఇవ్వమన్నదనీ, అన్నయ్య ఇవ్వమన్నాడనీ చెప్పి ఇచ్చాను. మరి నన్ను నేను బాగు బాగుచేసుకోవాలి..."

"ఖాజా..." అంటూ రామారావు లేచాడు. ఖాజా రెండడుగులు వెనక్కి వేసింది.

"ఖాజా..."

"అంత తొందర పనికిరాదు. ఉద్యోగం సంపాదించండి. నేను మీ..."

'ఖాజా..."

"అందరూ చదువుకునే ఉద్యోగం సంపాదించరు. ఉద్యోగం చేసిన వాళ్ళందరూ డబ్బు సంపాదించలేరు. మా నాన్న ఏం చదువుకున్నాడూ. అయినా మాకు కూడూ గుడ్డలకు తక్కువకాకుండా చేసివెళ్ళలేదా?"

"మరి కూడూ గుడ్డా ఉన్నదానివిమ ఇంట్లో..."

"అది వేరేసంగతి. మీ ఇల్లు వదలిపెట్ట వద్దని మా నాన్న మాట. మా అమ్మ కూడా ఆ దేమాట చెప్పింది చచ్చేప్పుడు."

"................."

"అట్లా చూస్తారేం? అట్లా చూడకండి. అట్లా ఆడవాళ్ళ వంక చూడడం తప్పు."

"అయితే ఇక్కడికెందుకు తీసుకొచ్చావ్ నన్ను?"

"ఇంకా ఎటూ పోకుండా—దోవ తప్పకుండా చేద్దామని తీసుకొచ్చాను. పదండి. ఇంటికి పంపించి వస్తాను."

"నేను వెళ్ళగలను."

"సరే అయితే...ఇదిగో ఇది మీ దగ్గర అట్టిపెట్టుకోండి.

అదేమిటీ? పదిరూపాయల కాగితం. ఆశ్చర్యంగా, దిగులుగా భయం భయంగా రామారావు ఇంటికి బయలుదేరాడు ఇదేం మనిషి. ఖాజా ఇకంపిల్ల. తనకంటే చిన్నది. తనకు తెలియని సంగతులు చాలా తెలుసు దానికి అనుకొంటు ఓ రిక్షాలో ఇంటికి చేరాడు రామారావు. నాన్న కోపాగ్నికి ఆహుతి కావడానికి సిద్ధపడ్డా.

హాలులో రౌండు టేబుల్ సమావేశం జరుగుతోంది. రామారావు భవితవ్యమే చర్చనీయాంశం. ఇక చదువు సంగతి కట్టిపెట్టి ఉద్యోగ యత్నం చెయ్యాలని అమ్మ ప్రతిపాదన. ఉద్యోగం చెయ్యడమే మంచిదైతే "అల్లూరామ్-సుధారామ్" కంపెనీలో తాను చూపించిన ఉద్యోగంలో చేరడం మంచిదని నాన్న సలహా.

రామారావు రావడం చూచి "రారా రామూ రా ఎక్కడికెళ్ళావ్" అన్నారు నాన్న.

పీకుకు పడుతుందని రామారావు అనుకున్నదానికి వ్యతిరేకంగా జరగబోతుంది. నాన్న కోపంగాలేదు. నాన్నను చూస్తే భయం వెయ్యడం లేదు.

"ఎక్కడికెళ్ళావ్‌రా పొద్దుటినుంచీ" అన్నది అమ్మ.

"అది సరేగానీ, ఇక నువ్వు ఉద్యోగంలో చేరితే బాగుంటుందని అమ్మ అంటోంది" అన్నాడు చిన్నన్నయ్య.

"వదినా వాళ్ళు ఖులాసాగా ఉన్నారా? పాపను తీసుకురాలేదేం" అన్నాడు రామారావు.

"మాచావా! వాడు వట్టి మొద్దు.

# ★ ముక్తాని ★

ఉద్యోగం చేసేది చాలా పెద్దకొట్టు. చాలా ఊళ్లల్లో దానికి బ్రాంచీలు కూడా ఉన్నాయ్. రోజూ వేలాది రూపాయల వ్యాపారం జరుగుతూంటుంది. అందులో ఇది హెడ్డాఫీసు కావడంవల్ల పాతికమంది గుమస్తాలు ఉన్నారు. యజమానులు ఇద్దరు అల్లూరామ్, సుఖారామ్. సుఖారామ్ ఎప్పుడూ పర్యటనలో ఉంటాడు. అల్లూరామ్ రోజూ పొద్దున పది గంటలకు వచ్చి మధ్యాహ్నం మూడింటికల్లా ఇంటికి వెళ్తాడు, ఆయన ఇంటికి వెళ్ళేదాకా గుమాస్తాలందరూ చాలా జాగ్రత్తగా పని చేస్తారు. ఆ తరువాత సంగతి...అది అన్ని పెద్ద సంస్థలలో మామూలుగానే ఉంటుంది. ఆ వాతావరణంలో రామారావు చాలా మంచి వాడని అనిపించుకొంటున్నాడు. అందుకనే రెండు సంవత్సరాలలోనే నూటయాభై అయింది జీతం. నాన్నకు నెల నెలా వంద రూపాయలు పోయిగా ఇస్తున్నాడు. యాభై రూపాయలు తను ఖర్చు పెట్టు కుంటున్నాడు. తన ఖర్చు అంటే...పెద్దన్నయ్య పిల్లలకోసం నెలనెలా ఇరవై ఖర్చు పెడ్తాడు. చిన్నయ్య పిల్లలకోసం పది పదిహేను ఖర్చు పెడ్తాడు. మిగతాది తన కాఫీ ఖర్చు.

జీతం పెరిగిందని నాన్నకు తెలిసి సంతోషించాడు. మొనటి రేది సాయంకాలం

"జీతం పెరిగిందిట్రా" అన్నాడు నాన్న

"అవును నాన్నా"

"మరి ఈ నెల కూడా వంద రూపాయలే ఇచ్చావేం?"

"నా ఖర్చులు"

"నీ ఖర్చులా...యాభై దేనికి?"

"కాఫీ...గుడ్డలూ..."

"అయినా అంత ఖర్చు అనవసరం. వచ్చే నెల నుంచీ నూట పాతికైనా...ధరలు ఎట్లా ఉన్నయో చూస్తున్నావ్ గా, అమ్మకు ఆపరేషన్ చేయించాలంటున్నారు మరి..."




రామారావు ఏమీ మాట్లాడలేక పోయినాడు. దొడ్లో అంట్లు తోముతున్న ఖాజాబీబికి కూడా ఈ మాటలు వినిపించినయ్ సరిగ్గా ఈ సంగతే తను చెపితే రామారావు వినలేదు'

అదృష్టం కలిసి వచ్చినప్పుడే మనిషి తన తెలివితేటలనూ శక్తిసామర్థ్యాలనూ వినియోగించాలి. అదృష్టం అనేది అనేక రూపాలలో ఉంటుంది. రామారావుకు చాలా సంబంధాలు వస్తున్నాయ్. నాలుగువేల దాకా కట్నం ఇస్తాం అంటున్నారు. ఏదో ఒక సంబంధం సరే అంటే బాగుంటుందని అమ్మగోల. నాన్న ఆలోచన ఇంకో రకంగా ఉన్నది. పెళ్ళిచేస్తే రామారావు ఏమిటో...ఏమి చెప్పగలం? ఏ పుట్టలో ఏ పాము ఉన్నదో. వాని పెండ్లిచేస్తే నాలుగువేలవస్తయ్, ఒక ఆడపిల్లకైనా తానుకూడా పెండ్లి చెయ్యవచ్చు. కానీ రామారావుదే చిక్కు. అసలు ఆ మాటే చెవినపడనివ్వడు. పైగా "చెరొకరుగా ఇద్దరికే చాలు" ఇక ఊరుకోండి. ఆడపిల్లల సంగతి ముందు చూడండి." అంటాడు.

నోట్లో నాలుక ఉన్నదా లేదా, అనిపించే రామారావు ఇప్పుడు ఇట్లా తయారు కావడం సుబ్బయ్యగారికే కాదు ఖాజాబీబీకి కూడా ఆశ్చర్యంగానే ఉన్నది. సుబ్బయ్యగారికి బాధ. ఖాజాబీబీకి సంతోషము. ఆ అమాయకురాలు ఏమేమిటో ఊహించుకొంటోంది. అమధ్య హనుమాయమ్మగారికి కోపంవచ్చి ఖాజాబీబీని గడప తొక్కవద్దన్నది. ఖాజా విలవిలా కూలిపోయింది ఏడ్చింది. కానీ, ఆమూడురోజులూ అటు వెళ్ళలేదు. ఆ మూడురోజులూ మూడుయుగాలని అనిపించింది ఖాజాకు. రామారావును చూడలేదని కాదు. రామారావే వచ్చాడు. అది కానేకాదు. ఈ విశాల ప్రపంచంలో, ఈ లోకాలలో ఖాజాబీబికి గుమాస్తా సుబ్బయ్యగారి ఇల్లు పెద్ద ఆశ్రయం. అక్కడ ఉంటే దానికి ఇక ఏ కూ చింతా వుండదు. తనను ఎవరూ కన్నెత్తి చూడరు. లేకపోతే.....అందులోనూ ఆదిలక్ష్మి ఇంటి పక్కన తన ఇల్లు.

"పోనీ ఈ ఇలు అమ్మరాదూ" అన్నాడు రామారావు ఓ సారి.

"నేను చచ్చినా అది మాత్రం జరగదు. ఇది మా అమ్మ మాట." అన్నది ఖాజా.

"మరి అంత భయపడ్తావెందుకూ?"

"మీ స్నేహితుడు రంగారావును అడగండి"

"నా స్నేహితుడు రంగారావా? ఏ రంగారావూ?"

"సిల్కు లాల్చీలు వేసి, సైకిలు మీద షికార్లు..."

(64-వ పేజీ చూడండి)

# నక్షత్ర ఫలితాలు

[18-3-59 మొదలు 24-3-59 వరకు]

గ్రహస్థితి.

| | | | |
|---|---|---|---|
| ర బు శ | శు | కు | |
| | మిథున, కర్కాటక, సింహ కన్యలలో చంద్రుడు | | |
| కే | గు | | రా |

## * అశ్వని [చూ, చే, చో, లా] *

ఈ వారము లౌకిక వ్యాపార రంగములో మీకు చాలా జయప్రదముగా వుంటుంది. ఆదాయము ఎక్కువ అవుతుంది. నీటిమీద ప్రయాణము చేయవలసి వుంటుంది. కవితా గోష్ఠి, గానసభలు మున్నగు వినోదములలో బంధుమిత్రులతో కలిసి శుభకార్యముల లోనూ పాల్గొని మృష్టాన్న భోజనము చేస్తారు. విద్యార్థులకు మేలుకాలము. బియ్యం, వెండి, నూలు, బట్టల వ్యాపారస్థులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. వారమంతా శుభయోగములతో కూడివున్నా మానసికాందోళన కలుగుతూ వుంటుంది.

## * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము మీకు ఇష్ట కార్యసిద్ధి, ధన ధాన్య వృద్ధి వివాహ శుభ కార్యములలో పాల్గొనుట, యత్న కార్యానుకూలత, పరోపకారమువల్ల కీర్తి, వాహనయోగము వంటి రాజయోగములు కలుగుతాయి. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. విలువగల వస్తువుల క్రయ విక్రయములలో వర్తకులగల రెట్టింపు లాభము కవులకు గాయకులకు కళాకారులకు నటీనటులకు యోగకాలము.

## * కృత్తిక [అ, ఈ, ఉ, ఏ] *

ఈ వారము మీకు కార్యభారము ఎక్కువ. రాబడి తక్కువ. గృహోపకరణములు తిరకకలతలు అకాల భోజనమువల్ల ఆరోగ్యము చెడుచున్న సూచనలు కనబడగానే ఔషధ చికిత్స పొందడమే కాకుండా, గ్రహశాంతైన రవికి శాంతి చేయించుట మేలు. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు వర్తకులకు ఆందోళన విద్యార్థులకు చదువు సరిగా సాగదు, రాజకీయ వాదులకు అశాంతి 19 కార్యభారము, త్రిప్పట 21,22, 28 పితృవర్గ సహాయము, ధనలాభము ప్రయాణము 24 అనారోగ్య సూచన.

## * రోహిణి [ఓ, వా, వీ, వూ] *

ఈ వారము మీకు మిశ్రమయోగము మొదట్లో నిరాశగా వున్నా మిత్రసహాయము వల్ల కార్యలాభము పొందుతారు. ధనలోపమువల్ల ఆందోళన. ఉద్యోగస్థులకు ఏమంత బాగుండదు. విద్యార్థులకు బద్ధకమువల్ల చదువు బాగా సాగదు. ఆప్తుల ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. వారములో అవయోగములున్నా మిత్రసహాయము, కార్యసిద్ధి, విదేశీయుల పరిచయము, విచిత్ర వస్తువుల

బి. నరసింగరావు

సంపాదనవంటి మంచి యోగాలుకూడా వుంటాయి.

## * మృగశిర [వే, వో, కా, కీ] *

ఈ వారము మీరు సహాయము పొందదలచుకున్న వ్యక్తి మూలముగా కార్యహాని పొందుతారు. ధనాభావముకూడా ఎక్కువ. ఇంట్లో వారి ఆరోగ్యము సరిగా వుండనందున చింత కలుగుతుంది. అయినా ఆధ్యాత్మిక భావము కలవారగుటచేతను దైవముపై భారము వేసి కార్యలాభమును పొందుతారు. ఉద్యోగస్తులకు ఒత్తిడి. వర్తకులకు నిరాశ. విద్యార్థులకు మంచిరోజులు కావు. పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము, విచిత్రములను చూచుట, నష్టద్రవ్యలాభము కలుగును. వారమంతా అవయోగ శుభయోగ మిశ్రమముగా వుంటుంది.

## * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈ వారము మీకు అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. ప్రయత్నించిన కార్యములు ఎక్కువ శ్రమతో ఫలిస్తాయి. కోర్టు దావాలు అనుకూలిస్తవి. ఇతరులకు చేయదలచుకున్న సహాయము చేయలేక పోవుటచేతను నిందలు పొందుతారు. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ, తోటివారి సహకారము కలుగుతాయి. వర్తకులకు వారమంతా నిరాశగావున్నా వారాంతమున మేలు పొందుతారు. విద్యార్థులకు చదువు బాగా సాగదు. 24 న భార్యకు అనారోగ్యము కలుగుటచే ఆందోళన.

## * పునర్వసు [కే. కో. హా. హీ] *

ఈ వారము ఎన్ని ఆటంకములు వచ్చినా పట్టు విడవకుండా ప్రయత్నించి కార్యలాభము పొందుతారు. అనుకున్న సొమ్ము సమయానికి రాక అప్పు చేస్తారు. దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. రసాయనిక శాస్త్రజ్ఞులకు, లోహ, ఖనిజ వ్యాపారస్థులకు కష్టముతో కూడిన లాభము. గనుల యజమానులకు, యంత్రములు నడుపు నిపుణులకు, ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు మేలుకాలము. 24 న ప్రమాద సూచన.

## * పుష్యమి [హూ. హే. హో. డా.] *

గత రెండు వారములనుండి కలుగుచుండిన కష్టములు గడచి, అధికారుల సహాయముచేతను, మీ నేర్పరితనముచేతను కార్యసిద్ధిని పొందుతారు. ఆర్థికస్థితి బాగుపడుతుంది. వారమంతా యోగప్రదముగా వుంటుంది. ప్రయాణము, అధికారుల ఆదరణ, బంధు సహాయము కలుగుతవి. విద్యార్థులకు మేలుగా వుంటుంది. డాక్టర్లకు, గణితశాస్త్రజ్ఞులకు, కవులకు, చిత్రకారులకు, శిల్పులకు, నటీనటులకు యోగకాలము. 19 న అధిక ఖర్చులు.

## * ఆశ్రేష [డీ. డూ. డే. డో] *

ఈ వారము అన్ని ఇబ్బందులు తీరుతవి. అనుకున్న సొమ్ము చేతికి వస్తుంది. కోర్టు దావాలు అనుకూలముగా తీర్పు అవుతవి. పిల్లల మేలుకొరకు కొన్ని యేర్పాట్లు చేస్తారు. నూతన కార్యారంభము చేస్తారు. ప్రభుత్వ సన్మానము కలుగుతుంది. పండితులతో శాస్త్రగోష్ఠి జరిపి జ్ఞానము వృద్ధిచేసుకుంటారు. విద్యార్థులు శ్రద్ధతో కొత్త విషయాలు నేర్చుకుంటారు. వారమంతా యోగదాయకము. 24 న ఆందోళన కలుగుతుంది. ఇంట్లోవారి ఆరోగ్యము బాగుపడుతుంది. పండితులకు, ఉపాధ్యాయులకు, న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగస్థులకు మేలుకాలము.

## * మఖ [మా మీ మూ మే] *

ఈ వారము మీకు యోగదాయకమైననూ మానసికాందోళన కలుగుతుంది. నీటిమీద ప్రయాణము చేస్తారు. బంధుమిత్రులతో కలిసి కవితాగోష్ఠి, గానసభలవంటి వినోదాలలో పాల్గొంటారు. దూరమందున్న ఆప్తుల క్షేమ

#  నక్షత్ర ఫలితాలు 

వార్త తెలిసి సంతోషము పొందుతారు. నూలు, బట్టలు, బియ్యము, వెండి వ్యాపారస్థులకు వారమంతా లాభదాయకముగా వుంటుంది. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. శుభకార్యాలలో పాల్గొంటారు.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### (మో, టా, టీ, టూ)

గత వారము పూర్తికాకుండా వుండిపోయిన పనులు ఈ వారము లాభకరముగా చేయగలుగుతారు. ధనయోగము అనుకున్న దానికన్నా ఎక్కువగా కలుగుతుంది. పుణ్యకార్యాచరణలో పాల్గొంటారు. పరులకు ఉపకారము చేసి కీర్తి పొందుతారు. విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము కలుగుతుంది. ఉద్యోగస్థులకు అధికారము పెరుగుతుంది. స్త్రీలతోనూ, బంధువులతోనూ, విందు, వినోదములతో ఆనందిస్తారు. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలము.



### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### (టే, టో, పా, పీ)

ఈ వారం యత్నకార్యములకు ఆటంకములు, కార్యభారము ఎక్కువ. తీరుబడి కాని కార్యక్రమమువల్ల అకాల భోజనము చేయుటచే ఉష్ణాధిక్యము, కళ్ళమంట, కాళ్ళపీకు, కడుపు నొప్పివంటి అనారోగ్య సూచనలు కనబడగానే ఔషధ చికిత్సపొందుట మేలు. వర్తకులకు శ్రమ ఎక్కువ. ఉద్యోగస్థులకు అధికారుల ఒత్తిడిచే శెలవు పెట్టవలసి వస్తుంది. రాజకీయ వాదులకు మేలుగా వుంటుంది. పితృవర్గము నుండి సహాయముచే ధనలోపము కొంత తీరుతుంది.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము నిరాశగా వుంటుందిగాని మిత్ర సహాయమువల్ల క్రమేణా కార్యలాభము పొందుతారు. రహస్యములను కనిపెట్టుటకు ప్రభుత్వముచే నియోగించబడుతారు. ధనలోపమువల్ల ఆందోళన. ఉద్యోగస్థులకు బదిలీ అయే యోగములున్నవి. వర్తకులకు మాంద్యము. విద్యార్థులకు శ్రద్ధ తక్కువ. ప్రయాణము. విదేశీయులతో పరిచయము. వింతవస్తువుల సంపాదన, కార్యసిద్ధి కలుగుతాయి. ఇంట్లో వృద్ధుల ఆరోగ్యము చెడుటచే ఆందోళన కలుగుతుంది.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈ వారము మీరు అనుకున్నట్లు పనులు జరగవు. ధనాభావముచే ఇబ్బంది ఎక్కువ. ఏ వ్యక్తి సహాయమువల్ల పనులు చేయదలచుకున్నారో అతనే ఆటంకములను కలుగజేస్తాడు. ఆధ్యాత్మిక చింత కలవారగుటచే, ఈశ్వర కృపవల్ల కష్టములనుగడిచి కార్యసిద్ధి పొందుతారు. ఇంట్లోవారి ఆరోగ్యము ఆందోళన కలిగించుతుంది. ఉద్యోగస్థులకు ఒత్తిడి. వ్యాపారస్థులకు నిరాశ కలిగినా నష్టద్రవ్యలాభము కలుగుతుంది. సాధుసజ్జన సాంగత్యముచే ఆత్మవికాసము కలుగుతుంది.

### ధరలు:

నూలు వస్త్రములు: మార్పు లేదు.

నూనెగింజలు: సమస్థాయిలో నుండును.

ఆహారధాన్యములు: నిలబాటుగా వుండును.

బెల్లము, పంచదార: సమస్థాయిలో నుండును.

చింతపండు: మార్పు లేదు.

పప్పుదినుసులు: మందముగా వుండును

వెండి, బంగారము: స్వల్ప తేడాలో వుండును.

* * *

జన్మనక్షత్రమును బట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారివారి పేర్ల ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకోనువది. కృష్ణుడను పేరునకు మృగశిరానక్షత్రమును, [illegible]డను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలుడను పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయున్నూ చూచుకోనువది.

### * స్వాతి [రూ, రే, రో, తా]*

ఈ వారము మీకు అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. రావలసినడబ్బు చేతికందక అశాంతి. బంధువుల రాకపోకలవల్ల ఖర్చులు ఎక్కువ. కోర్టు వ్యవహారములు కొంతవరకూ అనుకూలిస్తవి. పరులకు చేయదలిచే సహాయము చేసేందుకు అవకాశము లేక మాట పడతారు. ఉద్యోగస్థులకు కొత్తసమస్యలవల్ల కార్యభారము ఎక్కువ. వర్తకులకు వ్యవహారముపట్ల పేచీలు. 24-న భార్యకు అనారోగ్యమువల్ల మనోవ్యథ. విద్యార్థులకు బద్ధకముచే చదువు బాగా సాగదు.

### * విశాఖ [తీ, తూ, తే, తో]

మీ ఆలోచనలు కార్యరూపమునకు వచ్చేందుకు కలిగే ఆటంకములకు నిరుత్సాహ పడకుండా పట్టుదలతో ప్రయత్నించి తుదకు కార్యసిద్ధి పొందుతారు. సమయానికి సొమ్ము చేతికందక అప్పు చేయవలసి వస్తుంది, కాని వారాంతమునకు తీరుస్తారు. 19 న యంత్రములవల్ల గాని, అగ్నివల్లగాని, ఎత్తయిన స్థలమునుండి పడుటవల్లగాని కలిగే గాయాలు జాగ్రత్తవల్ల తప్పవచ్చును. రసాయనిక శాస్త్రజ్ఞులకు, లోహపు సామానులు, రంగుల వ్యాపారస్థులకు, గనుల యజమానులకు కష్టముతో కూడిన యోగము. ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు, యంత్రములు నడుపు నిపుణులకు మేలుకాలము.

## అనూరాధ [నా, నీ, నూ, నే]

ఈ వారము మీకు ధనయోగము, వ్యవహారాలలో జయము. శుభకార్యాలలో పాల్గొంటారు. బంధుదర్శనము విద్యాప్రాప్తి, నూతన కార్యలాభము, ఈశాన్య దిక్కునుండి శుభవార్తతో పత్రములు వచ్చుట, జ్ఞానమార్గ ప్రసంగములు, యుక్తిగా ప్రసంగించుట, గణిత జ్యోతిషశాస్త్ర చర్చలు, సుఖభోజనమువంటి మంచి ఫలితాలు కలుగుతాయి. ప్రత్తి, దూది, నూలు, వస్త్రములు ఇత్తడి, కంచు మొదలగు సరుకుల వ్యాపారస్తులకు లాభము. కవులకు, చిత్రకారులకు, శిల్పులకు, నటీనటులకు మేలుకాల. విద్యార్థులకు చదువు సరిగా సాగుతుంది.

## *జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈ వారము శుభకార్యములలో పాల్గొనుట, పుత్రప్రాప్తి సూచనలు, ధనలాభము. భాగ్యవృద్ధి, బిరుదులు పొందుట, ప్రభుసన్మానము, ఘనకార్యాచరణ, పుణ్యకార్యములు చేయుట, పుణ్యక్షేత్ర సంచారము, వైద్య, జ్యోతిషశాస్త్ర ప్రసంగములవంటి మంచియోగములు కలుగును. విద్యార్థులకు పండితులకు, న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు మంచికాలము.

## * మూల [యే, యో, బా, బీ] *

ఈ వారము మీరు వినోదాలలో పాల్గొంటారు. బంధుమిత్రులతో కలిసి వెండిపాత్రలలో దధిక్షీర, మధురపదార్థ యుక్తసుభోజనము చేస్తారు. నీటిమీద ప్రయాణము. తలపెట్టిన కార్యములలో జయము. తెల్లని వస్తువులుకొనుటవంటి మంచియోగములు కలుగును. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, బియ్యము, వెండి, ద్రవ్యపదార్థ క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. ఈ వారము మానసికాందోళనవున్నా అలంకారప్రాప్తి. విందు వినోదము కలుగును. కవులకు, గాయకులకు, నటీనటులకు మేలుకాలము. విద్యార్థులు బాగా చదువుకుంటారు.

## *పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢా]*

ఈ వారము ధనధాన్యవృద్ధి, పశువృద్ధి కలుగును. కష్టము ఫలించును. వివాహాది శుభకార్యములలో పాల్గొనుట, ఇష్టవస్తులాభం. పరోపకారమువల్ల కీర్తి, మొదలగు రాజయోగములు కలుగును. విద్యార్థులు వినోదాల్లో పాల్గొన్నా చదువు బాగా సాగుతుంది. వర్తకులకు బంగారము నవరత్నములువంటి విలువగల వస్తువుల క్రయవిక్రయములలో లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము.

## *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారము మీకు కార్యభారము ఎక్కువ. ఆరోగ్యము సరిగా లేని సూచనలు కనపడగానే గ్రహరాజైన రవికి శాంతి చేయుట మేలు కలిగించును. ఔషధ చికిత్స కూడా పొందుట మంచిది. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు. వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు సరిగా చదువు సాగదు. పితృవర్గమునుండి-సహాయము. ప్రయాణము, కార్యలాభము కలుగుతవి. 19 న ఆరోగ్యభంగము. రాజకీయవాదులకు ఆందోళన అధిక ఖర్చులు.

## * శ్రవణము [జూ, జే, జో, ఘా]*

ఈ వారము అనుకున్న సొమ్ము సకాలములో చేతికిరాదు. కార్యాచరణకు పాలుపోని అనిశ్చితస్థితిలో వుంటారు. చేదామనుకున్న పనులకు ఆటంకములు కలిగినా వారాంతమునకు మిత్రసహాయమువల్ల కార్యలాభము కలుగుతుంది. ఉద్యోగస్తులకు వన పర్వత ప్రాంతములకు బదిలీఅయ్యే సూచనలున్నవి. ప్రయాణము, విదేశీయుల పరిచయము విచిత్రవస్తుసంపాదన, మిత్రసహాయము కలుగును. 24 న అప్తుల ఆరోగ్యము గురించి చింత విద్యార్థులకు చదువు బాగా సాగదు.

## * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈ వారము మీకు మిశ్రమయోగము. అనుకున్నట్టుగా పనులు జరగవు. కోరిన సహాయము సకాలమునకు లభించదు. అవసరములు తీరక ఆందోళన కలుగుతుంది. దైవముపై భారము వేసి కార్యసాధనకు ప్రయత్నించి ఫలము పొందుతారు. వర్తకులకు చాలాకాలమునుండి నిలిచిపోయిన బాకీలు వసూలవుతవి. వ్యర్థ ప్రసంగములవల్ల ఉద్యోగస్తులు అధికారుల ఆగ్రహమునకు లోనౌతారు. పుణ్య పురుషుల సాంగత్యము, ఆత్మవికాసము. శాంతి, పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము, నష్టద్రవ్య లాభము కలుగును. 19 వ ఇంట్లోవారి అనారోగ్యముచే చింత.

## శతభిషం [గో, సా, సీ, సూ]*

మీ ఆలోచన ప్రకారము కార్యక్రమాలు నెరవేరడానికి కొందరు అడ్డువస్తూ వుంటారు. కొన్ని సందర్భములలో అశాంతి, బంధు విరోధము వచ్చును. కోర్టు దావాలు. అనుకూలముగా తీర్పు అయినా మరికొన్ని కొత్త చిక్కులు కలుగుతవి. కొర్రలు, రాగుల వంటి అపరదినుసులు మినుములు, ఉప్పు, నువ్వులు, నూనె సంబంధమగు వస్తువులు వర్తకులకు లాభము. అన్యజాతి వారివల్ల గౌరము కలుగుతుంది. 24 న భార్యకు అనారోగ్యము, అధిక ఖర్చులు.

## * పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]

ఈ వారము ఎంత ప్రయత్నించినా అనేక ఆటంకములు కలుగుతవి. సాహసము పట్టుదలకల వారగుటచే నిరాశ చెందక ప్రయత్నించి కలిగిన చిక్కులను, విప్పుకొని మేలు పొందుతారు. సోదర సహాయము వల్ల ఒడిదుడుకులు సర్దుకుంటాయి. జాగ్రత్తగా వుండడమువల్ల అవయవములకు దెబ్బలు తగిలే ప్రమాదము తప్పవచ్చును. గనుల యజమానులకు, భూగర్భ శాస్త్రజ్ఞులకు, లోహ ఖనిజ వ్యాపారస్తులకు పోలీసు శాఖ ఉద్యోగులకు కష్టముతో కూడిన యోగము.

## *ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా]*

మీరు ధైర్యముతో వృత్తి ఉద్యోగాలలో ముందంజవేసి, హోదా ఆదాయము పెంచుకుంటారు. క్రొత్త అనుకూలతలు ఏర్పడుతుంది. మీ బుద్ధికుశలతవల ఉపద్రవాలు సాధించుతారు. మీరు వేసుకున్న పథకము ప్రకారము అన్నివిధాలా డబ్బు చేతికి అందుతుంది. మనుష్య సహాయము కూడా కలుగుతుంది. మాట పలుకుబడితో పరిస్థితులలో అనుకూలమైన మార్పులు తెచ్చుకొనగలుగుతారు. ఈశాన్యదిక్కునుండి బంధువుల కుశలవార్త తెలుస్తుంది. గణిత శాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు చిత్రకారులకు, నటీనటులకు యోగకాలము.

## * రేవతి [దే, దో, చా, చీ] *

ఈ వారము మీకు యోగప్రదము. అనుకుండా నిలిచిపోయిన కార్యములు ఈ వారము సుముఖమవుతాయి. అధికారముతో పాటు ధనాదాయముకూడా పెరుగుతుంది. బిరుదులు పొందుట, సన్మానమువంటి రాజయోగములు కలవు. పండితగోష్ఠి, నూతన గ్రంథములు చదువుటచే విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. పిల్లల మేలుకొరకు మీరు కొన్ని యేర్పాట్లు చేస్తారు. వర్తకులకు లాభయోగము. విద్యార్థులకు మేలుకాలము. న్యాయవాదులకు, న్యాయస్థాన వుద్యోగులకు, ఉపాధ్యాయులకు, పండితులకు మంచి కాలము.



# బాలసాహితి

## కావలసిన చదువు

అడవిలోన పిల్లి యొకటి
నక్కబావ వద్దకేగి
"బావగారు! క్షేమమేన?
గడ్డుదినము లొచ్చిపడియె!

ఎంత చేటు కష్టపడిన
సుంత తిండి దొరకదాయె
అడవులన్ని అంతమయ్యె
పంటభూము లెక్కువాయె."

అనుచు పలుక నక్కబావ
గర్వముప్పతిలగ తాను
చూచి చూడనట్లుగాను
పలికెనిటుల పిల్లితోడ

"రాత్రిపూట చుంచులకై
వేటాడెడి నీకుగాని,
మాకేమిటి కొదవగలదు?
సకలవిద్యలందు మేము

ఆరితేరినాము సుమ్మ
లోకమెల్ల మా విద్యల
నక్కజిత్తులనుచు పొగడ
వినలేదా యెపుడు నీవు."

అని పలికెసినంతలోన
వేటగాడు కుక్కలతో
ప్రత్యక్షంబయ్యె నచట
పిల్లికూన మెల్లగాను

ప్రాంతమున్న చెట్టునెక్కి
చావుబారి తప్పెనంచు
సంతసించునంతలోన
క్రిందనున్న నక్కబావ
ఒడలు చీల్చె జాగిలాలు
పిల్లికూన పలికెనిటుల:

"బావగారు తమ విద్యలు
చూపలేక పోయిరేల?
పాపమెన్ని విద్యలున్న
బ్రతుకుతెరువు గనెడి చదువు
నేర్వకున్న ఫలమునున్న"

 కొత్తపల్లి సుబ్రహ్మణ్యశర్మ 

# చేప-పాప

అనగా అనగా ఒక ఊళ్ళో ఒక వర్తకుడు ఉన్నాడు. అతనికి ఒక కూతురువుంది. రోజూ ఆ అమ్మాయి చెరువుకు వెళ్లి బిందెతో నీళ్లు తెస్తుంది.

ఒకరోజున ఆ అమ్మాయి బిందె నీళ్ళల్లోకి ముంచుతుండగా బిందెలోకి ఒక చిన్న చేప వచ్చింది.

ఆ చేప ఎంతో ముద్దుగావుంది. బిందెలో అటూ ఇటూ చర్ చర్ మని ఈదింది. బుడుంగున బిందె అడుగుదాకా మునిగి మళ్లీ చటుక్కున నీటిపైకి తేలింది.

ఆ చేప బుల్లితోకను కదుపుతూ ఈదుతూవుంటే ఆ అమ్మాయి ఎంతో మురిసిపోయింది.

"ఈ బుల్లి చేప ఎంచక్కానో వుంది...దీన్ని పెంచుకుని దీనితో ఆడుకుంటాను" అని అనుకున్నది.

ఆ అమ్మాయి బిందె చంకను బెట్టుకుని ఇంటికి తీసికొని వెళ్లింది.

నీళ్ళకుండీలో ఆ బుల్లి చేపను వేసింది.

వాళ్ళనాన్నను తీసికొని వచ్చి తాను చెరువునుండి తెచ్చిన చేపను చూపించింది.

వాళ్ల నాన్న సంతోషించారు.

తండ్రీ కూతురూ ఆ బుల్లి చేప ఈదుతూ వుంటే చూసి ఆనందించారు.

ఆ మర్నాడు అమ్మాయి మామూలుగా బిందె తీసికొని నీళ్ళ కోసం చెరువుకి వెళ్ళింది.

నీళ్ళల్లో బిందె ముంచుతుంటే ఇంతలోకి "పాపా—పాపా" అని ఎవరో పిలిచారు.

ఆ అమ్మాయి ఉలిక్కిపడి చుట్టూ కలయజూసింది. ఎవరూ కనిపించ లేదు.

తిరిగి బిందెను నీళ్లల్లోకి ముంచుతుంటే "పాపా—పాపా—నిన్నే" అని వినబడింది.

ఆ అమ్మాయి కళవళపడి నీళ్ల బిందెను తటాలున ఒడ్డుమీద పెట్టింది.

ఆ మాటలు చెరువుమీదనుండి వినబడ్డాయి. అందువల్ల చెరువులోకి చూసింది.

చెరువునీటిపైకి తలఎత్తి ఒక పెద్ద

ఎం. యస్. వెంకటేశ్వరరావు

చేప తనను పిలుస్తోంది.

ఆ అమ్మాయికి ఆశ్చర్యంవేసింది.

"ఎందుకు పిలుస్తున్నావ్?" అని అమ్మాయి ఆ చేపని అడిగింది.

"నిన్న నీ బిందెలోకి నా బిడ్డ వచ్చింది...అన్నెం పున్నెం ఎరుగని అమాయకురాలు...నీవు చాల మంచిదానివి...నా పిల్లని నాకు ఇచ్చెయ్—" అని అడిగింది.

ఆ అమ్మాయి బొమ్మలా అలా నిలబడిపోయింది. జవాబు చెప్పలేదు.

అప్పుడు చేప "అమ్మాయ్—అమ్మాయ్—మొన్న ఒక చిన్న అబ్బాయి ఈ చెరువులో నీళ్లు తాగడానికి వచ్చాడు-ఒంగుని నీళ్లు తాగుతుండగా అతని జేబులోని పావలా కాసు నీటిలోకి జారిపోయింది—ఆ పావలాకాసు నీటి అడుగునే వుంది—నీవు నా పిల్లని నాకు తెచ్చిఇచ్చేస్తే బుడుంగున మునిగి పావలాకాసు నీకు తెచ్చి ఇస్తాను—" అని ఆశ చూపింది. ఆ అమ్మాయి "సరే" అన్నది.

పెద్దచేప సంతోషపడింది.

బిందె చంకను బెట్టుకొని ఆ అమ్మాయి వాళ్ళ ఇంటికి వెళ్ళింది.

# ★ చేప - పాప ★

ఇంటికి వెళ్లగానే తన నాన్నగారి దగ్గరకు వెళ్లింది.

వాళ్ళ నాన్నగారు అప్పుడు డబ్బు లెఖ్ఖపెట్టుకుంటున్నారు.

నెమ్మదిగా నాన్నగారి దగ్గర కూర్చుని "నాన్నా—నాన్నా—ఈవేళ మామూలుగా చెరువుకి వెళ్ళాను—ఆ చెరువులో మన చిన్న చేప తల్లి వుంది—ఆ తల్లి తన బిడ్డను తన కిచ్చెయ్యమని నన్ను కోరింది—చిన్న చేప పాపం తల్లి కనపడ లేదని ఏడుస్తూవుందేమో— దాన్ని తీసి కెళ్ళి వాళ్ళమ్మకి వప్పగించి వస్తాను" అన్నది.

వాళ్ళ నాన్నకి కోపంవచ్చింది. "హాయ్?—చిన్న చేపను నీవు తీసికొని వెళ్లిపోయావంటే నీవు బద్దలు కొట్టేస్తాను—ఆ చిన్న చేపను మన నీటికుండీలో పెంచుతాను—అది ఎదిగిన తరువాత దాన్ని అమ్మివేస్తాను— ఒక రూపాయి వస్తుంది......" అని చెప్పాడు.

ఆ అమ్మాయికి ఏడుపువచ్చింది. కాని ఏంచేస్తుంది?

ఆ మర్నాటినుండీ ఆ చెరువుకి వెళ్లకుండా మరొక చెరువుకి వెళ్లేది.

వర్తకుడు ఆశతో చిన్న చేపను శ్రద్ధగా పెంచసాగాడు. ఆ చిన్న చేప రోజురోజుకి ఎదగజొచ్చింది.

కొంతకాలానికి బాగా కొవ్వి పెద్దచేప అయింది. వర్తకుడు ఆనందం పట్టలేకపోయాగు.

> **వాక్యరణం**
>
> టీచరు :- రాముా! "నీవు 'ఇంటికి వెళ్లినాను" ఈ వాక్యంలో తప్పేమిటో చెప్పు.
>
> రాము :— నేను ఇంకా ఇక్కడే ఉండటం తప్పండి.

వచ్చే సంతలో అమ్ముకోవాలని నిశ్చయించుకొన్నాడు.

వర్తకుడి ఇంట్లో అటకవుంది. ఆ అటకమీద ఒక నల్లపిల్లి వుంది. ఆ పిల్లికూడా వర్తకుడికి తెలియకుండా రోజూ చేపని కనిపెట్టుతూనే వుంది.

చేప బాగా కొవ్వెక్కి వున్నదేమో ఆ పిల్లి నోరువూరింది.

వర్తకుడికి తెలియకుండా పొంచి పొంచి ఆనల్లపిల్లి ఆ చేపను తటాలున నోట గఱచుకొని ఉడాయించింది.

వర్తకుడికి ఈ విషయం తెలియగానే లబోదిబోమని ఏడ్చాడు. ★

---

ఆంధ్ర సచిత్ర వారపత్రిక
## బాలల సంఘం
[సభ్యత్వపు దరఖాస్తు]

GROUP
A లేక B

సభ్యుని (సభ్యురాలి) పూర్తిపేరు (విడివిడి అక్షరాలలో) ....

పుట్టినతేదీ, నెల, సంవత్సరం : జులై 1 నాటికి వయస్సు ....
తండ్రి, లేక, సంరక్షకుని పూర్తి పేరు : ....
ఊరిపేరు, జిల్లా, తాలూకా, పోస్టు [వీధి: నెంబరు] ....
* చదువుతున్న తరగతి, లేక, ఫారము ; ....
పాఠశాల పేరు : ....
ప్రధానోపాధ్యాయునిపేరు (తెలిస్తే) :
ఆర్యా :
ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘములో నన్ను సభ్యునిగా/సభ్యురాలుగా చేర్చుకొన ప్రార్థన. పైన వ్రాసిన విషయాలన్నీ యదార్థములు.
ఇట్లు
[తేదీ : -1959]
(సంతకము)

* మరా : ఏ పాఠశాలలోనూ గాక ఇంటివద్దనే ట్యూషన్ చెప్పించుకొనే బాలబాలికలు కూడా సభ్యులుగా చేరవచ్చు. 'చదువుతున్న తరగతి' అనే విషయానికి ఎదురుగా 'ప్రైవేట్ స్టడీ' అని వ్రాయాలి.

సంచిక: **18-3-59** | ఈ దరఖాస్తు **21-3-59** నాటికి మాకు చేరాలి |

# కాకుల మొర

సూర్యుడు యింకా వుదయించలేదు. పక్షుల కలకల రవాలు నాకు నిద్రాభంగం కలిగించాయి. ముఖ్యంగా కాకుల కూతలు కర్ణకఠోరంగా ఉన్నాయి. "ఛూ! ఛూ! ఏమిటీ పాడుకాకులు? తెల్లారకూడదేమో వీటికి? నన్ను ఓమూనాన నిద్రపోనియవు. ఇంకాసేపు నిద్రపడితే బాగుండునే" అనుకొంటూ మళ్ళీ ముసుగుతన్నాను.

కాకుల గోల ఎంతకూ తగ్గకపోవడంతో విసుగెత్తిపోయింది. నిద్రపట్టడం అసంభవమైపోయింది. నిద్రమత్తు వదిలించుకొని బాహ్య ప్రపంచంలోనికి ఊడిపడ్డాను. కాకులు ఇంకా బయట అరుస్తూనే వున్నాయ్. ఎక్కడో దూరానవున్న కొబ్బరిచెట్టు మట్టల కొనల నీడలు మా యింటి ముంగిటపడ్తూ చిన్నగా కదుల్తూ వున్నాయ్. బాల భానుడు అప్పుడే ఆకాశంలోకి చొచ్చుకువస్తున్నాడు. ఈ నల్లటిజీవులు ఇంకా గోలసాగిస్తూనే వున్నాయ్. నాకు వాటిమీద తగనికోపం జనించింది. వాటి అరుపులవలన నాకు కలిగే గొప్పనష్టం ఒకటే

రోజూ ఏడెనిమిది గంటల వరకైనా నిద్రపోవాలనుకొంటాను హాయిగా పడుకొని. "లేరా! బద్ధకం వదిలించుకొని చదువుకోరా" అంటూ మా అమ్మ మొత్తుకుంటున్నా పట్టించుకోను. అటువంటి నాకు ఈ కాకుల గోల ఒక వుపద్రవమైపోయింది. వీటి మేలుకొలుపులతో మొహం మొత్తిపోతుంది.

కొన్నిదినాలుగా నా బుర్ర నాక్రమించుకొనివున్న సమస్య ఏమిటంటే — యీ కాకులెందుకు యిలా వుదయాన్నే కేకలేయడం? ఎంగిలి మెతుకులు తిని కండకావరం చేత అలా అరుస్తున్నాయేమో - అని సర్దుకుపోతూ వుండేవాణ్ణి.

చెరుకూరి గురవయ్య నాయుడు

కాని నాకిది ప్రతిరోజూ ఓసందేహంగానే వుండిపోయింది.

ప్రక్కపైనుండి లేచాను. నేరుగా నడవలోకి వచ్చాను. తాతయ్య ఎప్పుడో లేచి మంచంమీదే తిష్టవేసి ఏదో గొణుక్కుంటున్నాడు. మనకన్నా ముసలివాళ్ళే నయం అనుకొంటూ నా సమస్య మా తాతయ్యకు నివేదించాను. మా తాత గొణుగుడు ఆపి నా ప్రశ్న శ్రద్ధగా విన్నాడు. ఆయనకు పురాణాలూ, అవీ బాగా తెలుసు. కాన నా సందేహాను అప్పుడప్పుడు పటాపంచలు చేసేస్తుంటాడు. మా తాత నన్ను కూర్చోమని యిలా చెప్పసాగాడు.

"— ఏమి నాయనా! కాకులున్నాయే అవి చిరంజీవులు. బహు చురుకైనాయి. పైగా శనేశ్వరుడి వాహనం కాకే. కొన్ని మంచిచెడ్డలకు యీ కాకులకు పెట్టినతర్వాతే

# ★ కాకుల మొర ★

భోజనం చేస్తారు. సూర్యభగవానుడు వుదయించకముందేమో మనకమనగ్గా తూర్పుదిక్కున మేఘాలు కమ్ముకొని వుంటాయి గదా! ఉదయించేటప్పుడు అవేమో చెల్లాచెదురైపోతుంటాయి సూర్యకిరణాల ధాటికి. ఔనా?"

"అవును—"

"మరి యీ కాకులు గూడా రంగులో కారుమబ్బుల్లాగే వున్నాయ్. సూర్యునికి యీ మేఘాలు, కాకులు ఒకేవిధంగా అగుపిస్తాయి. తనవాడి కిరణాలతో మేఘాలను పారద్రోలుతాడు. ఈ కారుమబ్బులతోపాటు కాకులు గూడా చెల్లాచెదురైపోవాల్సి వుంటుంది."

"కాకులు క్రిందఉంటాయ్, మేఘాలు పైనుంటాయి కద తాతా! మరి వాటికీ వీటికి సంబంధమేమిటి?" అని బయటికి అనలేదు. అలా అనివుంటే అక్కడికి ప్రస్తుతాన్ని కట్టిపెట్టి రామాయణం లాంటి దేదైనా చెప్పడాని కుపక్రమించవచ్చు. నాకు చెడ్డవిసుగు. నాకు కావలసిందల్లా ఆ సందేహ నివృత్తి- పైదేమీ పెద్దసందేహం కాకపోగావూరుకున్నాను. ఆత్రంగా వినసాగాను.

—"కాని ఆ కాకులు సూర్యోదయాత్పూర్వమే "కావు. కావు" మని దీనంగా అరుస్తాయి. అలా అరవడంలో వాటి భావమేమో తెలుసా నాయనా?"

"ఏమిటీ?"

—"ఓ ప్రభాకరా! ఈ మా ఆకారాలు మేఘాలు 'కావు' మేము కాకులము! మమ్ములను 'కావు' మయ్యా ఓ లోకబాంధవా! అన్నటుంటి భావాన్ని ద్యోతకచేస్తాయి. ఆఁ! ఇప్పుడు తెలిసిందా నాయనా తెల్లవారిపూట కాకులు ఎందుకు "కావు కావు" మంటూ అరుస్తాయో?..."

"ఆలాగా తాతయ్యా!"........ అన్నాను సంభ్రమంతో పారిపోతున్న మేఘజాలాన్ని చూస్తూ.



## ఏకవచన ప్రయోగం

ఒకడు నిస్పృహగా:— "మనంత చవటలు మరెక్కడా ఉండరు."

పక్కవాడు: "బహువచనం మానేద్దూ."

మొదటివాడు: "నీ అంత చవట మరెక్కడా ఉండడు."





కందుకూరి లింగరాజు

# సమర్పణ

## 13

గానంచా ప్రేళ్ళాడుతుంటేనే ఉరుకులు పరుగులుతో శ్రీపతి, మంచువాలోంచి, పడమట ఇంటివీధుగా దొడ్లోకి వస్తూ:

"ఒదినా" అని పిల్చేడు.

గోడవతల చెత్తపారెయ్యడానికి వెళ్ళిన శ్యామల మరదిఖంగారు చూచి ఓసారి నవ్వుకుని, క్షణం 'ఎంపృటై ములిగిపోయింది ఈ వెర్రి బ్రాహ్మడికి ఇంతఖంగారు అనుకున్నా, మళ్ళీ ఆ రెడ్డి, సూర్పరాజులు ఏ చదరంగపు ఎత్తైనా ఎత్తేరేమో అన్న బెంగతో చేతులు కడుక్కుని తొందరగా వచ్చేసింది.

మెట్టమొదట చేనువద్ద తిర్వాతి బందిల దొడ్డిదగ్గర, ఇంకోసారి రచ్చబండవద్ద పరాభవం తన భర్తకు అయ్యింది. ఇప్పుడు ఇంకెక్కడ అయ్యిందో అన్న భయంతో కాంతమ్మ ఉరుకఉరికి వంటిల్లు చేరింది.

"ఏం? మరిదీ మళ్ళా వాళ్ళు ఏమైనా అన్నారా?" అంటూ శ్యామల ముఏలకించింది.

"లేదు. నాన్నగారి దగ్గరనుండి ఉత్తరం వచ్చింది."

"ఎప్పుడు వస్తున్నారు?"

ఆయన త్వరగావస్తే బావుండును, పరిస్థితులన్నీ చక్కగా సద్దుకుంటాయి. అనుదినం రోజూ కాంతమ్మ దేవుడిదీపం వెలిగించేటప్పుడు ప్రార్థిస్తూనే వుంది. తన భర్తపడే న్యూనతలను చూడలేక.

"ఇప్పుడప్పుడే రారు." అంటూ మడతలు విప్పి, ఉత్తరం అంతా చదివేడు.

"అయితే అత్తగారి అదృష్టం పండిందన్నమాటే" అని తను ఒంటరిగా ఇక్కడ వుండిపోవడం, ఆయన ఓ విశేషంగా దేశంమీద దండయాత్రకు వెళ్లడం బాగా నేస్తుంది అంది శ్యామల.

"అదృష్టంమాట ఎల్లావున్నా, నేను గిజగిజలాడిపోతున్నాను ఒదినా ఇక్కడ" అమాయకత్వంతో శ్రీపతి అన్నాడు. కాంతమ్మ అనునాయిగానే మొఖ కళవళికలు ప్రదర్శింప చేసింది

"మరిదీ! అల్లా బెంబేలు పడడంలో ప్రయోజనం లేదు. అయినా ఇప్పుడు నీకేం వచ్చింది చెప్పూ! వచ్చిన అవాంతరాలన్నీ కూడా ఏదో ఒడగళ్ల వానలా రావడం మళ్ళీ వెలిసిపోవడం జరుగుతూనే ఉన్నాయిగా?"

"అదేమిటి అల్లా అంటావు అక్కయ్యా! ఏ పొలంనుంచేనా వస్తున్నప్పుడు, తల పగలగొడతారేమో అన్నభయంతో భయపడి పోతున్నా నేను."

శ్రీపతి, శ్యామలాకూడా కాంతమ్మ మాటలకు డీలపోయేరు. అనురాగంవున్నా ఇంతగా మనస్సు చెదిరిపోతుంటూవుంటే ఇంక ధైర్యం ఎవరుచెపుతారని శ్రీపతి దిగులు పడిపోయేడు.

"ఆపనిమాత్రం కలలో కూడా వాళ్లు చెయ్యలేరు" అంది ధీమాతో శ్యామల.

"నిజంగా అక్కయ్యా!"

"అవునమ్మా. వాళ్లందరూ వాళ్లి చేతిక్రిందఉన్న వాళ్ళకళ్లలో—మేం గొప్ప వాళ్లం, పలుకబడి కలదు—అని చూపించుకోవాలన్న దౌర్జన్యంతో చేసేపనులవి. అంచేత ఎదుటబడి ఆఖరుక్కు మరిది కాలిగోరైనా కదల్చలేరు.

పోనీ నువ్వుచెప్పు చెల్లాయి? ఒక్కడూ మరిది ఎదుటబడి, ఏమిటయ్యా! ఇదంతా అని అడిగినవాడు ఉన్నాడా ఇంతవరకు? అంతవరకూ ఎందుకూ? ఎదుటబడినవాడున్నాడా? 'ఏం, మాట్లాడవేం మరిదీ!" రుమాయించి అడిగింది.

శ్రీపతి, కాంతమ్మలిద్దరికీ కూడా వెయ్యేనుగుల బలంవచ్చినట్లు, పెద్దతిమ్మరుసు మంత్రి అండగావుంటే లోటేమిటి అదంతా మన ఒట్టిపిరికితనం అనీ అనిపించింది

"అవును ఒదినా. నాన్నగారు వెళ్ళినప్పటి నుంచి చూస్తున్నా ఒక్కడంటే ఒక్కడు వాళ్ళల్లో వాడు ఎదుటబడే లేడు. తప్పించుకు తిరుగుతున్నారు. అది నిజమే సుమా!" అని నేడు కాస్త ఝూంకారం చూపిస్తూ.

నవ్వుకుంది శ్యామల. ఇంచుమించు తన ఈడేవున్న ఈతన్ని పెద్దవాడనాలో, పొత్తిళ్లల్లో పాపాయే అనాలో తెలియక,

"అయితే స్వామి కల్యాణానికి తాంబూల మిస్తారన్నమాట!" వేళాకోళంగానే అంటించింది.

ఎగిరిపడింది కాంతమ్మ. రంగనాయకి వచ్చినప్పట్నా, ఈయనను వెక్కిరిస్తున్న వేళాకోళాలు పట్టించి. నవ్వులపాలు చెయ్యడం పరిపాటి అయ్యింది ఈసిగ్గూ మనస్సువున్న ఈయనా అదో గొప్ప అనుకుని, దాంచేత గంధం రాయించుకోవడం, అత్తరు పుజల్లించుకోవడం, జావళీఅంటూ నానా హంగమా అది చేయగా నవ్వులపాలు అవుతూనే వుంటాడు. తోడివాళ్ళకు అది చూడతగ్గ విషయం కాగా తనకు మాత్రం తలతీసినట్లు వుండేది పైగా అది పడిమంది మధ్య "మా కులంలో చేరకూడదయ్యా! నిన్ను పెళ్ళి చేసుకుంటును" అని అనడం, నిప్పులు చెరిగినట్లు, కళ్ళల్లో కారం కొట్టినట్లు వుండేది.

ఆ ఉద్రేకంలో దాన్ని సిగపట్టుకుని, ఈ దవడా ఆదవడా చెంప పళ్ళు రాలిపోయేట్లు

వాయించాలన్నంత కోపం ఆవేశించినా ఏమీ చెయ్యలేనితనం వచ్చేసేది.

అల్లా చీల్చి చెండాడినట్లుగా రంగనాయకి ఆయన్ని అడించినా తన దగ్గరకు వచ్చి కూర్చున్నప్పుడు "ఒదినా తన దగ్గరకు వచ్చి కూర్చున్నప్పుడు "ఒదినా! అంత అనూయిక చక్రవర్తిని ఎన్ని పూజలుచేసి సంపాదించేవు! బిడ్డా, భర్తా కూడా అయనే. ఎల్లాకాపాడుతావో" అనేసేది ఆపేకులో, ఆ మాటలను తను కరిగిపోయేది. వెళ్ళేటప్పుడు పాదాభివందనం చేస్తే, కళ్లమ్మట నీళ్ళే కారేవి. దాని మీద వలమాలిన అనురాగంలో

"మరిదీ! ఆ పడమటింటి పసారాగది ఖాళీ చేయించవు!" అన్న పురమాయింపులో ఆదరింతో శ్యామల లోపల్కి వెళ్ళిపోయింది.

పొలిడి గుమ్మం దాటేటప్పటికి వెంకటస్వామి కూర్చునే వున్నాడు. శ్రీపతి తెల్లబోతూ "ఎంత సేపయ్యింది వచ్చి?" అన్నాడు.

"ఇప్పుడే. పాలంకొడి నుండి వస్తున్నా" అంటూ ప్రక్కగా పెట్టిన మూలకొక్కి కట్ట జరుపుతూ "లోపల పెట్టించండి" అనీ అనేసేడు.

"ఏన్నారా!" అన్నాడు ఘట్టిగా.

మెడమీద పైపక్క తిరుగుతూనే "ఏమిటది వెంకటసామి?" అని చేతులో కట్ట పట్టుకునే అడిగేడు. అది వినడం, కాంతమ్మ అప్పుడే తలుపు చాటుకు చేరిపోవడం జరిగింది.

"వాళ్ళు మనకి చెప్పకుండానే ఊళ్ళోవుండా ప్రోగుచేసేరు కల్యాణానికి. మనింటికి రానేరాలేదు. పందిళ్ళు కూడా జోరుగా వేయిస్తున్నారట. ముంగండ బ్రాహ్మల్ని వంటకి కుదిర్చేరు. సూర్యరాజు వారం క్రితమే రంగనాయకి దగ్గరకు వెళ్ళివచ్చేడుట. దానికి విడిదీ ఏర్పాటుచేసేరు." మండిపోయినట్లే పలికేడు.

"ఆ!" అంది కాంతమ్మ.

శ్రీపతి మాట్లాడనేలేదు.

"ఇలా మాట్లాడకుండా కూర్చుంటే మనల్ని చెలేసినట్లే చూస్తారు. నాన్నగారు ఎప్పుడు వెళ్ళేరో అప్పటినుండీ ఇల్లా జరుగుతూనే వున్నది. మీరుమాత్రం బెల్లం కొట్టిన రాయిలా కూర్చోవడం ఏం బాగోలేదు. అడ్డుపడాలి?" అనీ అనేసేడు.

"అడ్డుపడి ఏం చెయ్యమంటావు. వెంకటస్వామీ?" అంటూ శ్యామల బయటకు వచ్చింది.

కుందేలు అయినట్లయ్యేడు వెంకటస్వామి. నిలదీసి సమాధానం చెప్పాలన్న తొడదరువు వినిపించింది. ఇంతకీ తనకే తెలియదు ఏం చెయ్యాలో. ఉన్నపాటు వుండి భుజబలం చూపించిరా అంటే, కర్ర చేతిలో వుంటే పదిమందికి సమాధానం చెప్పి, ఆమీతూమీ తేల్చుకు వచ్చే కీలప్ప.

బుర్ర గోక్కుంటూనే "కాలం తేలుస్తది! మీరే ఆలోచించండి! ఆ సభా తాంబూలంకూడా సూర్యరాజే ఇస్తే ఇంక ఈ పూట్ని కేసు తలెత్తుకు తిరగలేను", అనేసేడు.

శ్రీపతికి చురక వేసి నట్లయ్యింది. వళ్ళు కుతకుతలాడింది. దాంతోనే ఏమి చెయ్యాలన్న దారి తెన్నూ తెలియక, అంతసభ, తనులేచి తాంబూలం ఇవ్వడం, అందరికళ్ళు మిలమిలా మెరిసిపోవడం తన కీర్తి, ప్రతిష్ఠ వెయ్యి వెలుగులవడం, అన్నీ కూడా చేతులోంచి సిద్ధాన్నం జారిపోతొందన్నట్లు అనుభూతిలో, పరవళ్ళు త్రొక్కేసేడు. ఇటూ అటూ పచారు చేసేసేడు.

కాంతమ్మకు పాలుపోనేలేదు సలహా.

శ్యామల మాత్రం అదేస్థాయిలో "అదప్పటికి జరగదూ వెంకటస్వామి. సూర్యరాజా కాదు వానితా తలవచ్చినా ఊరి తాంబూలం రంగనాయకి చేతిలో పెట్టలేను. "అని ఖరాఖండీగా అనేసింది.

అందులోని ఆవిడ ధైర్యం ఏమిటో అవగాహనకాలేదు ఇద్దరికి. కాదు ముసురికిన్ని.

"బోలెడు పనుంది. ఏం మరిది! ఇంకా అల్లాగే నుంచుండి పోయేవు. ఆ పసారాగదిలోని సామాను కొట్టుగదిలో వెంకటస్వామితో చేర్పించవేం" అంటూనే మూలకొక్కెకట్ట, గుమ్మం మీవది అందుకుంటూనే వెళ్ళిపోయింది.

ప్రతిమల్లా వాళ్ళిద్దరూ పసారాగదిలోకి నడిచేరు. సామాను చేరవేస్తున్నప్పుడే శ్రీపతి తండ్రిగారి ఉత్తరంలో సంగతులు చెప్పేడు. అన్నిట్లకి ఊకొట్టేడు వెంకటస్వామి.

"ఎవరి కోసం బాబయ్యా! ఖాళీచేయిస్తుంట"

"రంగనాయికకు"

"అది మనింటి కెందుకు వస్తది. ఆరాజుగాడు రెడ్డి ఇంటి ప్రక్క ఇల్లు ముక్తాయించేడు కా"

"ఏమో!" అనేసేడు శ్రీపతి.

"అవధాని గార్ని జైల్లో పెట్టేసేరుటకా తలూపేడు. వాడైనా లేడన్న మనస్సు వ్యాకులతలో

"అయితే కాని మనం కాంగ్రెసువాళ్లమా, కమ్యూనిష్టులమా?" అన్నాడు వెంకటస్వామి ఉండుండి.

సమాధానం ఆలోచించినా తట్టటంలేదు. పైగా తనకి అవేమిటో చెపితే విన్నాడు, ఓహో అనీ అనుకున్నాడు కాని గిరాతను చేని వైపు మొగ్గుతాడు అంటే తనకే తెలియదు. అసంతా ఓ వెర్రి పుట్ట కాయవతుగా వుంటే "మనం మనమే" అన్నాడు.

"భలే మాటన్నాగు" అన్నాడు వెంకటస్వామి. అందులో ఓ గొప్ప కన్పించినట్లు.

కాంతమ్మ ఉడుతూ మడుతూ వచ్చి ఇంకా ఇక్కడే పడివుండి పోతే ఎల్లాగా పొలిట్లో గంగరాజు నాన్న రామలక్ష్మమ్మ పిన్ని వచ్చి వుంటే. రండి" ఓ పొలికేకలా పెట్టి మళ్లీ వెళ్ళి పోయింది.

గంగరాజు మామయ్య తనింటికి వచ్చి రమారమి ఏడేళ్లు కావస్తొంది అనితడితే, ఈ మధ్య చూడలేదన్న ఆపేక్ష పుర్తుకువస్తే, మొగం గావంచాతో తుడుచుకుంటూ వెనువెంటనే వెళ్లినట్లూ వెళ్లేడు శ్రీపతి.

వెంకటస్వామి మాత్రం "ఈ పీనాసి ఇప్పుడొచ్చేడు ఎందుకో" అన్న భావాన్ని బాగా వ్యక్తీకరించినట్లే, చాప వేసి, బయట పడాడు.

ఏం మావయ్యా కులాసాగా వున్నావా? అన్నాడు శ్రీపతి; అలాగే అత్తయ్య వైపు తిరిగి ఓ సారి నవ్వుతూనే" ఏం అత్తయ్యా! ఎన్నాళ్లకు వచ్చేవు మా ఇంటికి, అంతా క్షేమమేనా? అని ముదలకిస్తూ "ఏమేవ్! చెంబుల్తో నీళ్లుపట్టుకురా" అని ఓ కేక పెట్టి "వెంకటస్వామి సవారీ బండిలో పెట్టెలిగ్గిరావి లోపల పెట్టవయ్యా" అన్న ఆదేశంపు పారేసేడు.

—ఇంకా వుంది]



# వనితాలోకం

# మహాజనప్రగతిలో మహిళల భూమిక

"భారత స్త్రీలు కేవలం పువ్వుసుకుమారలే కారు; కణకణలాడే నిప్పురవ్వలు కూడాను" అని అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షురాలు శ్రీమతి ఇందిరాగాంధి ఇటీవల అన్నారు. ఈ వాక్యం యదాలాపంగా అన్నదికాదు; చారిత్రక సత్యాలలో నిండి ఉంది.

కొన్ని దశాబ్దాల క్రిందట, ఉన్న సాంఘిక ఆచార, సంప్రదాయాలు, జాతీయ భావాలు, రాజకీయ చైతన్యం కలిగిన స్త్రీ కార్యక్రమాలు, కొన్ని ప్రదేశాలకు మాత్రమే పరిమితమై యుండేవి. దశాబ్దాలు జరిగిపోయిన కొద్దీ రాజకీయ హక్కులు సాంఘిక సాంస్కృతిక గౌరవ మర్యాదలు, ఆర్థిక సమానత లభించింది. జనసంఖ్యలో సగభాగమైన స్త్రీ జాతి, ఆదిలో పురుషునికి పుట్టుబానిసగ కట్టి వేయబడి నప్పటికి రాజకీయ, సాంఘిక చైతన్య ప్రవంతిలో భుజం భుజం కలిపి స్వాతంత్ర్య పోరాటములో పాల్గొనుట ద్వారా మూఢాచారాలు ఏ పటాపంచలగుటే గాక అబలలు అనబడే స్త్రీలు తాము సబలలని నిరూపించుకొన్నారు. ఈ చైతన్య ఫలితంగానే నేడు లోక్ సభలో 22 మంది వివిధ రాజ్యసభలో 19 గురు, వివిధ రాష్ట్ర శాసన సభలలో 82 మంది సభ్యురాండ్రయి దేశపరిపాలన వ్యవహారాలలో పాల్గొనడం జరుగుతున్నది.

## 40 ఏళ్ల క్రితం

1917 సం॥లో డాక్టరు అనిబిసెంటు నాయకత్వమున మార్గరెట్ ఇ. కజన్స్, డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డి, కమలాదేవి ఛటోపాధ్యాయ మొదలగు వారు కృషిచేసి మద్రాసులో అఖిల భారత వనితామండలి నెలకొల్పారు. స్త్రీలు అన్ని రంగాలలోను పురుషులతో సమాన హక్కులు సాధించుటే దాని ముఖ్యోద్దేశ్యమై మాంటేఫర్ సంస్కరణలు వచ్చిన నాటికి స్త్రీలకు ఓటు హక్కు లేదు. పౌరహక్కులు అనుభవిస్తున్నప్పటికీ ఓటు హక్కులేని సంఘటన భారతనారి చైతన్యానికి దారి తీసింది. భారతదేశమంతా ఉపసంఘాలను నెలకొల్పి 10,000 మంది సభ్యులను చేర్చించారు. ఈ ఉద్యమం దిన దినాభివృద్ధి చెందింది. 1927 పూనాలో జరిగిన మొట్టమొదట అఖిల భారత వనితా సమావేశము నాటికి 22 అనుబంధ సంఘములు ఏర్పాటు అయ్యాయి. ఆ సభా కార్యక్రమమంతా స్త్రీ విద్యపై కేంద్రీకరించబడినది. రాను రాను సాంఘిక సంస్కరణాలు బాల్య వివాహాల నిర్మూలనము వివాహ సంస్కరణ విడాకులు, వారసత్వ హక్కులు ఇట్టి ప్రజాహిత కార్యక్రమాలను చేపట్టింది ఈ సంస్థ. ఆశయ సాధనకు, పల్లెలలోను పట్టణములలోను ప్రచారము గావించి స్త్రీ తన బాధ్యతలను గుర్తెరుగునట్లు చేసి ఎక్కువ మంది సభ్యులను చేర్పించినారు.

**త్రిపురనేని కమలేశ్వరి**

భారతదేశమంతటిలోను పెద్ద రాష్ట్రమైన ఉత్తర ప్రదేశ్ లో ప్రభుత్వమున 1937 లో స్థానిక స్వపరిపాలనా శాఖామంత్రి పదవిని అధిష్ఠించి శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ నారీలోకానికి గర్వకారకురాలు అయింది. ప్రభుత్వ కార్యనిర్వహణలో ప్రశంసలందుకొంది. అశేష చైతన్యాన్ని కలుగజేసిన కస్తూరిబా గాంధి స్వర్గీయ సరోజినీనాయుడు జాతికే చిరస్మరణీయులు అయినారు.

1949 లో రచించబడిన మన రాజ్యాంగ చట్టమున స్త్రీ పురుష భేదములు లేకుండా అందరకు సాంఘిక, రాజకీయ ఆర్థిక సమాన హక్కులు కల్పించబడినవి. 21 సం॥ పైబడిన ప్రతి స్త్రీకి ఓటు హక్కు లభించినది. 1951 ఎన్నికలనాటికి 8 కోట్లు స్త్రీ ఓటర్లు ఉన్నారు. అంటే ఓటు హక్కు కల్గిన వయోజనులలో స్త్రీలు నూటికి 50 మంది. 1951 లో జరిగిన ఎన్నికలలో 48% ఓట్లు స్త్రీలవి. 19 మంది స్త్రీలు లోక్ సభకు 14 మంది స్త్రీలు రాజ్యసభకు ఎన్నుకొనబడ్డారు. ఉత్తరప్రదేశ్ గవర్నరుగా స్వర్గీయ సరోజినీనాయుడు నియమించబడ్డారు. కేంద్ర ప్రభుత్వ ఆరోగ్యశాఖా మంత్రిణిగా రాజకుమారి అమృతకౌర్ నియామకముకూడా అప్పుడే జరిగినది. శ్రీమతి విజయలక్ష్మి పండిట్ రష్యా, అమెరికా, బ్రిటన్ దేశాల భారత ప్రతినిధిగా ఉండి బాధ్యతగల పదవులను నిర్వహించారు. అంతేగాక ఐక్యరాజ్య సమితికి, అధ్యక్ష పదవినికూడ నిర్వహించి ప్రపంచ జాతులకు భారతనారి ప్రభావాన్ని చాటింది. శ్రీమతులు సుచేతకృపాలానీ, ధన్వంతిరామారావు, హన్నాసెన్, హన్నా మెహతా, రేణుకారే మొదలైనవారలు మిత్రరాజ్య సమితి నడిపే అనేక కార్యక్రమాలకు ప్రతినిధి సంఘాలను నడిపారు.

ఈ సాంఘిక, రాజకీయ చైతన్యంవల్ల స్త్రీ విద్యాభ్యాసంకూడా వృద్ధిచెందింది. అర్ధగోడలువలె సంఘాచారములుగల ముస్లిం విశ్వవిద్యాలయంలో (క్రింది తరగతులలో అంగీకరించనప్పటికి) పై తరగతులలో సహా విద్యాభ్యాసానికి ప్రవేశాన్ని కలుగజేశారు. విద్యాలయాలలో తెరలను తొలగించివేశారు. ఈనాడు 20,000 మంది విద్యార్థినులు వివిధ విశ్వవిద్యాలయాల్లో విద్య నభ్యసిస్తున్నారు. 6000 మంది స్త్రీ డాక్టరు, విద్యార్థి సైనిక శిక్షణలో అనేక మంది యువతులూ శిక్షణపొందుచున్నారు. 170 మంది ఈ శిక్షణకు సంబంధించిన ఉద్యోగాలను నిర్వహిస్తున్నారు.

శతాబ్దాలుగా బానిసలుగా ఉన్న స్త్రీజాతి 1955 లో ప్రత్యే హిందూ వివా

# మళ్లీ మళ్లీ చదవాలనిపించే

# శివభారతం

ప్రస్తుతం చాలా రకాల పుస్తకాలు చదువుతాముకాని వాటిలో మనం గుర్తుంచుకోతగినవి చాల తక్కువ. ఎందుకనంటే కొన్నిటిని పేరు చదువుతూనే విసిరి పారెయ్య బుద్ధి పుడుతుంది. కొన్ని చదివి మర్చిపోతాం. కొన్ని మాత్రం మర్చిపోలేనివిగా అలాగే మనసులో నిలిచిపోతాయి. నాకు ఇదివరకు అంటే రెండు మూడు సంవత్సరాల క్రితం నవలలంటే వుండే ఇష్టం కావ్యాలు చదవాలంటే వుండేదిగాదు. అర్థంకాని వన్నీ సోలెద్దూ అనిపించేది. ఓసారి అన్నయ్య, "నీ ముఖం ఎన్ని నవలలు చదివితే ఏం ఒక్క కావ్యం చదివి తెలుసుకున్నంతకూడా తెలుసుకోలేవు." నీకు శివాజీ చరిత్ర యిష్టమేగా. ఇదుగో (గడియారం వేంకటశాస్త్రి గారి) శివభారతం పద్య కావ్యం చదివి తర్వాత నీ అభిప్రాయం చెప్పు 'అర్థమయ్యేది లేనిది" అన్నాడు.

ఏదో అన్నయ్య చెప్పాడుగదా అనే వుద్దేశ్యంతో పుస్తకం చదవటం మొదలు పెట్టాను. అంతే అది పూర్తిఅయ్యేవరకూ వదలిపెట్టలేదు, మధ్యలో ఏపని చెయ్యాలన్నా విసుగు కలిగేది. ఇక తరువాత చాలా కావ్యాలు చదివాను. అయినా శివభారతం మనసులో నిలిచినంత గాఢంగా మరేది నిలవలేదు. మళ్ళీ చదవాలని బుద్ధి పుట్టి యింకోసారి యింకోసారిగా చాలాసార్లు చదివాను. అందులో ఎక్కువగా పఠితల్ని ముగ్ధుల్ని చేసే వ్యక్తులు శివాజీ జిజియాబాయి. నన్నెక్కువ ఆకర్షించుకున్న వ్యక్తి జిజియా. అబ్బా ఎంతటి స్వాభిమాని, దేశాభిమాని. ఎంతటి వివేకవతి! "ఇంతటి శక్తిశాలిని అయినా జిజియా స్త్రీ! ఆమె జాతి నాది" అనుకుంటే ఎందుకో ఒకవిధమైన అహంభావం కలుగుతుంది.

తండ్రికి భర్తకి విభేదం కలిగినప్పుడు తండ్రిని అడిగే విధానంలో చూడండి. ఆమె ఎంత అభిమానంగా ప్రశ్నిస్తుందో దిక్కు లేదని హేళనచేసే తండ్రిని మాని.

—కాంతి

[ధర్మారం, నిజాంబాదుజిల్లా]

"దిక్కు లేదేమి నాకును నా భర్తకు, నాయువుంగొనెదనొక్క. రమ్ము నేనుంటి పతిని యర్ధాంగను. నేమిచేసెదవో. పంతం బెట్టెదో చూచెదన్" అంటూంది రోషంతో.

ఎంతటి అభిమానం! వెంటనే మే తండ్రిని అభిమానంతో పుత్రికా ప్రేమతో వెనక్కి తిప్పుతుంది. భర్తవెంట తిరుగలేను. నిందు మాలలివి. నా ఇంటికి రమ్మ"నే తండ్రితో "దయామయ నీమనంబున నిచ్చినదిదె చాలు జాలనివి శేషము దైవము నిర్వహించు. నాథుని పనుపెట్టుటుండెద నిద్రలోయగలా దభిమానశాలి నీ గనమొక మోడు నాయనకు గానిది నాకును నీకున్నామె."

ఎంత వివేకంతో భర్త గౌరవాన్ని తండ్రి గౌరవాన్ని నిలుపుతుందో. "నీ విచ్చినది చాలుచాలకపోతే భగవంతుడున్నాడు. భర్త గౌరవం నిలపటమే నా కర్తవ్యం. నీకు కూడా కావలసిందదేగదా" అంటుంది. తండ్రిని నైజాం నవాబులు, దర్బారులో చంపారని తెలిసి ఓదార్చబోయిన భర్తకి కర్తవ్యం గుర్తుచేస్తుంది.

పుట్టినిల్లు అగిపోయునిశ్వస్తాను దలచుకొన్న గ్రుపదతనయ సైతి. బావనాయనముంచు పార్థునై నాను. నాకంటనీట. బారకొల్పవలదు" అంటూ పుట్టినింటిమీద మమతతో భర్తని యుద్ధానికి పురికొల్పి పంపుతుంది.

కూతురుగా తండ్రికేమను ప్రేమతో చూస్తుంది. భార్యగా భర్తకు కర్తవ్యం చెప్పి శత్రువుల నెదుర్కొమంటుంది. అప్పటికే తల్లి అయినా, శివాజీకిమాతృమూర్తి అయిన తరువాతే. ఆమె మాతృత్వానికి విలువిచ్చింది.

చందమామరావె, జాబిల్లి రావె అనే పాల బువ్వలపాటతోపాటు తొలికోడి కూత తో నిత్యకృత్యాలతో దైవప్రార్థనలు నేర్పుతుంది. వీటితో పాటు పూర్వుల వీరుల చరిత్రలు వాటితో పాటు అనాటి రాజకీయాలు దేశాభ్యుదయం వుగ్గుపాలతో గంగరించి పోస్తుంది. ఇలా పెరిగిన శివాజీ "నీ...నా" అనే రాజకీయపు చదరంగపావుల్ని చూసి అసహ్యించుకుంటాడు. ఆ పద్ధతిలో వున్న కొమారుణ్ణి సుల్తాన్ దర్బారుకి రమ్మంటాడు తండ్రి. వచ్చినంత పాడలేనని తండ్రికి చెపుతూ.

"తండ్రి కొలురాదు గూర్పు పుత్రుడ
వంచు దలపకు తండ్రి నామాట తప్పగోనకు
మనసు రెండుగా విలచినీ కనులయెదుట
చెట్టితిని దీసికొనుము నీకలచినట్లు"

అంటాడు అంత అభిమానము అంత వినయమూగల కొడుకుని చూసి ఏ తండ్రి మురిసిపోడు! తప్పని సరిగా కొలువుకెళ్ళి వచ్చిన శివాజిని అక్కడ అపార గౌరవంపొంది వచ్చాడని, సంతోషంతో కౌగలించుకోబోతుంది జిజియా

"నామేను మైలపడెంగొల్వుల రాకపోకలసచేల స్నానముంజేసి హైందవ మర్యాదల నిమ్మగొల్పెద నన్ను వ్లన్నింపుమీ."

అనే కొడుకుని చూసి అతని హైందవాచార నిష్ఠనుచూసి జిజియా ఎంత సంతోషిస్తుందో షాజీ అంత విచారిస్తాడు. 'తండ్రి మండలించినా వినకుండా స్వతంత్ర రాజ్యస్థాపనకే పునాదులు వేసే దీక్షను చూసి జిజియా అంటుంది. ★

---

పోలబిల్లు ద్వారా విముక్తి చెందిందని చెప్పవచ్చు. క్రైస్తవ, మహమ్మదీయ, మతముల వారికి, ప్రత్యేక వారసత్వ విడాకుల, వివాహాల చట్టాలు ఉండనే ఉన్నవి. అవి వారి ఇష్టమొచ్చినట్లుగా వివాహమాడనూవచ్చు, పొసగనప్పుడు విడాకులు ఇవ్వనూవచ్చు. వారసత్వ చట్టప్రకారం కుమారునికి కుమార్తెకు తండ్రి వాటాలో సమానహక్కులు కల్పించబడ్డాయి. వరకట్న నిషేధచట్టాలు చేయబడినాయి. శ్రీమతి ఇందిరాగాంధీ అధ్యక్షతా కాలంలో కేంద్రంలోకూడా వరకట్న నిషేధం చట్టమై దేశమంతటా పూర్తిగా అమలు జరుగుతుందని ఆశిదాము.

భారత దేశంలో కేరళలో మొట్టమొదటగా శ్రీమతి అన్నా చండే న్యాయమూర్తి పదవిని అధిష్టించటమేమి మొట్టమొదటిగా ఏర్పడిన కేరళ కమ్యూనిస్టు మంత్రి మండలిలో రెవెన్యూ మంత్రిగా థామస్ గౌరి, పదవిని నిర్వహించుటమేమి, ఆసియాలో రెండవదిగా ఎంచబడిన ఢిల్లీ మున్సిపల్ కార్పొరేషనల్, అరుణా ఆసఫాలి అధ్యక్షురాలగుటయేమి, అఖిలభారత కాంగ్రెసుకు ఇందిరాగాంధి అధ్యక్షపదవి స్వీకరించటమేమి, కుమారి పద్మజానాయుడు బెంగాల్ గవర్నరు పదవిని నిర్వహించటమేమి, శ్రీమతి విజయలక్ష్మీపండిట్ లండన్ లో భారత హైకమీషనర్ పదవిని సమర్థతతో నిర్వహించటమేమి బరోడా విశ్వవిద్యాలయమునకు ఉపాధ్యక్షురాలుగా శ్రీమతి హాన్సామెహతా నియామకము జరుగుటయేమి—ఇవి అన్నీ భారతస్త్రీల ప్రతిభకు కార్యదక్షతకు నిదర్శనాలు. భారత స్త్రీలు కట్టి పువ్వులేగాక కణకణలాడే నిప్పురవ్వలుకూడాను. అసీమ విజ్ఞాన సంపత్తులకు నిలయమైన భారతావని ప్రపంచ జాతులతో సగర్వముగా మనగలుగుటకు భారత స్త్రీజాతి సముచితపాత్ర నిర్వహించగలదని తలంచవచ్చును. ★

# శివ భారతం

ఒక పార్థివమణి బిడ్డదున్నత మహోద్యోగం
బునన్ మాతృ భూమికి
కల్యాణముగూర్పి నాడనుచు నెమ్మినలోను
లగ్గింపగా తుకమున్ బొందక వచ్చుగాని
మునుముక దూరించిగాలించిదానికి సైగర్భము
కోని పంచెను పురంధ్రిన్ దల్లు లేకుందురో

చూడండి ఎంతటి ఉత్సాహ ఉద్వేగాలతో 'మనసు పుప్పాంగినా కొడుకుని మన స్ఫూర్తిగా యుద్ధాల్లోకి పంపినందుకు తల్లి లేమంటారో అనే సంతోషాన్ని ఎంత మున్నితంగా చెబుతుందో. ఇంత లోతైన తల్లి నీతిలో పెరగటంవల్లనే శివాజీ అంతటి వాడయ్యాడేమో. లేకపోతే అంతటి పచ్చి అకె, న్యాయబుద్ధి ఎలా అబ్బ గలిగేది! శివాజీ సేనా నాయకుల్లో ఓ నాయకుడు దుర్గాన్ని జయించి ఆ దుర్గపురాణి నాసాన్ని కూడా చెరబట్టి తీసుకొస్తాడు. అతని న్యాయబుద్ధికి, స్త్రీలంటే అతనికున్న పూజ్య భావానికి ఇదొక నిదర్శనం. ఆ మాట వినగానే శివాజీ ఆ సేమాట.

"ఆ యేమీ యొకరాణి వాసమున్ బుణ్యా
వాసముం దెచ్చినావా
యే హైందవుడైన నీ గతి నమర్యాదన్ ప్రవ
ర్తించు చె, మా యాజ్ఞన్ గమనింపవో
జయమదో
న్మాదంబునన్ లేగినీ యాయుష్మాత్రము
లీవ త్రుంచు కొనెనో యాస్థిత్యమార్వన్
జామీ"

అంటూ ఆ ముసల్మాను యువతిని చూసి.

"వనితా రత్నంబులీభవ, హైందవ భూజంగ
ము పుణ్యజీవతలయూతా! తిప్పసైరింపుమీ"

అని ఆమెను ప్రార్థించుతాడు. స్త్రీలంటే అతనికున్న పూజ్యభావాలకు యింకేం నిదర్శనం కావాలి. ఎంతటి రాజనీతి చతురుడో అంతటి ప్రజ్ఞాశాలి. వీరుడు. పచ్చిలి ఇలా చెప్పుకుంటూపోతే ఎన్నెన్నో వున్నాయి. కొంచెం చదితే చాలను. దీన్ని గురించి దేనికది ఓ రసవత్తరమైన భాగం. ఇది చదువుతున్నంతసేపు వర్తమానానికి దూరమై శివాజీ కాలంలో కెళ్ళిపోతాం మనం. మన కళ్ళముందు జిజియా శివాజీలు ప్రత్యక్షంగా నిలిచినట్టే కనపడుతుంది. ఇది పూర్తి కల్పన కాదనీ, ఓ చరిత్రనీ మనకందరికీ తెలుసు. ఆ చరిత్రే ఇలా నిండైన రూపురేఖలతో మనల్ని వేరే లోకాల్లోకి తీసుకుపోతుంది. అది ఓ రసజగత్తు. ఆ జగత్తులో ఏ కొంచెమైనా మన కావాడు స్థానముందా అనిపించుతుంది. జిజియా మాతృహృదయం తడుగడుక్కీ మనలో కొత్త పొకడలు నేర్పుతుందనిపించుతుంది. ఆమె వాత్సల్యం, దూరదృష్టి చూచినపుడు మనలో ఈ గుణాలు ఉన్నాయా అని ఆత్మవిమర్శ చేసుకో బుద్ధి వేస్తుంది. మన ఆత్మవికాసానికి విజ్ఞానానికి మన పద్య కావ్యాలు ఎంతో వుపయోగిస్తాయి. మనల్ని కవ్వించి నవ్వించి ఏ వూహాలోకాల్లోకో మనల్ని లాక్కెళ్ళే శక్తి వుంది వాటిల్లో. పాత చింతకాయ పచ్చడే అనుకోకుండా చదవటం ప్రారంభించామంటే మళ్ళీ వదలిపెట్టలేము.

నాకు చాలా యిష్టమైన మరో కావ్యం మనుచరిత్ర. ఎన్నిసార్లు చదివినా కొత్తదనం విడవని యీ కావ్యాలలోని మాధుర్యం చదివితేనే తప్ప, చెప్పితే తెలియదు. మనం ఎన్నో చదువుతున్నాం కాని యీ పద్య కావ్యాల్ని అంత శ్రద్ధగా చదవం. ఎందువల్లనంటే అ ఏముంది లెద్దూ, ప్రతిదాన్ని వర్ణనలతో నింపేస్తారు, అనే వుద్దేశ్యం చాలాగ్గా చాలామందికి వుంటుంది. కాని ప్రతివారు చదవదగ్గవి యీ కావ్యాలు. అందులో శివభారతం దొరికితే తప్పకుండా చదవండి. ❖

## కొత్త మేష్టారు

రెండో క్లాసు చదువుతున్న కిట్టుకుమారి కొత్తగా వచ్చిన ప్రవేటు మేష్టారుతో :—

"మలండి, ఇదివరకు నాకు ప్రవేటు చెప్పిన మేష్టారు నా తలలో మెదడులేదని కోప్పడి మానేశారండి."

"మరేం ఫరవాలేదమ్మా. ఆ ఖాళీ భర్తీచేయడానికే మీ నాన్నారు నన్ను రమ్మన్నారు," అన్నారు మేష్టారు.



దిండు గలీబులకు, టేబుల్‌క్లాత్‌లకు—డిజైన్: జి. ఎస్. వాణి (వేటపాలెం)

# సైన్యంలో కుటుంబ నియంత్రణం

జనాభా పెరుగుదలను అరికట్టకపోతే, పాడిపంటల, పరిశ్రమ అభివృద్ధికి పంచవర్ష ప్రణాళికల ద్వారా చేస్తున్న కృషి ఫలితాలు కొరగానివై పోతాయని ఈనాడు అందరూ గుర్తించారు. ఇపుడు పెరుగుతున్న లెక్కన, ఆటకాలేమీ లేకపోతే 45 ఏళ్లలో భారత దేశం జనాభా రెట్టింపు అవుతుంది. ఇపుడున్న జనానికి అన్నవస్త్రాలు ఎలా చాలటం లేదో, అప్పుడుండగల జనానికి అప్పటికి మన పరిశ్రమలు ఎంత విస్తరించినా అప్పటి ఉత్పత్తులు చాలవని అంచనాలు వేశారు. స్వాతంత్ర్యం వచ్చినప్పటినుండి మన ప్రభుత్వం ఈ సమస్య గురించి ఆలోచిస్తూనే వుంది. అప్పట్లోనే ఈ విషయమై కార్యక్రమాలు వేసి ప్రయత్నాలు ఆరంభించిన వారిలో సైనికాధికారులను ముందు చెప్పుకోవాలి. 1949 లోనే భారత సైనిక దళాలలో ఈ విషయమై ప్రచారం ఆరంభించారు. సైనిక ఆరోగ్య సంక్షేమ ప్రణాళికలు దీనిని చేర్చి, సంతాననిరోధానికి సలహాలో ఇచ్చి సహకరించే సదుపాయాలు ప్రవేశపెట్టారు. 1951 లో వివిధ సైనికదళ సంక్షేమ కేంద్రాలలో కుటుంబ నియంత్రణ సలహా కేంద్రాలు కూడా నెలకొల్పారు. మూడేళ్ల తరువాత, ఔట్ పేషెంట్ శాఖలు గల మిలిటరీ ఆస్పత్రులన్నిటిలోనూ ఈ కేంద్రాలను ఏర్పాటు చేయ నిశ్చయించారు. వివిధ దళాలలో పనిచేసే చిన్న కేంద్రాలకు సలహాలు ఇవ్వడం వాటిని మంచి పద్ధతులలో నడపడం కొన్నాళ్లు వీటికి ముఖ్య కార్యక్రమంగా వుండేది. అలా చిన్న సెంటర్లు గూడా లేని దళాలకు ఇవే సహాయ సహకారాలు కల్పించేవి. మొత్తంమీద ఈ పథకం క్రింద సైనిక వైద్యశాలలో 45 కుటుంబ నియంత్రణ కేంద్రాలు స్థాపించబడ్డాయి. వాటిలో సంతాన నిరోధానికి అనుసరించదగిన మార్గాలు—శస్త్రచికిత్స సదుపాయాలుసహా వచ్చినవారికి వివరించి నచ్చచెప్పేవారు. ఉపన్యాసాలు ఇప్పించేవారు. ఏ పద్ధతివల్ల ఏమి జరుగుతుందో బొమ్మల ద్వారా చూపించేవారు.

గడచిన పదేళ్లలో సైనికదళంలో ఈ కార్యక్రమానికి 25 వేల రూపాయలు ఖర్చు పెట్టారు. కుటుంబ నియంత్రణంపై నిర్మించిన చలనచిత్రాలు—ఇంగ్లీషు హిందీలో తీసినవి 42 వరకు ప్రదర్శించారు.

మిలిటరీ ఆస్పత్రులలో పురుళ్లకు వచ్చే వారిలో, పురటాలు మూడవబిడ్డని కనబోయినపుడు, ఆమె భర్తను సంతాన నిరోధానికి శస్త్రచికిత్స చేయించుకోమని అధికారులు సలహా యిస్తారు. ఇది మంచి ఫలితాలను ఇచ్చింది. చాలమంది సైనికులు, సైనికాధికారులూ కూడా ఇలా ఆపరేషన్లు చేయించుకొన్నారు.

ఆపరేషన్ అవసరం లేకుండా, సంతాన ప్రాప్తిని నివారించే ఒక మందు ఇపుడు కనిపెట్టారు. ఇది పుచ్చుకుంటే ఎంతవరకు పని చేస్తుందో తెలుసుకోవడానికై ఇప్పుడు మీరట్ కేంద్రంలో కొన్ని కుటుంబాల వారికి దీనిని ఇచ్చి ఫలితాలు చూడాలని ఆలోచిస్తున్నారు. ❖

# వనితా వాణి



## ప్రచారం చేసేవారికి నమ్మకం ఉందా?

కొంతకాలంనుంచీ వనితాలోకంలో ఫామిలీ ప్లానింగు సమస్యగురించి కొందరు ఎవరికి తెలిసినది వారు రాస్తున్నారు. ఆ వ్రాసినవారిలో కొంతమంది ఈ సమస్య యొక్క ఉపయోగాలు గురించీ, కొందరు పొగడుతూ, కొందరు హేళనచేస్తూ అనేక విధాలుగా రాస్తున్నారు. శ్రీమతి ఇందిరా రాజ్ గారు రాసినదాన్ని గురించి చాల మంది బలపరుస్తూనూ మిదుమిక్కిలి పొగడుతూ రాశారు. ఒక సోదరుడు ఇందిరా రాజ్ ను బలపరుస్తూ, "ఆపరేషన్ చేయించుకున్నాక కూడా తనకు తెలిసినవాళ్లలో ఒకళ్లకు పిల్లలు పుట్టారని" రాశారు. ఇందిరారాజ్ కూడా ఆపరేషన్ అనంతరము గూడా తన స్నేహితురాలికి పిల్ల పుట్టిందని వ్రాశారు. అసలే దీనికి కాలపరిస్థితులు ప్రతికూలంగా ఉండగా ఆపరేషన్ చేయించుకోవడం, ఇంతా జేసి చేయించుకున్న తరవాత పిల్లలు పుట్టడం ఇదంతా చాలమందికి అయోమయంగా కనిపిస్తోంది. ఎక్కడో ఒకరిద్దరికి మాత్రమే ఆపరేషన్ అనంతరము పిల్లలు పుట్టారని అంటారేమో! ఆ విధంగా మరికొందరికి జరగకూడదని నమ్మకమేమిటి? ఆ విధంగా ముందు ముందు శస్త్రచికిత్స చేయించుకున్నవాళ్లకి జరిగే అవకాశముంది గదా! అదీగాక ఈ నియంత్రణం గురించి సరియైన సలహాలుగూడ ఎక్కువగా లభించుటలేదు. అక్కడక్కడ ఈ కుటుంబనియంత్రణకు సంబంధించిన క్లినిక్ లు ఉన్నప్పటికీ అవి చాలావరకు సక్రమంగా లేవని చాలామంది అభిప్రాయం. ఎవరైనా ఒకరు సలహాకోసం డాక్టరు దగ్గరకు వెళ్లారనుకోండి. ప్రచారం చాలా జరుగుతోందిగాని సరిగా సలహా చెప్పే డాక్టరెవరండీ! (అసలు లేరనికాదు) ఆ డాక్టరు ఏదో చెప్తాడు; వీళ్లేదో చేస్తారు. ఒక్కొక్కప్పుడు చెడు పరిణామాలకు కూడా దారితీయడం కద్దు.

నేను చాలవరకు అన్నివిషయాలు తెలిసికొనే రాస్తున్నాను. నేను ఎరుగున్న ఒకళ్లిద్దరు ఇట్లాగే ఒక డాక్టరుయొక్క సలహా తీసుకొని ఆ విధంగా అవలంబించారు. ఆతరవాత ఇద్దరూకూడా ఇపుడు మానసికంగానూ, శారీరకంగానూ బాధపడుతున్నారు. శ్రీమతి విజయంగారు కూడా చాల రాశారు. వారు చివరలో "ప్రతి డాక్టరు మీ ఫామిలీ ప్లానింగ్ కై సంపూర్ణ సహాయం చేయడానికెల్లప్పుడూ సిద్ధంగానే ఉంటారు" అని రాశారు. ఇది జరగటం లేదు.

కొందరు వైద్యులే దీనికి ప్రతికూలంగా ఉన్నారు! ఈ పద్ధతులను వీరే చాలమంది అవలంబించడం లేదు. అవలంబించానికి వీలేక కాదు; ఏం చేస్తే ఏ ప్రమాదం సంభవించునోయని వారికి అనుమానంగా ఉంది. అటువంటప్పుడు ఆ డాక్టర్లు మనకేం సలహాలిస్తారు చెప్పండి, మనవంటి కొంచెం తెలిసినవాళ్ళు ఏదో అవస్థపడి సక్రమంగా అవలంబిస్తారు సరే ఏమీ తెలియని ప్రజానీకం ఉంటారు. వాళ్ళు ఏదో కుటుంబనియంత్రణ క్లినిక్ లకు వెళ్ళి అడుగుతారనుకోండి. అక్కడేదో డాక్టర్లు చెప్తారు. ఆ విధంగా చేస్తే సక్రమంగా జరుగుతుందనే నమ్మకం లేకపోతోంది. అసలు జరగదని కాదు. ఆ నమ్మకం లేకపోతోంది.

మరొకమాట మాకు బాగా తెలిసిన ఒక డాక్టరుగారున్నారు. ఆయన చాలా పేరు ప్రఖ్యాతులు గడించిన పెద్ద అనుభవశాలి. ఆయన చెప్తుంటారు: "ఈ ఫామిలీ ప్లానింగు కోసం ఆపరేషన్ చేయించుకున్నవానికి మొదట కొంతకాలం కామం అధికంగా ఉంటుంది. క్రమేణా ఇది పూర్తిగా నశించిపోతుంది. తరవాత మనిషి లావుగా పెరగడం ప్రారంభిస్తాడు. ఇక అప్పటినుంచి బుర్ర బండబారిపోయి, తెలివిహీనుడయి మొద్దావతారంగా తయారవుతాడు."

ఇదే గనక పూర్తిగా నిజమైతే ఎంత నష్టమో ఆలోచించండి. ఇది నిజమని ఆపరేషన్ చేయించుకొంటే నష్టాలున్నాయని చాలమంది చెప్తున్నారు. ఆపరేషన్ పద్ధతిగాకుండా ఇతర పద్ధతులలో కూడా కొన్ని నష్టాలున్నాయని వారి అభిప్రాయం. లాభాలుండవని కాదు. ఏదీ గట్టిగా, నమ్మకంగా చెప్పలేకుండా ఉన్నారు. ఈవిధంగా వ్రాస్తున్నందుకు వనితాలోకం పాఠకులు నన్ను మన్నిస్తారని ఆశిస్తాను. నేను ఎవరినీ ఏమీ అనే ఉద్దేశ్యంతో రాయటం కాదు. కాని దీనిలో అనేక సాధకబాధకాలున్నాయనీ, మనం ఏదో వనితాలోకంలో ఎవరికి తోచినట్లు వారు రాసుకున్నంత తేలిక గాదని (రాయదని గాదు. రాయడం మంచిదే) చాలమందికి తెలిసినా, నేను రాస్తున్నందుకు ఫరవాలేదనే అనుకుంటున్నాను.

కనుక క్షేమంలేకుండా మనవంటి ఇతర చిన్న, పెద్ద [illegible] ఎవరికి



గతమాసం 26 వ తేదీన శ్రీ హాత్తీరాంజీ మఠాధిపత్యం స్వీకరించిన తిరుమలతిరుపతి మహంతు శ్రీ చేతన్ దాసుజీ. వీరు శ్రీ మహంతు ప్రయాగదాసువారి శిష్యులు.



డిట్రాయిట్‌లోని భారత-అమెరికన్ సాంస్కృతికసంస్థ అధ్వర్యాన రిపబ్లిక్ దినోత్సవం జరిగింది. కుమారి జోనాలి కాన్‌పర్ట్ భారతదేశంలో ఉండగా నేర్చుకున్న భరతనాట్య భంగిమలు అభినయించింది. శ్రీ ప్రభాకర్ సేఠ్ (మిచిగన్ విశ్వవిద్యాలయ పట్టభద్రుడు), శ్రీమతి భారతిపటేల్ ప్రభృతులు ఇందులో ఉన్నారు.

# వనితావాణి

చేతనయిన తీరులో వారు శ్రద్ధవహించడం మంచిది. దేశంలో అందరూకూడ శ్రద్ధ వహిస్తే దేశసౌభాగ్యానికి తోడ్పడమివ్వ వచ్చు. ఈ సమస్యగురించి ప్రభుత్వం ఇంకా సమగ్రమైన పథకాలు అమర్చి, సమ్యకం, ఓపిక ఉన్న వారిచే ప్రచారానికి కులపాలకు నియమించి, ఏమీ లోపాలు లేకుండా ఏర్పాట్లుచేస్తే ప్రజలు కూడా ముందుకువచ్చి అవలంబించినట్లు ప్రోత్సాహకరంగా ఉంటుందనీ క్రమేణా అధికసంతాన సమస్యను నిర్మూలించ వచ్చు ననీ మనం ఆశించవచ్చు.

సి. శోభారాణి.



శ్రీమతి గార్గీ యాజ్ఞవల్క్య వ్రాసిన "కుటుంబనియంత్రణ—స్త్రీల గురుతర బాధ్యత" చాలా బాగుంది. ఈ వ్యాసం చదివి పూర్వాచారములను వదిలి మహిళలందరు కుటుంబ నియంత్రణ ఉద్యమ వ్యాప్తికి పాటుపడతారని ఆశిస్తున్నాను.

వి. సీతారామమ్మ, (పోరంకి, కృష్ణాజిల్లా).

* * *

"ముచ్చటగా ముగ్గురు పిల్లలతో" శ్రీమతి విజయంగారు వ్రాసిన ప్రత్యేక వ్యాసం చాలాబాగుంది. ప్రతీడాక్టరూ వారు వ్రాసినట్లు ఫామిలీ ప్లానింగుకై సంపూర్ణ సహకారం, సహాయ్యం చెయ్యడానికి ఎల్లవేళల సిద్ధంగా ఉన్నట్లయితే దేశం బాగుపడుతుంది. ఇకముందు ఇటువంటి వ్యాసాలు తప్పక ప్రచురిస్తారని ఆశిస్తున్నాను.

స్వరాజ్యలక్ష్మి, (కొవ్వూరు).

* * *

శ్రీమతి వి. ఎస్. లక్ష్మిగారు వ్రాసిన "అనుభవం నాకు నేర్పిన పాఠాలు" అన్న వ్యాసం చాలాబాగుంది. ఇది ఒక గుణపాఠం వంటిది కొన్ని కుట్రాలు చాలా సహజంగా చిత్రించారు. అనాదినుంచీ వస్తున్న ఆచారాలను తెలిసో తెలియకో మన్నించవలసివారు ఇకముందైనా జాగ్రత్తపడేందుకు ఈవ్యాసం బాగా వుపకరిస్తుంది. రచయిత్రికి నా ధన్యవాదాలు.

కందుల ఇందిరాలక్ష్మీపతి, (రాజమండ్రి).

* * *

వి. ఎస్. లక్ష్మిగారి "గృహిణిగా నా అనుభవం" వ్యాసం బావుంది. బాంధవ్యపు అక్కరలు రాకపోకల గురించి, కష్టసమయాల లోని ఒకరికొకరుచేసే సహాయము గురించి బాగా రాశారు. అటువంటప్పుడే ఎవరు నిజమయిన బంధువులో అక్కరకురాని చుట్టాలో తెలుస్తుంది.

పి. వి. వల్లీదేవి, (విశాఖపట్నం).

* * *

[illegible] గారు వ్రాసిన '[illegible]' [illegible] వ్రాసినట్లుగా తల్లికి పిల్లభారమా? [illegible] అవతలలో [illegible] చాలాకష్టం. తల్లిదండ్రులు [illegible] [illegible] [illegible] అందులో [illegible] [illegible] [illegible] [illegible] ఉంటారా!

[illegible] ★

# సినిమా

## ఇందుగల దందు లేదని—

"కావలిస్తే హాలీవుడ్ వేపు చూడండి. అక్కడా ఇంతేనట" అన్నాడొక దర్శక నిర్మాత చాలాకోపంగా.

ఆయన చూడమంటున్నది—"బాగున్న ధోరణి అందరూ వేలంవెర్రిగా అనుకరించే ధోరణి."ని

నిజానికి దీనికి ఓద్దేశం అని కాదు. ఏదేశ మేగినా ఎందుకాలిడినా, చలచిత్రచరిత్ర సమస్తం పరస్పరం అనుకరించడం అని ఆయన అభిప్రాయం. ఆమాటా నిజమే. నేటిపరిస్థితులలో సినిమాఅనేది కేవలం కళ్తిలేని వ్యాపారంకాదు. 'జూదం'అంశ కూడా కొంతఉంది. అదే దీనికిప్రాణం, అనిశ్చిత పరిస్థితి, అదృష్ట శక్తిప్రభావం ఇందులో లేకపోతే ఇదేమీ బాగుండదనీ కూడా ప్రసిద్ధ హాలీవుడ్ దర్శక నిర్మాత ఆటో ప్రిమింజర్ (సెయింట్ జోన్) మొన్న న్యూయార్కు టైమ్స్‌పత్రికలో వ్రాశాడు. ఆయనఊహ ఎంతమంచిదన్నదివేరేవిషయం.

మొత్తానికి సినిమాలో లాటరీ లక్షణాలు ఉన్నా వ్యాపారలక్షణాలనుబట్టి పోటీ అనేది కూడా ఉండడంవల్ల కొంచెం తెలివితేటలు కూడా వాడిచూడ్డం మంచిదని ఎంతటి బాక్సాఫీస్ సూత్రాధారిటీఅయినా ఒప్పుకుంటాడు. పోటీఉన్నప్పుడు,ఆపోటీలోఒకదానినొకటి పోటీ చేసుకోడానికవచ్చే సరుకులలో ప్రత్యేకత ఉండాలి. ఆఖరికి సబ్బులలో తలనూనెలలోకూడా ప్రత్యేకత లుంటాయి. మా సబ్బు,నూనెలో ఫలానా కొత్తసరుకు ఉందనినీ, ఇది మరోహాదాంట్లో సెర్చిలైటేసి వెతికినాదొరకదనినీ, కాబట్టి ఫలానాదే కొనాలనినీ, వాళ్ళు చెప్పుకుంటారు.

సినిమాలలో మటుకు ఇలాంటి ప్రత్యేక తలమీద మోజుఉన్నట్లు కనబడదు. హాలీవుడ్‌కు లేకలేక ఒక 'హైనూన్'చిత్రం

(63-వ పేజీ చూడండి)

### సినిమాల ఓనమాలు

రెండోక్లాసు లెక్కల మేష్టారు బోర్డుమీద + గుర్తువేసి "ఇదేమిటో చెప్పగలవా రామూ?" అని అడిగాడు.

"సినిమాల్లోనండీ, రైళ్లు కార్లు పడిపోయినప్పుడు, అబ్బాయిలకి దెబ్బలు తగిలినప్పుడు మొహామ్మీద అల్లాంటిది అంటిస్తారన్న మాటండి" అన్నాడు రాము.

శారదాఫిలిమ్సువారి 'బస్‌కండక్టర్'లో ప్రేమ్‌నాధ్, శ్యామ.





విజయనగరం 'న్యూపూర్ణా థియేటర్'లో ప్రదర్శనానికి ప్రారంభోత్సవం జరిపిన శ్రీమతి భానుమతి.

# వెండితెరమీద మహాపురుషులు

గాంధీ మహాత్ముడి జీవితాన్ని తెరమీద చిత్రించాలన్న ప్రయత్నం నాలుగైదేళ్ళనుండి సాగుతోంది. ఒకప్పుడు, షా నాటకాలను చిత్రాలుతీసిన పాస్కల్ ఇందుకు కృషి చేశాడు. అప్పట్లో గాంధీజీ వేషానికి ప్రసిద్ధ బ్రిటిష్ నటుడు అలెక్ గిన్నెస్‌ను నియోగిస్తారనుకున్నారు. మేకప్‌లో గాంధీ పోలికలు చాలవరకు తెచ్చుకున్న ఒక కన్నడ నటుడిని తీసుకుంటారనీ అనుకున్నారు. జవహర్‌లాల్ నెహ్రూగా చార్లెస్‌బోయర్ నటిస్తాడన్నారు.

ఇప్పుడు తిరిగి, కొలంబియావారు ఈ ప్రయత్నాన్ని ఆరంభిస్తున్నారు. ఆర్నెల్ల క్రితమే ఈ వార్త వినబడింది. కాని, ఇంకా ఇది వార్తా ఘట్టంలోనే ఉందని అలెక్ గిన్నెస్ అన్నాడు. మొన్న కొలంబియా అధ్యక్షుడు లేసీకాస్ట్నర్ బొంబాయిలో, గాంధీ చిత్రనిర్మాణం భారతీయ నిర్మాతల సహకారంతో జరగవచ్చునని సూచించారు. ఈ చిత్రాన్ని శామ్ స్పీగల్ నిర్మిస్తారు. ఆయన ఈ మధ్యనే ఢిల్లీవచ్చి ప్రధాని నెహ్రూతో, మాట్లాడారుకూడా.

ఈ చిత్రం దర్శకత్వం, 'బ్రిడ్జ్ ఆన్ ది రివర్ క్వాయ్' తీసిన బ్రిటిష్ దర్శకుడు డేవిడ్‌లీన్‌కు ఒప్పగిస్తారు. గాంధీజీ భూమికను నిర్వహించడానికి ఉన్నవారిలో అలెక్‌గిన్నెసే అనేకవిధాలా యోగ్యుడు అని భావిస్తున్నారు.

## యక్షప్రశ్నలు

ఇటలీ జపాన్ ప్రభృతి దేశాలతో కలసి చిత్రాలు తీసిన అమెరికా భారతదేశంతో ఎందుకు కలవలేదు అని విలేఖరులు అడిగిన ప్రశ్నకు, "మీ చిత్రాలలో పాటలు చాలా ముఖ్యంగదా" అని కొలంబియా అధిపతి కాస్ట్నర్ టూకీగా జవాబిచ్చారు.

"మాకు కథ ముఖ్యం. అదే ప్రాణం. మరి ఇక్కడ మంచికథ దొరుకుతుందా?" అని ఆయన అడిగారు.

బొంబాయిలో కాస్ట్నర్ గౌరవార్థం దర్శక నిర్మాత మెహబూబ్‌ఖాన్ పెద్ద విందుచేశారు. నటీనటులు, దర్శకులూ, నిర్మాతలూ, చలనచిత్ర వణిక్ప్రముఖులూ, బొంబాయిలో విదేశీఫిలిం సంస్థల ప్రతినిధులూ హాజరయ్యారు.

## నేతాజీ

వెండితెరమీద నిలుపబడగల మరొక జాతీయనాయకుడు 'నేతాజీ సుభాస్‌చంద్రబోస్' భారతి చిత్ర అనే బెంగాలీ ఫిలిం కంపెనీవారు కలకత్తాలో ఇందుకు పూనుకున్నారు. ప్రారంభోత్సవానికి కలకత్తా మేయరు, బెంగాల్ శాసనసభ స్పీకరు వెళ్ళవలసి ఉన్నా, వారు హాజరుకాలేదు.

నేతాజీ బంధువు ఒకరు ఈమధ్యనే ఈ వార్త విని, ఈ చిత్రనిర్మాణం తగదనీ, నేతాజీ గురించిన సమాచారం సమగ్రంగా తెలిసిన మీదట, నెమ్మదిగా కట్టుదిట్టంగా బాధ్యతాయుతంగా చిత్రనిర్మాణం చేయాలితప్ప, తొందరపడి ఆయనను అగౌరవించడం భావ్యంకాదనీ ఒక ప్రకటన చేశారు. బహుశా ఆ కారణంగా, వెళ్ళవలసిన పెద్దలు ఈ ఉత్సవానికి వెళ్ళడం జరుగలేదని అనుకొంటున్నారు.

సుభాస్ చంద్రబోస్ పెద్ద మేనకోడలు



గుడివాడ బాలానంద సంఘంవారు శ్రీ అక్కినేని నాగేశ్వరరావుకు సన్మానం చేశారు. చి॥ బి. ఇందిర సన్మానపత్రం చదివి సమర్పించింది.

లలితాభోస్ ఈ చిత్రనిర్మాణానికి ప్రారంభోత్సవం జరిపారు.

## వినోబా భావే

ప్రసిద్ధ మహారాష్ట్ర నాటకరచయిత, చలనచిత్ర కళాకారుడు అయిన విశ్రామ్ బడేకర్ ను, వినోబా భావేపై ఒక డాక్యుమెంటరీ చిత్రం నిర్మించవలసిందిగా ఫిలింస్ డివిజన్ వారు కోరారు. దీనికి రచన, దర్శకత్వం ఆయనే నిర్వహిస్తారు. బడేకర్ తొలి డాక్యుమెంటరీ చిత్రం లోకమాన్య తిలక్ గత సంవత్సరం సర్వత్రా ప్రశంస లందుకొంది.

'వినోబా' తరువాత, అస్పృశ్యతా నిర్మూలనపై ఈయన ఒక కథా చిత్రం నిర్మించబోతున్నారు. ఈ చిత్రనిర్మాణానికి కాగల ఖర్చును కేంద్రప్రభుత్వం భరించడానికి ఒప్పందం కుదిరింది. అస్పృశ్యత కథావస్తువుగా ఒక చిత్రం నిర్మించడానికి స్క్రిప్టులు పంపమని ప్రభుత్వ సమాచార శాఖ లోగడ కోరింది. వచ్చినవాటిలో ఈయన రచన ఎన్నికయింది.

అస్పృశ్యతపై వచ్చే ఉత్తమచిత్రానికి బొంబాయిరాష్ట్ర ప్రభుత్వం 25 వేల రూపాయిల బహుమతిని ఇవ్వదలచినట్లు ఆమధ్య ప్రకటించింది.

ఈ ప్రస్తావనవచ్చినపుడు తెలుగువారికి, స్వర్గీయ గూడవల్లి రామబ్రహ్మంగారి ఉత్తమచిత్రం, 'మాలపిల్ల' గుర్తుకు రావడం సహజం. అస్పృశ్యతా దురాచారం పోవాలని ప్రచారం చేయడానికి ఇటువంటి ఏర్పాట్లు జరుగుతున్న ఈ సమయంలో ఈ చిత్రాన్ని పునరుద్ధరించి, అవసరమైన ప్రాంతాలలో ఉపయోగించే విషయం ఆలోచించడం వాంఛనీయం. ఇందుకు కారణం రామబ్రహ్మంగారు గొప్పవారు కావడమేకాదు; ఆ చిత్రం ఇప్పటికీ ఇంకా గొప్పదనే అనిపించడం, గొప్పది అయివుండడం.

## చర్చిల్

అమెరికన్ సంస్థ ఎం. జీ. ఎం. వారు 'చర్చిల్' జీవితాన్ని తెరమీద కెక్కించడానికి కృషిచేస్తున్నారు. లోగడ కొందరు ప్రయత్నించగా సర్ విన్‌స్టన్ 'వద్దు' అని ఒక్క ముక్కలో చెప్పిపంపారు. ఇపుడు చిత్రానికి రాసిన స్క్రిప్టును మొదట ఆయనకు చూపించి ఆయన ఆమోదంపొందడానికీ, ఆయనవేషం వేసే నటుడిని కూడా ఆయనకు చూపి ఆ పైననే కథ నడపడానికీ హామీ ఇస్తూ కంపెనీవారు తిరిగి అభ్యర్థించగా చర్చిల్ ఈ విషయం ఆలోచిస్తున్నారని తెలిసింది. కొంతకాలంక్రితం కొందరు ఐన్‌స్టీన్ నులాగే బెదిరించారు. 'వెర్రిలోకం' అనివ్వాారాయన 



ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి సాంఘికచిత్రం 'ఇల్లరికం'లో జమున.

## తెలుగులో 'జల్ దీప్'

1956 వ సంవత్సరానికి బాలల చిత్రాలలో బాగున్న చిత్రంగా రాష్ట్రపతి ప్రశంసాపత్రాన్ని అందుకొన్న 'జల్ దీప్'ను ఆంధ్ర ప్రభుత్వం తెలుగులోకి అనువదించి విడుదలచేయించ సంకల్పించారు. ఈ చిత్రాన్ని బాల చలనచిత్రసంస్థ నిర్మించింది. దర్శకుడు కేదార్ శర్మ.

ఆంధ్ర ప్రభుత్వంవారు ఈచిత్రం తెనిగింపు విషయమై దక్షిణభారత సినీ టెక్నిషియన్స్‌సంస్థ సహాయం కోరారు. ఆ సంస్థ నియమించిన ప్రత్యేక సంఘం వారు, ఈ కార్యనిర్వహణను ప్రసిద్ధ నటుడు ముదిగొండ లింగమూర్తిగారికి ఒప్పగించారు. దీనికి మాటలు గన్నిశెట్టి వెంకటేశ్వరరావు, పాటలు వడ్డాది వ్రాశారు. త్వరలో ఈ చిత్రాన్ని విడుదలజేయడానికి సన్నాహాలు చేస్తున్నారు. 





పద్మశ్రీ వారి "శ్రీ వెంకటేశ్వర మాహాత్మ్యం" సెట్ మీద: పైన- రామారావు, సావిత్రి, శాంతకుమారి; దిగువ: జానకి, పి. పుల్లయ్య. (ఫోటోలు: సోమయాజులు).



పొన్నలూరి బ్రదర్స్‌వారి "దైవబలం"లో గుమ్మడి, జయశ్రీ.

# వార్తా వరణం

నలుగురూ చూడాలని ముచ్చటపడే నలుగురూ కలుసుకున్నపుడు చూస్తున్న నలుగురికీ చాలా సరదాగా ఉంటుంది. అలాటిచోట దర్శకనిర్మాత పి. పుల్లయ్యగారు కూడా ఉంటే సందడి ఇంతా అంతా కాదు. పెళ్ళి సందడిని మించి ఉంటుంది. మార్చి మూడున వాహినీ స్టుడియోలో కూడిన ఇలాటి బృందంలో ఎన్. టి. రామారావు, సావిత్రి, జానకి, శాంతకుమారి, నారదపాత్రధారి ప్రసిద్ధ రంగస్థలగాత్రధారి అయిన సూరిబాబు, ప్లస్ పి. పుల్లయ్య ముఖ్యులు. తన్ను ఆశేనవ్వకుండా అందర్నీ నవ్విస్తూ హుషారైనమూడ్‌లో ఉంచి, పుల్లయ్యగారు ఆ రోజున మూడు సన్నివేశాలు చిత్రించారు. నవవధూవరులు పద్మావతీ శ్రీనివాసులు (అచ్చ తెలుగులో సావిత్రీ రామారావులు) వనవాటికలో మునికోటికి వందనా లర్పించ రావడం అభివందనాలందుకోవడం, అన్నిటా అందరికన్నా హెచ్చైరుకగల నారదమహర్షి శ్రీనివాసుడి వైనం ఎరుగగోరి, ఎదట ఉన్న ఎరుకసానిచేత ఎరుక చెప్పించుకోవడం వగైరా ఘట్టాలతో ఆరోజు పని, ఆటలా పరిభాషలో షూటింగ్ రంగాలా అనిపించింది. చూసేవాళ్ళకి సరదాగానే ఉన్నా వేషాలు వేసేవారికీ, షూట్ చేసేవారికీ (పి. ఎల్. రాయ్.) మటుకు వేడిదీపాల తాకిడిలో, ప్రత్యేకతగల పుల్లయ్యగారి షాట్ కాంపోజిషన్ అందంగా కుదిరేవరకూ మంచి పరిశ్రమ కలిగి ఉంటుందనడానికి సందేహం లేదు.

'వెంకటేశ్వర మాహాత్మ్య'నికి రచయిత ఆత్రేయ. సంగీత రచయిత పెండ్యాల.

* * *

రామచంద్రా ప్రొడక్షన్స్‌వారి సాంఘిక చిత్రం 'ఇల్లాలి అదృష్టమే ఇంటికి భాగ్యం' మార్చి 14 న విడుదల అవుతోంది. సావిత్రి, బాలాజీ నాయికానాయకులు. మాటలు గొబ్బిట వెంకటరావు, కె. వి. ఆర్. ఆచార్య, పాటలు గొబ్బిట వెంకటరావు వ్రాశారు. దర్శకుడు దొరైరాజ్.

* * *

వెనుశిలా ప్రొడక్షన్స్‌వారి 'శ్రీకృష్ణ పాండవయుద్ధం' ఈ నెల నాలుగోవారంలో విడుదల అవుతుంది. నళినీ జయవంత్, సాహూ మోదక్, మహీపాల్ ఇందులో పాల్గొన్నారు. రచయిత అనిసెట్టి సుబ్బారావు.

## ఉత్తమ చిత్రవార్తలు

న్యూయార్కు "ఫిఫ్త్ ఎవెన్యూ సినిమా"లో పథేర్ పాంచాలి చిత్రం ఆర్నెల్ల నించి విజయవంతంగా నడుస్తోంది. ఈ నెల దాన్ని తొలగించి, తరువాయి భాగం 'అపరాజిత'ను విడుదల చేయాలను కున్నారుగాని, ఆ చిత్రం చూడదలచు కున్న వారూ చాలమంది ఉన్నందు వల్ల, తిరిగి 'అపరాజిత'ను వాయిదా వేశారు.

* * *

మూడేళ్లనించి మనదేశంలో పలువురు చూడాలని తహతహలాడుతున్న చాప్లిన్ చిత్రం 'లైమ్ లైట్' ఇన్నాళ్లకు ఈ దేశం వచ్చిందన్న శుభవార్త ఆమధ్య వినబడి అందరికీ సంతోషం కలిగించింది. దక్షిణాదికి ఎప్పుడు వస్తుందో ఇంకా తెలియలేదు గాని, బొంబాయిలో ఈ నెల 9న ఒక ప్రదర్శనం ఏర్పాటు అయింది. బొంబాయి పత్రికారచయితల సంఘం సహాయార్థం నిధి సేకరణకై ఇది జరుగుతోంది. ప్రధాని నెహ్రూ ఈ ప్రదర్శనానికి హాజరవుతారట.

చాప్లిన్ పాతచిత్రమే ఇన్నాళ్లకు వస్తే, కొత్త చిత్రం 'కింగ్ ఇన్ న్యూయార్క్' ఎన్నేళ్లకు వస్తుందన్నది ఊహాకందని విషయంగా ఉంది.

* * *

దేవానంద్, మాలాసిన్హా, అభిభట్టాచార్జీ, ప్రాణ్ శోభాఖోటే నటిస్తున్న జోడు జోడాల ప్రేమకథ 'లవ్ మారేజ్' శంకర జైకిషన్‌ల సంగీతంలో హుషారుగా తయారవుతుంది. దర్శకనిర్మాత సుబోధ్ ముఖర్జీ.

* * *

వహీదా రెహమాన్, రాజేంద్రకుమార్‌లు నాయికా నాయకులుగా దల్‌సుఖ్ ఎం. పంచోలీ 'నిర్మల్' అనే చిత్రం నిర్మిస్తున్నారు. సంగీతం సలిల్ చౌదరి. దర్శకత్వం మహేశ్ కౌల్.

## లూ కాస్టెలో మృతి

ప్రపంచ ప్రసిద్ధ అమెరికన్ హాస్యనటుడు లూ కాస్టెలో (అబాట్ అండ్ కాస్టెలో జంటలో భారీమనిషి) గతవారం గుండె జబ్బు వల్ల హఠాత్తుగా మరణించారు. కాస్టెలో వయసుతోపాటు బుద్ధి పెరగని వెర్రిబాగుల మనిషి పాత్రను అద్భుతంగా చిత్రించాడు. అతడి సన్నని కంఠస్వరం, పసిపిల్లాడి గారాబు చేష్టలూ, పిల్లలనీ పెద్దలనుకూడా అలరించాయి.

ఈ జంట హాలీవుడ్ హాస్యచిత్రాలలో ఒక కొత్త శకాన్ని ఆరంభించి పదేళ్లపాటు చిత్రసీమని పరిపాలించింది. ఒక దశలో, అమెరికన్ చిత్రాలన్నిటా ఎక్కువ డబ్బు ప్రజాదరణ సంపాదించినపాటిలో అబాట్, కాస్టెలోల చిత్రాలు ప్రథమస్థానంలో నిలిచాయి.



శారదా ఫిలింస్‌వారి 'బస్ కండక్టర్'లో శ్యామ, ప్రేమ్‌నాథ్.



'ఇల్లాలి అదృష్టమే ఇంటికి భాగ్యం'లో సావిత్రి, బాలాజీ.

## చిత్రసమీక్ష:

# సుజనా వారి 'సతీతులసి'

ప్రతిమందిని పదిరీళ్ళపాటూ ఆకట్టి కూర్చో పెట్టి సంతోషపెట్టి ఇంటికి పంపించడం— "అందరికీ తెలిసిన విషయాన్నే మనం మళ్ళీ చెప్పినప్పుడు అది, మనం చెప్పినవిధంగా మనముద్రతో ఉండాలి" అన్న సంకల్పం ఉత్సాహం, వాటికితగిన ప్రతిభగల యువకుడిని తొలిసారి దర్శకుడుగా పరిచయం చేయడం—చిరకాలానికి. తిరిగి మధురస్వర లక్ష్మి వరలక్ష్మి మధు మధురగానాన్ని వినిపించడం—ధరించినపాత్రను గౌరవించడం ధర్మమనీ, పాత్రస్వభావాన్నిబట్టి నటనా విధానాన్ని మార్చాలనీ గుర్తించి ఆ పనిచేసే న్యాయశీలి, ప్రజ్ఞాశాలి అయిన నటుడు గుమ్మడి స్థాయిని ఒక్కుమ్మడి పదింతలు పెంచడం—"సతీతులసి" (సుజనాఫిలింస్) చలనచిత్రం చేసిన సత్కార్యాలలో ముఖ్య ముఖ్యమైనవి.

దేవతలను, 1958 మార్కు దృష్టితో, తిరగేసిన టెలిస్కోపులోంచి చూసి, వారికి వికారమైన డైలాగులు తొడిగి హాస్య మాద బోయి ఓడిపోయి హాస్యాస్పదం కావడం ఈ చిత్రం పలికిన అపశ్రుతులలో ఒకటి. అనేకవిధాల ఈనాటిచిత్రాలకన్న మెరుగా ఉన్న ఈ చిత్రం, కొన్ని విషయాలలో ఈనాటి చిత్రాలధోరణికి అద్దంలా తయారు కావడం బాధాకరమైనప్పటికీ, అసహజం కాదనిమటుకు అనిపిస్తుంది. బాక్సాఫీసూత్రాలబలం అలాంటిది.

* * *

కథాసంవిధానం, కథనవిధానం, ముఖ్య పాత్రధారుల నటనలను చక్కగా సమన్వయిస్తూ, ఎక్కడా విసుగ తకుండా, సినిమా స్క్రిప్టు చాదస్తాలకు జడు సన్నివేశాలకు చోటు ఇవ్వకుండా, కథను రక్తి కట్టించడానికి ఛాయాగ్రహణాదికాలను కూడా వాడుకొంటూ ఈచిత్రాన్ని రూపొందించిన యువదర్శకుడిపేరు ఎ. మధుసూదనరావు. పౌరాణికాల కాలం 19 వేల అడుగులకు సమానమైన 211 సినిమా నిముషాలు అయినా, ఈ పౌరాణికాన్ని 15 వేల అడుగులలో ముగించి పదివేలే అనిపించేలా తీశారు. కథ, మాటలూ తాండ్ర సుబ్రహ్మణ్యం, పాటలు ఆరుద్ర, తాండ్ర సుబ్రహ్మణ్యం వ్రాశారు. సంగీతదర్శకుడు పామర్తి. గాయకులు, వరలక్ష్మి కాక, ఘంటసాల, సుశీల, మాధవపెద్ది సత్యం, ఎం. ఎస్. రామారావు. తులసీ జలంధరుల పాత్రలను ఎస్. వరలక్ష్మి, గుమ్మడి నిర్వహించారు. ఇతర నటులు కె. వి. ఎస్. శర్మ, పద్మనాభం, చదలవాడ కుటుంబరావు, మిక్కిలినేని, పేరుమాళ్లు, అమర్‌నాథ్, రామశర్మ, కృష్ణకుమారి, సీత, మాలతి మొదలగువారు.

దానవులు అమృతాన్ని సంపాదించలేకపోవడంఇందులో ముఖ్యవృత్తం. ఈప్రయత్నంలో రాక్షసరాజు జలంధరుడు ముఖ్య పాత్రధారి. ఈ త్రిజగన్నాటకానికి శుక్రాచార్యుడు సూత్రధారి. మోహిని అవతారమెత్తిన విష్ణుదేవుడు రాక్షసులను వంచించి అమృతాన్ని దేవతలవశం చేశాడనీ, దాన్ని తిరిగి సంపాదించి జరామరణాలను జయించ



'సతీతులసి 'దర్శకుడు :
మధుసూదనరావు

డానికి దానవులూ, మానవులూ ఏకమై దండెత్తాలనీ శుక్రాచార్యుడు ఒక మహావ్యూహం వేస్తాడు. ఈ పథకాన్ని ఆచరించడానికి జలంధరుని ఎన్నుకొంటాడు. అతనికి అన్ని విద్యలూ నేర్పి ఉత్తమ లక్షణ లక్షితునిగా తీర్చి దిద్దుతాడు. తరవాత జలంధరుడు తపస్సుచేసి మరణంలేకుండా ఒకవరం సంపాదిస్తాడు. తన తండ్రి జంభాసురుడు ఇంద్రపదవికై తపస్సుచేసినపుడు ఇంద్రుడు అతనిని సంహరించడం, తన వివాహసమయంలో ఇంద్రుడు వంచనాశిల్పం అవలంబించి భార్యపట్ల అపోహ కలిగించి, ఆపైన ఆమెను బలాత్కరించడానికి ప్రయత్నించడం జరగడంతో జలంధరుడు స్వర్గానికి దండెత్తివెళ్ళి ఇంద్రుణ్ణి, దిక్పాలకులనూ పదవీభ్రష్టులను చేస్తాడు. అమృత భాండాన్ని పట్టుకుని ఇంద్రతనయ జయంతి వైకుంఠం పారిపోయినందువల్ల అతని ముఖ్య ఆశయం సిద్ధించదు అప్పుడు ఈసినిమా కథ ముగించడానికై నారదమహర్షి అంతవాడు వచ్చి అబద్ధాలు ఆడడంతో ఇంకా సాగితే బాగుండదని ఆగిపోయింది. ఆయన అంత పనికి వడిగట్టకపోయినా, జలంధరుడి అహంకారం, పరస్త్రీవ్యామోహాంధతవానికి కథాంతానికీ దారితీసి తీరేవే.

మొత్తానికి ఇవన్నీ అమాటచెప్పకపోయినా జలంధరుడుగా 'గుమ్మడి వెంకటేశ్వరరావు ప్రదర్శించిన నటన ఈ సత్యాన్ని అత్యంత శక్తివంతంగా చెప్పగలిగింది. పండితుడు, సదస ద్వివక్షణ గలవాడు, సహృదయుడు అయిన జలంధరుడు ఉత్తమ స్థాయికి పెరగడాన్ని, కామం ఆవరించి క్రమంగా అంధుడై భ్రష్టుడు కావడాన్ని క్రమ విధానంలో మనసుకు హత్తుకునేలా గుమ్మడి చిత్రించాడు. ఆపాత్ర పట్ల గౌరవాన్ని, చివర సానుభూతినీ కలిగించాడు. ఆయనపేరిట గొప్పగా చెప్పుకోవలసిన పాత్రలో ఇది ఒకటి కాగలదు. జలంధరుడు విజయశంఖం పోగొట్టుకొన్న క్షణాన నిస్పృహతో బాధతో కోపంతో శుక్రాచార్యుడు నిష్క్రమించడం కూడా ఈ చిత్రంలోని ఉత్తమ సన్నివేశాలలో ఒకటి. కె. వి. ఎస్. శర్మ ఆక్షణంలో సగంసేపులో తన భగ్న వ్యూహాన్ని రాక్షసజాతికి పట్టిన దౌర్భాగ్యాన్ని అతి సమర్థంగా వ్యాఖ్యానించగలిగాడు. తులసిదేవి పాత్ర ధరించిన వరలక్ష్మి ఇదివరకటి చిత్రాలలాగే, మామూలుగా 'కథోచితం'గా సంతోషం, దుఃఖం వగైరా భంగిమల ముద్రలు ప్రకటించింది. ఆమె పాడిన పాటలూ పద్యాలూ (వరసలు మధురాతిమధురమైనవని చెప్పలేకపోయినా) తీయగా ప్రాణానికి హాయిగా వినిపించి ప్రేక్షకులను పరవశులను చేశాయి. గాయనీమణులలో వరలక్ష్మికి గల ఉన్నతస్థానాన్ని పునరుద్ఘాటించాయి. మానస సరోవరం సెట్ మీద సుశీల పాడిన పాట ఒకటి మనోహరంగా ఉంది. నారదుడికి ఘంటసాల, మల్లిక్ పాడిన పాటలూ పద్యాలూ కూడా బాగున్నాయి. వరసలలో కొత్తదనం లేకపోయినా వినడానికి సంగీతం హాయిగా ఉంది.

* * *

సీత, చదలవాడ కుటుంబరావు ఇందులో చూడముచ్చటైన హాస్యాన్ని సృష్టించారు. జానపద పౌరాణికాల ట్రేడ్ మార్కు వేషాలే అయినా అశ్లీలాలు లేకుండానే ఆహ్లాదకరంగా నటించారు.

ఈ ఉత్తమాభిరుచినే ఇంద్రాదిదేవతలకు నారదాది మహర్షులకు కూడా వర్తింపచేస్తే బాగుండేది. వాళ్ల మాటలూ చేష్టలూ చాలా

కలిగా చెప్పకోతగనివిగా ఉన్నాయి. సినిమాలలో వేషాలు వేసివేసి నారదుడు చివరకి కపటి అందుగా, అసత్యవాదిగా తయారయ్యాడు. రేపొద్దున ఇంకా ఎంతటి ఓఘాయిత్యాలు జరుగుతాయో చెప్పలేము. ఇంతకీ ఇది, దేవతలను, వారిమీద పగబట్టిన పాత్రలు పరాభవించడానికి ఉద్దేశించినది. అదేదో ఆ పాత్రలు చేయలేనందువల్లనో, ఒప్పకోనందువల్లనో దర్శక రచయితలే స్వయంగా పరాభవించబోయినట్టుంది. అందువల్ల జనం ఇదిచూసి నవ్వేబదులు నవ్వి పోతున్నారు.

* * *

ఈ కాస్త చూసి నవ్వుకున్నా, మిగతా భాగం అంతాచూసి ఆనందించడానికి తప్పక చూడతగ్గచిత్రం 'సతీతులసి'. ఈ చిత్రం మార్చి 7 న ఆంధ్రలో విడుదల అయింది. మూడునవిజయాస్టుడియోలో పత్రికలవారికి చూపించారు. ★

## దక్షిణభారత నటుల సంఘం

దక్షిణభారత కళాకారుల సంఘానికి శ్రీమతి అంజలీదేవి అధ్యక్షురాలుగా ఎన్నిక అయింది. (గతసంవత్సరం ఈ సంఘం అధ్యక్షుడు శ్రీ ఎం. జి. రామచంద్రన్) శ్రీమతి ఎస్. ఆర్. జానకిఅమ్మాళ్, శ్రీ ఎం. ఎం. చిదంబరనాథన్ ఉపాధ్యక్షులుగానూ శ్రీ డి. వి. నారాయణస్వామి కార్యదర్శిగాను, శ్రీ ఎం. కోసలరాం కోశాధికారిగానూ ఎన్నిక అయారు.

సంఘానికి భవనం నిర్మించడంలో సభ్యులంతా సహకరించాలని అంజలీదేవి విజ్ఞప్తిచేసింది.

దాదాపు 14 వేల [illegible]

## స్వీకారం

**సినీరమ:**

సినిమావార్తా పక్షపత్రిక. చలనచిత్ర నిర్మాతలు పొన్నలూరి బ్రదర్స్‌వారు యీ పత్రిక ప్రచురణకర్తలు. ఆర్టుపేపరుపై త్రివర్ణ ముఖచిత్రంతో, పుష్కలంగా ఛాయాచిత్రాలు పొందుపరచిన 40 పుటలతో తొలిసంచిక డెమ్మీసైజులో వెలువడింది. ప్రముఖనటుడు శ్రీ ఎన్. టి. రామారావుతో గోష్ఠి; చలనచిత్ర వణిక్ప్రముఖుడు శ్రీ సుందరలాల్ నహతాపై వ్యాసం, సెట్‌మీద సందడి, తారలు సరదాలు మొదలగు సినిమా శీర్షికలూ, చిన్నకథలూ, వ్యాసాలూ వగైరాలతో ఆకర్షణీయంగా వుంది. సంపాదకుడు శ్రీ గోటేటి శ్రీరామారావు.

ప్రతివెల 31 నయాపైసలు.



'లాజ్‌వంతి' చిత్రంలో బల్‌రాజ్ సాహ్నీ, నర్గీస్.

# డీలక్స్ ఫిలింస్‌వారి 'లాజ్‌వంతి'

'లాజ్‌వంతి' చిత్రకథ రెండురీళ్ళు తిరిగే సరికి,— "పది రూ. లు పందెం. ఇది ముఖ్‌రాంశర్మ (రాసిన) కథ" అన్నాడు ఒక సహదర్శి బోర్లగిలాపారపడుతూ. ఇంకోరీలు తరవాత లేచి 'సారీ.' అన్నాడు టూకీగా. తరవాత మాటాడలేదు. శ్రద్ధగా సినిమా కడతేరా చూసి బాగుంది అన్నాడు!

'తలాకీవారినూ' వచ్చినప్పట్నుంచి మొన్న తలాక్‌దాకా ఒక్క వరసన పండిట్ ముఖ్‌రాంశర్మ ఒకే వస్తువుని తిరగా మోతాదు ఉత్పత్తి చేస్తూన్న సినీకథల పోలికలోనే ఇదీ రూపొందినా, ఇందులో చెప్పకోతగ్గ మార్పులూ, రెండు కథలూ ఉన్నాయి. అపోహలపాలైనాలం పెడికి అలుమగలు వేరై క్షోభపడడం, పదేళ్ళ తరువాత భర్త భార్యని వెతుక్కోవడం వాళ్ళు కలుసుకోవడం మొదటికథ; వాళ్ళు వేరైనపుడు తండ్రిదగ్గర ఉండిపోయిన రెండేళ్ళపిల్ల, కుమారి నాజ్ సైజుకి పెరిగి, తన తల్లి సవతితల్లి అని పట్టుపట్టడం విడటడం రెండోకథ. రెండూ సుపరిచితమైనవే; వాటి బాటకూడా బాగా నలిగినదే. అయినా, దర్శకుడు నరేంద్రసూరి, ఛాయాగ్రహణ దర్శకుడు ఎం. ఎస్. మల్హోత్రా ఈ కథను తెరమీద ఆవిష్కరించడంలో చూపిన నైపుణ్యం ఈ చిత్రానికి విలువను చేకూర్చింది. ఇటీవలి చిత్రాలలో ఇది ఉత్తమ చిత్రం, పరిపక్వమైన దృష్టితో చూచి తూచి చెప్పిన నటించిన కథ అనిపించ చేసింది. ఇందుకు ముఖ్యనటులు నర్గీస్, బల్‌రాజ్ సాహ్నీ చాలా దోహదంచేశారు.

కాకతాళీయాలవాలమైన ఈ కథలో లాయర్ నిర్మల్‌కుమార్ భార్య కవితకు పేద్ద సినిమార్కు ఇల్లు సెట్టు వేయించి, డబ్బూ, కారూ ఒక పియానో, ఎత్తుకోడానికి ఒక పాపాయి, విసుగెత్తినపుడు పాప నాడించడానికి ఒక దాదినీ సమకూర్చామన్న ధీమాలో నిరంతరం కోర్టుగొడవలలోనే ఉంటాడు.

(అతను ఇంట్లోఉన్న పదినిముషాలలోనూ మూడునిముషాలు నర్గీసు ఫిల్మ్‌సాంగు ఒకటి పాడి భయంకరమైన డాన్సు చేసెయ్యడం అనేదే అతను ఎప్పుడూ ఇంటిపట్టున ఉండకపోడానికి అసలు కారణం అని అనుమానం వేస్తుంది. ఈ చిత్రంలో ఆపాట, నర్గీసు డాన్సు చూస్తే, చేసేవాళ్ళమాట ఎలా ఉన్నా చూసేవాళ్ళకి సిగ్గేస్తుంది.)

కవిత, ఇన్నివున్నా భర్తకి అపేక్ష లేదని బాధపడుతూ ఉంటుంది. అప్పుడు వాళ్ళ బాల్యస్నేహితుడు, చిత్రకారుడు అయిన సునీల్ సీమనుంచి వస్తూనే వాళ్ళఇంటికి, దరిమిలా జీవితంలోకి ప్రవేశిస్తాడు. భర్త ఒకరోజున తీరుబాటులేక చీరెలు కొనుక్కోడానికి సునీల్‌ను, కవితను వెళ్ళి రమ్మన్నందుకే లోకులు ముక్కున వేలేస్తుంటారు.

## 'లాజ్‌వంతి'

అది తెలిసీకూడా వాళ్ళిద్దరూ అదేపనిగా కోరడన్ని సూపరింపోజు షాట్‌లలో మిరి మీరి కోర్కెలు తెలాయిస్తారు. అప్పుడు సహజంగానే పుకార్లు చెలరేగుతాయి. కవితని తనగదిలో కూర్చోపెట్టి సునీల్ ఒక వర్ణచిత్రాన్ని వేస్తూవుండగా, లాయరు నిర్మల్ పుకారుమీద అక్కడికివచ్చి, ఈ కథ ముందుకు సాగడానికి అవసరమైన డైలాగు ఒక్కటీ వినేసి, ఈకథకి పనికొచ్చే కోణంలోంచి అపోహపడానికి పనికొచ్చేదృశ్యం ఒక్కటీ చూసి చిక్కమొహంపెట్టి ఇంటికి వెళిపోతాడు. భార్య ఇంటికిరాగానే ఆమెని తిట్టి కొట్టి ఇల్లు వెళ్ళగొట్టి, పిల్లని తనదగ్గర వుంచుకుంటాడు. మర్నాడు ఉదయం సునీల్ వచ్చి అసలుసంగతి చెప్పేసరికే కవిత ఊరునించి పారిపోతుంది. నిర్మల్ సునీల్ ఆమెను వెతకడంలో-సినిమా కథల సంప్రదాయాన్ని మర్చిపోకుండా, దారితప్పడం వల్లనో, కారు చెడడంవల్లనో ఆమెను కలుసుకోకుండా వుండడంలో కృతకృత్యులవుతారు. (ఓ రైలుప్రమాదం కూడా ఉంది. నర్గీసు ఫోటోజెనిక్‌గా ఉండేలా కట్టుకుంటుంది ఆ సీనులో.)

పదేళ్ళకి లాయరుకూతురు తను రేణు పన్నెండేళ్ళ దవుతుంది. అప్పటికి రెండోకథ ఆరంభించవచ్చు కాబట్టి ఈసారి నర్గీసు అప్రయత్నంగానే దొరుకుతుంది.

గుండె నీరుచేసే ఒక్కమాటతో బల్‌రాజ్ భార్య మనసు మార్చి ఆమెను తిరిగి ఇంటికి తెస్తాడు. కాని, తల్లి చనిపోయిందనుకుంటున్న కూతురు రేణు, తల్లిని చూసి సవతితల్లి అనుకుని (నర్గీస్ మేకప్ చూస్తే ఎవరికేనా అనుమానం కలుగుతుంది.) దగ్గరకు వెళ్ళదు. ఆమెను ద్వేషిస్తుంది. ఆ కాన్ఫ్లిక్టును మాత్రం సాగతీసేదాకా లాగి ఈ ద్వేషాన్ని చిత్రించి చివరకి ఇంకో కాకతాళీయం ద్వారా దాన్ని చెరిపేసి తల్లినీ బిడ్డను కలిపారు దర్శకుడు.

ఈ విధంగా కృత్రిమ ఘట్టాల మీదుగా సాగిపోయిన ఈ కథను వాస్తవానికి దగ్గరగా లాగి చిత్రించడం అనేది సామాన్యమైన పనికాదు. కష్టసాధ్యమైన ఈ కార్యాన్ని దర్శకుడు నటులూ అతి సమర్థంగా నిర్వహించడం వారి ప్రతిభకు నిదర్శనం. నర్గీస్ ఇందులో చాలా మంచినటన ప్రదర్శించింది. చాలా చిత్రాల తరువాత బల్‌రాజ్ సాహ్నీ కాళ్ళుచేతులా నటించెయ్యడం మానేసి చాలా గొప్పగా - దాదాపు ఆశ్చర్యం కలిగించేటంత నిండుగా తీవిగా పాత్రను నిర్వహించాడు. సహృదయుడైన దర్శకుడు అవకాశం ఇస్తే తను ఇలాంటి ఉత్తమ స్థాయిని అందుకోగలడని అతడు నిరూపించాడు...

భర్తకు క్షమాపణచెప్పి ఇంటికి తెచ్చుకునే సన్నివేశంలో సంభాషణలూ, నటనా చిత్రణా మనసుకు హత్తుకునేలా ఉన్నాయి. అలాగే పిల్లకు తల్లిని పరిచయం చేసే సన్నివేశం కూడా చాలా బాగుంది. 'హంసల కథ'ను చెబుతూ పాడినపాట, పిల్లల మనసు భావాలూ ఆర్కెస్ట్రాగా, దానికి చేసిన చలనచిత్ర చిత్రణ చిరస్మరణీయమైన సన్నివేశాలలో నిలువదగవి.

మిగతా పాటలూ బర్మన్ ముద్రతో, శ్రుతిమధురంగా వినిపించాయి. పాటలన్నీ ఆశా భోంస్లే పాడింది. ★

## ★ చిత్ర లేఖలు ★

ఆర్యా, తమిళహిందీ చిత్రములను తెలుగులోకి 'డబ్' చేసినప్పుడు ఆ తెలుగు తర్జుమా, తర్జుమా తెలుగులాగా ఉంటోందని, భాష అన్వయంగా, అస్వాభావికంగా ఉంటోందని కొందరు బాధపడుతున్నట్లు నాకు కర్ణాకర్ణిగా తెలిసింది. ఇది కేవలం తెలివి తక్కువ. అసలు ప్రపంచలన చిత్రములు రెండు రకములు. ఒకరకం మామూలు 'మూవీస్'. రెండోరకము అధర చలనచిత్రములు లేక 'లిప్ మూవీస్'. వీటిలో అధర చలనమే (లిప్ మూవ్‌మెంట్) ముఖ్యం. హిందీ, తమిళనటుల పెదాల కదలికకు తగిన పదాలు తెలుగులో పడ్డాయా లేదా అనేది ప్రధానం. ప్రేక్షకులు ఎంతసేపూ పెదవుల కదలికే చూస్తారుగాని భావ ఎలాగోడించినా వారికి అనవసరం. ఎక్కడైనా పెదాలూ, పదాలూ కలవకపోతే చటుక్కున చిరాకు పుట్టిలేచి పోతారు. ఆసినిమా 'ఫ్లాప్' అవుతుంది. ప్రజాభిరుచిని బట్టే రచయితలు అట్టి తెలుగు వాడుతున్నారు. కనుక అదేసిసలైన ప్రజల తెలుగు.

"లిప్ సింపతైజర్"

• • *

ఆర్యా, 'మ్యాజిక్కి' గారితో ఏకీభవించే వారిలో నేను ఇద్దర్ని (అసలు శాస్త్రీ కూడా నా పార్టీయే కాబట్టి). దేశవాళీ చిత్రాలలో చందూ మామా డూయెట్ సాంగ్స్, సీన్స్ ఉండకూడదని కొందరు దుష్టులు చేస్తున్న దుష్ప్రచారం నాకు గాభరా కలిగించింది. పబ్లిసిటీ లేకపోతే నేను పడేబాధ, నేను లేకపోతే ఆగిపోయిన కథని కదిపేలాగా ఏం చెయ్యాలో తోచక ప్రొడ్యూసరు డైరెక్టరు పడే బాధా వీళ్ళకేం తెలుసు? నా మేనల్లుళ్ళూ మేనకోడళ్ళూ కూడా అచ్చు పౌర్ణమినాటి నాలాగే సుంద్రంగా నున్నగా ఉన్నారన్న వైనాన్ని, వేరే ఉపమానాలు చెప్పకుండా చూపించిందుకి నేను లేకపోతే ఎలా వల్లనౌతుంది? ప్రేమ ఘట్టాలతో, నేను పాటకీ, ఆటకీ అడ్డు పడకపోతే, వాళ్ళు కొత్తగా ఏం డైలాగులు మాట్లాడుకోగలరుటా? ఒకళ్ళనొకళ్ళు తరుముకుని పరుగెత్తడానికి (కష్టమే అనుకోండి) వెన్నెలకన్న ఎండ మెరుగా?

అసలు అన్నిటికన్న ముఖ్యమైనది నేనూ నామీద పాటా లేకపోతే, ఈనాటి సినిమా కథలు పూర్తిగా మార్చుకోవలసి వస్తుంది కదా! మనవాళ్లు కావలిస్తే సూర్యుణ్ణి తెచ్చే నా స్టుడియోలో కట్టి పడెయ్యొచ్చుగాని, కొత్తరకం కథలు ఎక్కణ్ణించి తెస్తారూ?—

ఇట్లు
స్టుడియో చంద్రుడు.

### కేవలం ప్రమాదం

క్షత్రియుద్ధాలు, గుర్రాల పరుగులు, ఇంకా ఎన్నో అద్భుతాలు ఉన్న తెలుగు జానపద చిత్రం ఆనాడే ఆ హాలులో విడుదలైంది. ఆడియన్స్ రెస్పాన్సు చూసిపోదామని వచ్చిన ప్రొడ్యూసరు హాలుయజమాని వరహాలుగారితో:—

"చూశారా, ఆడియన్సు ఎంత సస్పెన్సులో కొట్టుకులాడిపోతున్నారో. అంతా కుర్చీల అంచులమీద కూర్చుని, ప్రాణాలుగ్గబట్టుకుని చూస్తున్నారు. మంచి రెస్పాన్సే మొత్తానికి," అన్నాడు.

"అయ్యా. మీరు బెంగెట్టుకోనంటే ఒకమాట చెబుతాను. మా హాలులో ఏ సినిమా ఆడుతున్నా జనం అలాగే కూర్చుని చూస్తారు. వెనక్కి జేరబడితే నల్లులు కుడతాయి," అన్నాడు హాలు యజమాని.

కిశోర్‌కుమార్ స్వయంగా ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న చలనచిత్రం 'నీలి ఆస్మాన్' చాలవరకు పూర్తి అయింది. ఇందులో మధుబాల నాయికగా కిశోర్ ముఖ్యపాత్ర నిర్వహించడమేగాక తొలిసారిగా సంగీతదర్శకుడి బాధ్యతకూడా స్వీకరించి సంగీతం సమకూర్చాడు.

*  *  *

కాన్స అంతర్జాతీయ ద్వాదశ చలనచిత్రోత్సవం మే 1 నుండి 15 వరకు జరుగుతుంది. ఈ ఉత్సవానికి మనదేశం తరఫున సంగీతదర్శక నిర్మాత హేమంతకుమార్ ముఖర్జీ తీసిన చిత్రం "నీల్ ఆకాశేర్ నీచే" (నీలాకాశం క్రింద) చిత్రాన్ని పంపడం జరుగవచ్చుననుకుంటున్నారు. దీన్ని రాష్ట్రపతి, ప్రధానమంత్రి మొదలగు వారంతా ఇటీవలలో మెచ్చుకొన్నారు.

రాష్ట్రపతి బహుమతులకు పోటీ చేసే చిత్రాలలోకూడా ఇది ఒకటి. అయితే ప్రాంతీయభాషా (ఇది బెంగాలీ చిత్రం) చిత్రాలలో మంచివి కేంద్రానికి సిఫార్సుచేసే ప్రాంతీయ సంఘం, ఈ చిత్రాన్ని ఆమోదించలేదు. అందుమీదట ఇపుడు హేమంతకుమార్ సరాసరి కేంద్ర సంఘానికి ఒక అర్జీ పెట్టుకొన్నారు—తం చిత్రానికి కలకత్తా సంఘంలో న్యాయన జరగలేదుకాబట్టి కేంద్రసంఘం దాన్ని స్వయంగా చూడాలని ఆయన కోరారు.

హాలీవుడ్‌లోని విదేశీయ పత్రికా ప్రతినిధుల సంఘంవారు, శాంతారాం చిత్రం "దో ఆంఖేఁ బారా హాత్"ను ఉత్తమ చిత్రంగా ఎన్నుకున్నారు.

బహుమతిప్రదానోత్సవానికి హాజరు, బహుమతి అందుకొనేనిమిత్తం దర్శక నిర్మాత శాంతారాం, నర్తకి సంధ్య హాలీవుడ్ వెళ్లారు. ఈ చిత్రాన్ని అమెరికాలోను, యూరప్‌లోను వాణిజ్యస్థాయిలో ప్రదర్శించడానికి కూడా, ప్రయత్నిస్తున్నట్లు శాంతారాం చెప్పారు.



ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి "ఇల్లరికం"లో నాగేశ్వరరావు, జమున.

## ఇంటంగల దండులేదా

(55-వ పేజీ తరువాయి)

పుట్టినపుడు అందరూ ఇంకో "హైమాన్" కావాలిఅని గబాగబా రూపాయిబిళ్ళలు అచ్చుకొట్టినట్లు దానికి ఆరురూపాంతరాలు తీసేసి దెబ్బతిన్నారు. 'మార్ట్'వచ్చినపుడు "మరోమార్ట్"అని కేకవేసి తక్షణం మరో రెండు తీసి (అదేరచయిత, అదేనటులు) కటుక్కున నాలిక్కరచుకున్నారు. ఎన్నిసార్లు నాలికకరుచుకొన్నా, మళ్ళీ 'కొత్తదనంగల చిత్రంరాగానే దాన్ని మూడో నాటికి పాతచింతకాయ పచ్చడి చేసేదాకా ఊరుకోరు. ఒక్కొక్కసారి, ఆ చిత్రం తీసిననిర్మాతలే, మళ్ళీ మరోమారెందుకని అదేకథను, అదేనటులతో రచయితతో, అవేడైలాగులలో సంగీతంతో మళ్ళీతీస్తారు. క్లిఫ్టన్‌వెబ్‌ని, ఎస్టెలిటాని, టామ్ ఇవెల్‌ని ఇలాగే కథమార్చక పాతమార్చడం జరిగింది. దేశవాళీస్థాయిలో మిస్టర్ ఎక్స్‌లు వై జడ్‌లూ మిస్సుమిస్టర్ ఇండియాలు (మిసెస్ ఇండియా రాకుండుగాక) ఇలాగే కురిశాయి.

ఏనాడూ, ఒకచిత్రాన్ని అనుసరించి దించిన చిత్రంగాని, పాటని అనుసరించిన పాటగాని, మాటని అనుసరించిన మాటగాని, నటుడిని అనుసరించిన నటుడుగాని నిలిచి బాగుపడ్డట్టు చిత్రచరిత్రలో కనబడదు.

అయినా అన్నిటా అనుకరణమాత్రం తప్పటంలేదు. విశేషం ఏమిటంటే కొందరు తెలిసో తెలియకో అనుసరిస్తే మరికొందరు "కొందరు అనుకరిస్తున్నపుడు మనం ఎందుకు వారిని అనుసరించకూడదు" అనుకుని, ఆ ధీమాతో, అదేకారణంగా, వారినీ వారి ధోరణినీ అనుసరించే విపరీత ధోరణులే పెరుగుతూ ఉండడం. ★

 

# జీవనలీల



(19 వ పేజీ తరువాయి)

పసివాడికి కొంచెం జ్వరం వచ్చినట్లే ఉంది. గులాబీ రంగులో ఉండేవాడి ఒళ్ళు ఇంకొంచెం ఎర్రబడింది. ఒక్కసారి చూస్తే చాలు చూపు మరల్చుకోలేనంత అందంగా ఉంటాడు. వీడి మూలంగా ఈ యింట్లో ఇంత తుఫాను రేగటం ప్రారంభమైందంటే నమ్మ బుద్ధిపుట్టదు. కుంద చుట్టూ గుమికూడిన ఆడవాళ్ళంతా ఈ దౌర్భాగ్యపు పిల్లవాణ్ణి చూసి అసూయపడుతూనూ ఉంటారు. వాడంటే మళ్ళీ ఆప్యాయత కనబరుస్తూ ఉంటారు. ఆ కుర్రవాడింట్లో ఉంటే తనకి అక్కడ ఉండటానికి ఇష్టం లేదు శశికి. ఎంత కటిక గుండె శశిది!

ఆ రాత్రంతా నిద్రలేకుండా ఉన్న గోపాల్ ఏమాలోచించుకున్నాడో అతడికే తెలియాలి. మర్నాడు ప్రొద్దున్నే కుందని ఆమె కొడుకుని, సేన్‌దిదీ కొడుకుని ఆమె పినమామగారింటికి 'రాజ్ తిలా'కి పంపించివేశాడు.

ఈ పనిచేసేసి గోపాల్ చాలావరకు నిశ్చింతుడైనాడు. శశికి కోపకారణమైనవాడు దూరంగా వెళ్ళిపోయాడు. ఇక శశికి కోపం ఉండదుగా? సేన్‌దిదికి కొడుకు పుట్టడని కాదు అతడి కోపం, వాణ్ణి ఈ యింటికి తీసుకువచ్చాడని తాను ఇల్లు వదలిపోవటానికి సిద్ధమైడు. శశి ఇలా చెయ్యడం అసంగతం. అతడిది అన్యాయపు పట్టుదల. అయినా గోపాల్ తలవంచి శశి ఫిర్యాదుకు ప్రతివిధానం చేశాడు. ఇంక శశి ఇల్లు విడిచిపెట్టి పోతాడా?

ఎవరైనా చెపితే శశికీ విషయం పూర్తిగా చెవికెక్కుతుందో లేదో అన్న ఆ శంకతో, గోపాలే స్వయంగా చెప్పాడితడికి.

"కుందని ఇవాళ అత్తవారింటికి పంపేశాను శశీ!" అన్నాడు

"రాజ్ తిలా కా?"

"ఊఁ. యామిని కొడుకునికూడా ఆమెకిచ్చి పంపేశాను."

యామిని కొడుకు ప్రసక్తి వచ్చేసరికి శశి ఏమీ మాట్లాడలేదు. గోపాల్ మళ్ళీ "కుంద ఇక అక్కడే ఉంటుంది. ఇక ఇక్కడికి రావొద్దు అని ఆమెకి స్పష్టంగా చెప్పేశాను" అన్నాడు.

శశితో కలిసి పన్నాగం పన్ని తానీ పని చేశానన్నట్లుగా గోపాల్ గొంతు తగ్గించి "అసలు సంగతేమిటో తెలుసా? ఒక్క దెబ్బతో రెండుపిట్టల్ని కొట్టేశాను. కుందనీ సాగనంపాను. పరాయి వాళ్ళ పిల్లవాణ్ణి పెంచే బాధ్యతనీ తప్పించుకున్నాను. వెళ్ళాక ఇక వాళ్ళ ఇష్టం ఏమైనా చేసుకోనియ్. నాకేం తెలియదు. ఎప్పుడైనా డబ్బు కావాలని మొరపెట్టుకుంటూ ఉత్తరం రాస్తే అయిదో పదో పంపుతాను. అంతే. సంబంధం వదలిపోయింది"

గోపాల్ ఉద్దేశ్యం అదే అయినట్లయితే, బిపిన్ దగ్గర్నుంచి సేన్‌దిదీ కొడుకుని తాను తీసుకురావలసిన అవసరం ఏం వచ్చిందో శశి ఆ సంగతి అడగలేదు—రక్షించాడు. అడిగితే గోపాల్ సమాధానం చెప్పగలిగేవాడు కాదు. శశిని గోపాల్ విడిచిపెట్టలేడు. సేన్‌దిదీ కొడుకునీ వదిలి ఊరుకోలేడు. అంచేత ఎన్నో ఆలోచించి, ఇలాంటి రాజకీయపు ఎత్తు వేశాడు. దాన్ని సమర్థించుకోటానికి దొంగమాటలు ఒకటి రెండు మాట్లాడకపోతే ఎలా సాగుతుంది మరి!

కొడుకుతో వాదించి, ఏదో అఖండమైన యుక్తిని చూపించాలనే ఉద్దేశ్యంతో అతడిదంతా చెప్పలేదు. 'నేనే ఓడిపోయాను. ఇకనైనా నువ్వు నీ భీష్మ ప్రతిజ్ఞ విడిచిపెట్టరా తండ్రీ' అన్న సంగతి శశికి వ్యక్తపరచాలని చెప్పాడు.

సేన్‌దిదీ కొడుకుని పంపించి వెయ్యటానికి కాకుండా, వాణ్ణి ఇక్కడ ఉంచే ప్రయత్నంలో గోపాల్ ఇంత ఉద్విగ్నపడి ఉన్నట్లయితే—శశి బహుశా తాను ఊరు విడిచిపెట్టి పోదామనే సంకల్పాన్ని వదిలేసేవాడేమో! కానిప్పుడు సమయం మించిపోయింది. అతడి మనసు ముందే పోయి దూరదేశంలో నూతనజీవితంలో తేలియాడుతోంది. ఇక మాట—ముల్లె సర్దుకుని తాను వెళ్ళటమే తరువాయి. అది రెండు మూడు రోజుల్లో జరిగిపోతుంది.

(ఇంకా వుంది)

# చుక్కాని

(36 వ పేజీ తరువాయి)

"ఓ...మా కొట్లో రంగారావా? ఏం ఏం చేశాడూ?"

"నన్ను ఏం చెయ్యలేదు. ఆదిలక్ష్మి ఉన్నది కదా? దాని" ముందు నే నెంత? అయినా దానికి చెపితే సరి.

"నీకూ వాళ్ళకూ స్నేహమూ?"

"స్నేహం లేదు. విరోధంకూడా లేదు. ఇరుగు పొరుగు అంతే. ఎప్పుడన్నా డబ్బు అవసరమైతే అడిగి తీసుకొని మళ్ళీ ఇస్తూంటారు"

"నీ దగర డబ్బు ఉన్నదని...వాళ్ళకు"

"మా అమ్మగారోజులనుంచీ అట్లాగే జరుగుతూ వస్తోంది మరి"

"అంటే ఈ పేటలో నీకు పరపతి ఉన్నదన్నమాట."

"అంటే"

"అంటే గింటే...అది సరే, ఉద్యోగం సంపాదించాను మరి."

"సంపాదించారు డబ్బేదీ..."

"నువ్వుఇచ్చినదా"

"నాది నాకు ఇస్తారా?"

'ఇవ్వమంటే ఇస్తాను."

"లేకపోతే ఇవ్వరు. మరి అన్నలకూ, నాన్నకూ ఇస్తున్నారుగా."

'నాన్న అడుగుతాడు. అన్నయ్యలు అడుగరు. అయినా పిల్లలకే ఇస్తున్నాను."

"ఎవరికి ఇస్తే నాకేం? నా కేమీ ఇవ్వ లేదుగా?"

"ఇవ్వమంటావా?"

"మళ్ళీ అదేమాట. అచ్చే ఏం బాగా లేదు. అది అటా ఉంచండి. నెల నెలా పదిరూపాయలు మీ పేర బ్యాంకులో ఎందుకని వెయ్యలేదూ?"

"డబ్బు ఏదీ?"

"ఏది నన్ను అడుగుతారేం?? ఉద్యోగం సంపాదించాను అంటున్నారు. అని నా వంక అలిగా...నాకు కూడా బాధగా ఉన్నది. ఇంకా ఎన్నాళ్ళని అనిపిస్తోంది... కానీ...ఇది సాధ్యమా...మీవాళ్ళు ఒప్పుకుంటారా..." అని ఖాజాబీబీ ఏడ్చింది. ఆ యేడుపు రామారావుకు కనువిప్పు అయింది.

ఖాజాబీబీ తనకు కావాలి. ఖాజాబీబీ తెలివిగలది. ఖాజాకు అన్నీ తెలుసు. ఈ పెండ్లికి నాన్న ఒప్పుకోడు. నాన్నయే కాదు. ఎవరూ ఒప్పుకోరు పెండ్లి కాకుండా ఖాజా తనవశం కాదు. తనకు దూరంకాదు. తనతో తగాదాపడినా మళ్ళీ ఖాజాయే తనను పలకరించి లాలిస్తుంది. నిజానికి ఖాజా చెప్పేదాంట్లో తప్పేమిటి? తన దగ్గర చిల్లిగవ్వ లేదు. మూడు సంవత్సరాలు ఉద్యోగం చేసినా తనదగ్గర చిల్లిగవ్వ లేదు. బోనసుగా వచ్చిన నాలుగువందలూ కూడా నాన్నకే ఇచ్చాడు. మరి ఈ పెండ్లి కారణంగా తగాదావస్తే...ఏమి చెయ్యాలి?? ఎట్లా ఎట్లా? అని రామారావు మధనపడుతున్నాడు.

ఖాజాసంగతి మరచిపోతే కట్నం తీసుకుని పెళ్ళిచేస్తాడు నాన్న. నాన్నకు కొంత తెరిపివస్తుంది. కానీ, తన ఖాజాకు శాశ్వతంగా ద్రోహం జరుగుతుంది. ఖాజా తనపాలిట దేవత, తనను మనిషిని చేసింది ఖాజా. ఖాజాను వదులుకోలేడు రామారావు. తండ్రిమాటను కాదనలేడు రామారావు. ఖాజాతో పెండ్లికి నాన్న ఒప్పుకోడు. పైగా ఈ సంగతి తెలిస్తే ఖాజాకు కూడా నాన్న అపకారం చేసినా చెయ్యొచ్చు. ఆదివరకటి అయోమయం పోయి కొత్త అయోమయస్థితి వచ్చింది రామారావుకు.

—మిగతా వచ్చేవారం.]

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at
The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras 1. Editor S. Samb...



గృహోన్ముఖులు

—చిత్రం : వీరిశెట్టి అచ్యుతరావు.




# పియర్స్

సొగసైన
వనితా
సాంప్రదాయము!




పియర్స్ సబ్బు—సౌందర్యమును గలిగించే శుద్ధమైన,
గ్లిసరీన్‌తో గూడిన సబ్బు—మీ చర్మమునకు ఎంతో సౌమ్యమైనది.
మీ సౌందర్యమును కాపాడునట్టిది. మీ సౌందర్యముకోసం
పరిమళమైన పియర్స్ సబ్బును వాడుట అలవాటు చేసుకోండి!
పియర్స్ పసిబిడ్డల లేత చర్మమునకు దివ్యమైనది!

పియర్స్ టాల్కమ్...ఎంతో పట్టువంటి—మెత్తనిది, ఎంతో
మనోహరంగా పరిమళ మొనర్చబడినట్టిది...రోజంతా మిమ్ములను
హాయిగాను, సొగసుగాను, వుంచును. ఆకర్షణీయమైన లేత పసుపు,
ఆకుపచ్చ—బంగారు రంగులతోనున్న డబ్బీలో గల
పియర్స్ టాల్కమ్ ను అడగండి!



హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారిచే భారతదేశంలో తయారు చేయబడినది.